

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచిక నుంచి "దుర్గేశనందిని" అనే చరిత్రాత్మక నవల రంగుల బొమ్మ సీరియల్‌గా ప్రారంభమవుతున్నది. ఈ నవల రచించినది సుప్రసిద్ధ బెంగాలీ నవలాకారుడు బంకిమ్‌చంద్ర చట్టోపాధ్యాయ. ఈయన బెంగాలీ నవలా సాహిత్యానికి ప్రాణప్రతిష్ఠ చేశాడని చెప్పవచ్చు. ఈ కథ అక్బరు పాదుషా కాలంలో జరిగినట్టు భావించాలి. "దుర్గేశనందిని" అన్ని భారతీయ భాషలలోకీ చాలా కాలంగా అనువదించబడి ఉన్నది.

సంపుటి 34 జూన్ 1964 సంచిక 6






అవి వర్షారంభ దినాలు. సాయంకాల మయింది. విష్ణుపురం నుంచి మంధారణా నికి వెళ్ళే మార్గంలో ఒక యువకుడు గుర్రం పైన సవారీ అయి, ఒంటరిగా ప్రయాణిస్తు న్నాడు. అతను వెళ్ళే ప్రాంతం ఒక అంతు లేని మైదానం. త్వరలో చీకటి పడిపోతుం దన్న ఉద్దేశంతో ఆ యువకుడు గుర్రాన్ని మరింత వేగంగా నడిపించాడు.

అతను మైదానాన్ని దాటే సరికి సూర్యు డస్తమించి, మేఘాలు కప్పిన ఆకాశాన్ని చీకట్లు ఆవరించాయి.

త్వరలోనే గుర్రానికి దారి కనిపించ కుండా పోయింది. మధ్య మధ్య ఆకాశాన వచ్చే మెరుపుల కాంతిలో అతను దారి చూసుకుంటూ ముందుకు సాగాడు. మరి కొంచెం సేపటికల్లా ఉధృతంగా గాలి వీచింది. దానితోపాటు వాన కూడా సాగింది. యువకుడు ఆపై గుర్రాన్ని నడపలేక, కళ్ళెం విడిచేసి, గుర్రాన్ని దాని ఇచ్ఛ ప్రకారం పోనిచ్చాడు.

కొంత దూరం అలాపోగా గుర్రం కాలికి రాతిగట్టులాటి దేదో తగిలింది. అంతలోనే మెరుపు మెరిసి, యువకుడికి తెల్లని కట్టడం ఏదో కనిపించింది. అతను గుర్రం దిగి చూసే సరికి, గుర్రం కాలికి తగిలినది రాతి మెట్లని తెలిసింది. అతను గుర్రాన్ని అక్కడే వదిలి, ఎక్కడన్నా ఆశ్రయం దొరుకుతుం దేమోనని మెట్లెక్కి ముందుకు వెళ్ళాడు.

బంకించంద్ర చట్టోపాధ్యాయ



మళ్ళీ మెరుపు మెరిసి, దాని కాంతిలో అతనికి ఎదురుగా ఉన్న ఆలయమందిరం కనిపించింది. అతనికి తెల్లగా కనిపించిన కట్టడం అదే.

మందిరానికి గల చిన్నద్వారం బంధించి ఉన్నది. అతను చేతితో తలుపులు తడివి, ఎవరో వాటిని లోపలి నుంచే గడియపెట్టారని గ్రహించి, "ఈ నిర్జనారణ్య ప్రదేశంలో ఈ సమయంలో ఎవరు దాక్కొని ఉంటారు ?" అని ఆశ్చర్యపడ్డాడు.

వర్షం బలంగా కురుస్తున్నది. అందుచేత అతను మందిరం తలుపు మీద దబదబా బాదాడు. కాని లోపల ఉన్నవాళ్ళు వచ్చి తలుపు తెరవలేదు. కాలితో తన్ని తలుపులు విరగ్గొడదామన్న ఆలోచన వచ్చింది గాని, అది అపచార మవుతుందనుకుని, చేత్తోనే మరింత గట్టిగా బాదాడు. ఆ దెబ్బలకే లోపలి గడియ విరిగి పడిపోయింది, తలుపులు తెరుచుకున్నాయి, యువకుడు లోపల ప్రవేశించాడు. లోపలి నుంచి హీనస్వరంతో అస్పష్టంగా ఒక ధ్వని వచ్చింది. అయితే తలుపులు తెరవగానే గాలి లోపల ప్రవేశించి, మందిరంలో మిణుకు మిణుకు మంటున్న దీపం కాస్తా ఆరిపోవటంతో మందిరం అంధకారమయమై అతనికి ఎవరూ కనిపించలేదు.

అతను మందిరంలోని దేవుడికి నమస్కారం చేసి, "లోపల ఎవరు ?" అని గద్దించి ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు సమాధానం రాలేదు గాని ఆభరణాలు చేసే కింకిణీస్వనం మాత్రం విన వచ్చింది.

యువకుడు తలుపులను మూసేసి, వాటికి చేర గిలబడి నిలిచి, "లోపల ఉండే వాళ్ళు నే చెప్పే మాట శ్రద్ధగా వినండి. నేను కత్తి చేతబట్టి మందిరద్వారం వద్ద విశ్రాంతి తీసుకుంటున్నాను. లోపల ఉన్నది పురుషుడై ఉండి, నా విశ్రాంతికి భంగం కలిగించాడో అందుకు తగ్గ ఫలితం తప్పక

పొందుతాడు. లోపల ఉన్నది స్త్రీ అయి ఉంటే సుఖంగా విశ్రమించవచ్చు, నా వల్ల ఎలాటి ప్రమాదమూ జరగదు," అన్నాడు.

కొంచెం సేపట్లో లోపలి నుంచి ఒక స్త్రీ కంఠం మృదువుగా, "తమ రెవరు ?" అని అడిగింది.

అతను ఆ కంఠానికీ, ప్రశ్నకూ ఆశ్చర్య పడి, "నే నెవరో తెలుసుకున్నందు వల్ల ఏమిటి ప్రయోజనం ?" అన్నాడు.

"మేం చాలా భయంలో ఉన్నాం," అని అదే కంఠం జవా బిచ్చింది.



"నే నొక యువకుణ్ణి. మీ రెవరో తెలుసుకో కుండా నే నెవరో చెప్పటానికి వీల్లేదు. నా వల్ల మీ కెలాటి విఘ్నంగాని, కష్టంగాని కలగదు. ఆ భయం మీ కేమీ అవసరం లేదు," అన్నా డతను.

"మీ మాటలు మాకు ధైర్యాన్నిచ్చాయి. ఇంతకు ముందు ప్రాణా లరచేత పట్టుకుని ఉన్నాం. సంధ్యాసమయాన మేము ఈ శైలేశ్వరాలయంలో శివుణ్ణి పూజించ వచ్చాం. పూజ పూర్తి అవుతూండగానే పెద్దగా గాలి వాన వచ్చింది. మా పరివారమూ, వాహనాలూ మమ్మల్ని విడిచి ఎటో పోయాయి. మే మిక్కడ చిక్కుపడిపోయాం," అన్నది స్త్రీ కంఠం.

"విచారించకండి. ఈ రాత్రికి ఇక్కడే విశ్రమించండి. తెల్లవారి మిమ్మల్ని మీ ఇంటికి చేరుస్తాను," అన్నాడు యువకుడు.

"శైలేశ్వరుడు మీకు శుభా లిచ్చు గాక !" అన్నదా స్త్రీ.

అర్ధరాత్రి గడిచినాక గాలివాన నిలిచి పోయింది. యువకుడు లోపల ఉన్న మనుషులతో, తాను సమీప గ్రామానికి వెళ్ళి దీపం తెస్తాననీ, తాను వచ్చేదాకా వారు ధైర్యంగా ఉండాలనీ అన్నాడు. లోగడ అతనితో మాట్లాడిన స్త్రీ, దీపం కోసం ఎంతో దూరం వెళ్ళ నవసరంలేదనీ, ఆలయాన్ని కని పెట్టుకుని ఉండే మనిషి ఇల్లు దగ్గిర



లోనే ఉన్నదనీ, అరణ్యం మధ్యంలో నివసిస్తాడు గనక అతని ఇంట్లో అగ్నిపంకరా లెప్పుడూ ఉంటాయనీ అన్నది.

యువకుడు మందిరంలో నుంచి బయటికి వచ్చాడు. బయట వెన్నెల కాస్తున్నది. ఆ వెన్నెల కాంతిలో మందిరానికి సమీపంలో కాపలా కాసే వాడి కుటీరం కనిపించింది. యువకుడు అక్కడికి వెళ్ళి కాపలావాణ్ణి లేపాడు. కాని వాడు వెంటనే తలుపు తెరవటానికి భయపడ్డాడు; తలుపు సందుల్లో నుంచి యువకుణ్ణి పరీక్షగా చూసి, యువకుడిస్తా నన్న బంగారు నాణాల ప్రోత్సాహంతో తలుపు తెరిచి, దీపం వెలిగించాడు.

యువకుడా దీపంతో మందిరానికి తిరిగి వచ్చాడు. మందిరం లోపల పాలరాతితో చేసిన శివలింగం ఉన్నది. దాని వెనకగా ఇద్దరు స్త్రీ లున్నారు. వారిలో ఒకతె నవయౌవని. ఆమె దీపం చూస్తూనే, మేలి ముసుగుతో సహా తన ముఖాన్ని వంచేసుకున్నది. కాని ఆమె ధరించిన దుస్తులూ, రత్నాలు పొదిగిన శిరోభూషణమూ, ఇతర నగకట్టూ చూస్తే ఆమె గొప్ప వంశానికి చెందినట్టు తెలుస్తూనే ఉన్నది.

రెండవ స్త్రీకి ముప్పైఅయిదు సంవత్సరాలుండవచ్చు. ఆమె ధరించిన దుస్తులు అంత ఘనంగా లేవు. అందుచేత ఆమె మొదటి అమ్మాయికి పరిచారిక అయి ఉంటుందనీ, కేవలమూ పరిచారికలాగా కనబడటం ఇష్టంలేక, అంతకంటె ఉచ్చగా కనిపించ యత్నిస్తున్నదనీ యువకుడనుకున్నాడు. ఒక చిత్ర మేమంటె ఇద్దరూ బెంగాలీ స్త్రీల లాగుండక, వేషభూషణాలలో పశ్చిమ దేశానికి చెందిన హిందుస్తానీల లాగున్నారు.

కాంతి అంతటా పడేటట్టుగా దీపాన్ని ఒకచోట ఉంచి, యువకుడు ఆ ఇద్దరు స్త్రీల కెదురుగా నిలబడ్డాడు. దాని వెలుతురులో స్త్రీ లిద్దరూ అతన్ని బాగా చూశారు.

అతని వయస్సు ఇరవైఅయిదు మించదు. మనిషి బాగా ఎత్తుగా ఉన్నాడు, అజాను బాహువు. ఛాతీ విశాలంగా ఉంది, కరచరణాలు బలిష్ఠంగా ఉన్నాయి. మనిషి చూడ ముచ్చటగా ఉన్నాడు. ధగధగలాడే శరీర చ్ఛాయ. లేత చిగురుటాకుల రంగు గల దుస్తులు ధరించి ఉన్నాడు. అతనిలో రాజపుత్ర కళ ఉట్టి పడుతున్నది. అతని నడుముకు ఒరతో సహా కత్తి వేళ్ళాడుతున్నది. ఒక చేతిలో వాడి మొన గల బల్లెం ఉంది. అతని తల మీద తలపాగా, అందులో వజ్రం పొదిగిన తురాయీ ఉన్నాయి. చెవులకు ముత్యాల కర్ణాభరణాలూ, మెడలో రత్నహారమూ ఉన్నాయి.

అతనికీ, ఆ స్త్రీలకూ కూడా పరస్పరం పరిచయం చేసుకోవాలన్న కుతూహలం పుట్టుకొచ్చింది. అతనే ముందుగా తన కుతూహలాన్ని బయటపెట్టుతూ, "మీరు గొప్ప ఇళ్ళకు చెందిన అంతఃపుర కాంతలని తెలుస్తూనే ఉన్నది. కాని మిమ్మల్ని గురించి వివరాలడగటానికి కొంచెం జంకుగా ఉన్నది. ఎందుచేతనంటే, నేనెవరో మీకు చెప్పటానికి కొన్ని ఆటంకాలున్నాయి. మీ కలాటి ఆటంకాలు ఉండవు గనక మీ వివరాలు విన గోరుతున్నాను," అన్నాడు.



పరిచారిక లాగా కనిపించే ఆమె, "స్త్రీలు తమను గురించి ఏమి చెప్పుకుంటారు? రహస్యంగా ఉండటమే వారికి పరువు. వారికొక వ్యక్తి లేదు. ఎవరి పేరు చెప్పి వారు పరిచయం కలిగిస్తారు? తమ భర్తల పేర్లు కూడా నోట ఉచ్చరించరాదాయె," అన్నది.

యువకుడేమీ మాట్లాడలేదు. అతని మనసు నవయౌవని మీద లగ్నమయింది. ఆమె తన పరిచారిక వెనక నుంచి, కొంచెంగా మేలిముసుగు తొలగించి, తదేక ధ్యానంతో యువకుణ్ణి చూస్తున్నది. అతను కూడా తన దృష్టిని ఒకసారి ఆమె కేసి తిప్పి, మళ్ళీ దాన్ని పక్కకు తిప్పలేక



పోయాడు. అటువంటి అందగత్తెను అతను ఎప్పుడూ చూసి ఉండలేదు. వారిద్దరూ ఒకరినొకరు చూసుకోవటంలో చాలా ఆనందం అనుభవించారు.

తానన్న మాటకు యువకు డేమీ అనక పోవటంతో పరిచారిక తల ఎత్తి చూసి, తన సఖికీ ఆ యువకుడికీ మధ్య చూపు లెలా దృఢంగా బంధాలయాయో గమనించి, ఆ అమ్మాయి చెవిలో, "సాక్షాత్తూ శివుడి సన్నిధినే స్వయంవరమా ఏం?" అన్నది రహస్యంగా.

ఆ అమ్మాయి ఆమెను గట్టిగా గిల్లి, "చాల్లే, ఊరుకో!" అన్నది.

ఈ ప్రణయం ముదరకముందే ఆ యువకుణ్ణి అతని దారిన పంపెయ్యటం మంచి దని, లేకపోతే ప్రేమపాశంలో చిక్కుకున్న తన సఖికి బాధ తప్ప ఏమీ ఉండదని అనుకుని ఆ స్త్రీ అతనితో, "అయ్యా, గాలివాన మాకు పెద్ద సంకటం తెచ్చి పెట్టింది. అది తగ్గిపోయింది గనక, ఇక మేము మెల్లిగా నడుచుకుంటూ ఇంటికి పోవచ్చు," అన్నది.

"నిజానికి నేనూ నా గమ్యస్థానానికి వెళ్ళిపోవాలి. కాని మీ సఖిని రక్షణ లేకుండా వెళ్ళనివ్వటం నా కెంత మాత్రమూ ఇష్టం లేదు. అందుచేత నేను మిమ్మల్ని మీ ఇంటి దాకా దిగబెడతాను," అన్నాడు యువకుడు.

"మీకు మా పైన ఎంత దయ! కాని మీరు మీ పని మీద వెళ్ళిపోవలసిందని నా ప్రార్థన. కృతజ్ఞత లేక ఈ మాట అంటున్నా ననుకోవద్దు. స్త్రీలం కావటంచేత మా గురించి అడుగడుగునా అనుమానాలే కలుగుతాయి. మీరు మా వెంట వచ్చి దిగబెడతారే అనుకోండి. మా ప్రభువుగారు, అంటే ఈ అమ్మాయి తండ్రిగారు, ఈ అపరాత్రివేళ ఎవరి వెంట వచ్చారని అడిగితే, ఈమె ఏమని జవాబు చెబుతుంది?" అన్నది పరిచారిక.

యువకుడొక్క క్షణం ఆలోచించి, "మానసింహ మహారాజు కొడుకైన జగత సింహుడి వెంట వచ్చానని చెబుతుంది," అన్నాడు. అతనా మాట అనే సరికి ఆ స్త్రీ లిద్దరూ మందిరం పైన పిడుగు పడ్డంతగా కంగారు పడ్డారు. ఇద్దరూ చప్పున లేచి నిలబడ్డారు. పరిచారిక చీర కొంగు కంఠానికి చుట్టుకుని, ఆ యువకుడి కాళ్ళకు వందనం చేసి, చేతులు కట్టుకుని నిలబడి, "యువరాజా, తెలియక అపరాధం చేశాం. మన్నించండి," అన్నది.



జగతసింహుడు చిరునవ్వు నవ్వి, "మీరు చేసిన అపరాధాలేవీ క్షమిస్తానుగాని, మీ విషయం చెప్పకపోతే మటుకు తప్పక దండిస్తాను," అన్నాడు.

నవయౌవని రసికత్వంతో కూడిన ధైర్యంతో, చిరునవ్వు నవ్వుతూ, "మీ రే దండన ఇచ్చినా సంతోషంగా స్వీకరిస్తాను," అన్నది.

"మీ వెంట వచ్చి ఇల్లు చేరుస్తాను. అదే దండన," అన్నాడు యువరాజు.

అంతలో బయట గుర్రాలడెక్కల చప్పుడయింది. అతను చప్పున మందిరం వెలుపలికి వచ్చి, నూరు గుర్రాలపై రాజపుత్ర యోధులు వస్తూ ఉండటం చూశాడు. వారతని పరివారమే. అతను యుద్ధ సంబంధమైన పని మీద విష్ణుపురానికి వెళ్ళి ఈ పరివారంతో తండ్రి వద్దకు తిరిగివస్తూ, మార్గ మధ్యంలో వారి నుంచి వేరయాడు. వారిప్పు డతన్ని తిరిగి కలుసుకున్నారు. అతను "ఢిల్లీ చక్రవర్తికి జై!" అని కేక వేయగానే అశ్వికులలో ఒకడు అతని సమీపానికి వచ్చి, "తమ కోసం తెగ వెతికాం. ఆ మర్రిచెట్టు దగ్గిర మీ గుర్రం కనిపించింది," అన్నాడు.

"దగ్గిర గ్రామానికి వెళ్ళి రెండు మేనాలూ బోయీలూ తేవటానికి ఇద్దరిని అక్కడ ఉంచి, మిగిలిన వాళ్ళను

ముందుకు సాగమను," అన్నాడు జగతసింహుడా అశ్వికుడితో. యువరాజు రెండు మేనాలు తెమ్మన్నట్టు తెలిసి రాజపుత్ర యోధులలో కొందరాశ్చర్యపడ్డారు, కొందరు హాస్యాలాడారు.

ఈలోపుగా నవయువ్వని పరిచారికతో, "విమలా, నన్ను రాజకుమారుడి కెందుకు పరిచయం చెయ్యలేదు?" అని అడిగింది.

"ఎందుకు చెయ్యలేదో మీ నాన్నగారి ఎదట చెబుతాను," అన్నది విమల.

మేనాల కోసం వెళ్ళిన వాడు తిరిగి రాక ముందె ఆ స్త్రీల వాహనాలూ, పరిజనమూ వచ్చారు. వారిని చూసిన జగతసింహుడు మందిరంలోకి వచ్చి, "ఎవరో రక్షక భటులూ, మేనాలూ రావటం చూశాను. బయటికి వచ్చి, వారంతా మీ వారేనేమో చూసుకోండి," అని స్త్రీలతో అన్నాడు. విమల బయటికి వచ్చి చూసి, "ఆ వచ్చేది మా పరివారమే!" అన్నది.

"అయితే నే నిక్కడ ఉంది వాళ్ళందరికీ కనిపించటం మంచిది కాదు. నేను మీ కిక్కడ కనబడ్డానన్న సంగతి ఒక వారం రోజులపాటు ఎవరికీ చెప్పవద్దు. నా హృదయంలో మీ సఖి రూపు నిలిచిపోయింది గాని ఆమెను గురించి ఏమీ తెలుసుకోలేక పోయాను," అన్నాడు జగతసింహుడు.

"యువరాజా, నే నామెను గురించి చెప్పకపోవటానికి కారణం ఉన్నది. తెలుసుకోవాలన్న కుతూహలం ఇలాగే ఉండే పక్షంలో ఇవాళకు పదిహేనో రోజున మీరు కలుసుకోమన్న చోట వచ్చి కలుసుకుని అంతా చెబుతాను," అన్నది విమల.

అతను కొంచెం ఆలోచించి, "ఆ రోజున అక్కడే కలుసుకుందాం. అది జరగని పక్షంలో ఇక మన మెన్నడూ కలుసుకోలేం!" అన్నాడు. అతను నవయౌవని వంక మరొక్కసారి చూసి, గుర్రాన్నెక్కి వెళ్ళి పోయాడు. —(ఇంకా వుంది)






**2**

[రాజా మానసింహుడి కొడుకైన జగత్‌సింహుడు విష్ణుపురం నుంచి మందారణానికి వెళ్ళే మార్గంలో అశ్వారూఢుడై ఒంటరిగా ప్రయాణిస్తూ, గాలి వానలో చిక్కి, చీకటిలో శైలేశ్వరాలయం చేరుకుని, అక్కడ ఒక కులీనురాలైన నవయౌవనితోనూ, ఆమె పరిచారిక విమల తోనూ పరిచయం చేసుకున్నాడు. ఆ యౌవని పై అతనికి ప్రేమ ఏర్పడింది. తా నెవరో ఆ స్త్రీలకు తెలిపాడు గాని, వారిని గురించి అతను తెలుసుకోలేక పోయాడు. సరిగా పదిహేను రోజులకు అదే శైలేశ్వరాలయానికి వస్తే తన సఖి వృత్తాంతం తెలుస్తుందని విమల అతనికి మాట ఇచ్చిన మీదట ఎవరి దారిన వారు వెళ్ళి పోయారు.]

జగత్‌సింహుడు వంగదేశానికి ఎందుకు వచ్చాడో, ఆ ప్రాంతంలో ఒంటరిగా ఎందుకు తిరుగుతున్నాడో తెలుసుకోవాలంటే ఆ నాటి వంగదేశపు రాజకీయాలు క్లుప్తంగా అయినా తెలుసుకోవాలి.

వంగదేశంలో — ఇస్లాము జయపతాకను బఖ్తియార్ ఖిల్జీ ఎగురవేసిన తరువాత చాలా కాలం ముసల్మానుల పరిపాలన నిరాటంకంగా సాగింది. అక్బరు కాలం దాకా వంగదేశాన్ని పఠానులే పాలించారు.

కాని, దావూద్‌ఖాన్ అనే బుద్ధిహీనుడు సింహాన్ని తట్టి లేపినట్టుగా అక్బరును కవ్వించి, యుద్ధం తెచ్చి పెట్టుకున్నాడు. అక్బరు సేనాపతి అయిన మునవ్వర్‌ఖాన్

బంకించంద్ర చట్టోపాధ్యాయ



అతన్ని ఓడించి రాజ్యభ్రష్టుణ్ణి చేసేశాడు. దావూద్‌ఖాన్ వంగదేశాన్ని మొగలుల వశం చేసేసి, సపరివారంగా ఒరిస్సాకు పోయి అక్కడ తల దాచుకున్నాడు.

ఈ విధంగా ఉత్కళదేశంలో స్థిరపడి పోయిన పఠానులను అక్కడి నుంచి కదిలించటం మొగలులకు కష్టమయింది. అయితే చివరకెలాగో వారు ఉత్కళాన్ని తమ అధీనంలోకి తీసుకురాగలిగారు.

ఇది ఇలా ఉండగా మరొక ఉపద్రవం వచ్చిపడింది. వంగదేశంలో భూమి పన్ను వసూలు చెయ్యటానికి అక్బరు ఒక ప్రణాళికను జారీ చేశాడు. ఇది వంగదేశపు జాగీర్దార్లలోనూ, జమీందార్లలోనూ తీవ్రమైన అసంతృప్తిని, ద్వేషాన్ని రెచ్చగొట్టింది. వారు సాయుధులై రాజవిద్రోహం చెయ్యటానికి సంసిద్ధులైనారు.

ఉత్కళంలో అణిగి పడి ఉన్న పఠానులకు మంచి అవకాశం దొరికింది. కతలూ ఖాన్ అనేవాడు తిరుగుబాటుకు నాయకత్వం వహించాడు. మిద్నపూర్ అతని అధీనంలోకి వచ్చింది.

అక్బరు సమర్థుడు, పరిజ్ఞానం కలవాడు. పరిపాలనా నిర్వహణలో రాజపుత్రులనే ఏర్పాటు చేశాడు. వారిలో మానసింహుడు ముఖ్యుడు. ఆయన అక్బరు కుమారుడైన సలీమ్‌కు బావమరిది. ఆ మానసింహుణ్ణే అక్బరు వంగ బీహారు దేశాలకు శాసనాధికారిగా నియమించి పంపాడు.

మానసింహుడు పాట్నాకు వచ్చి, అక్కడి చిక్కులు సరిచేసి, ఉత్కళ దేశాన్ని జయించటానికి పోతూ, తన ప్రతినిధిగా సయ్యద్‌ఖాన్ అనే వాణ్ణి నియమించాడు. తరువాత ఒకసారి మానసింహుడు దేశాన్ని జయించే ప్రయత్నంలో తన సేనతో సహా వర్ధమాననగరానికి వెళుతూ, సైన్యంతో సహా అక్కడికి వచ్చి తనను కలుసుకో వలసిందని సయ్యద్‌ఖాన్‌కు కబురు చేశాడు.



కాని సయ్యద్‌ఖాన్ సైన్యాన్ని ఆయత్తం చెయ్యటానికి వ్యవధి కావాలనీ, ఇంతలో వర్షాలు వచ్చేస్తాయనీ, వర్షాకాలం గడిచినాక సేనతో వచ్చి చేరుతాననీ అతను దూత ద్వారా మానసింహుడికి కబురు చేశాడు. మానసింహుడు చేసేది లేక, దారుకేశ్వర తీరాన శిబిరం ఏర్పాటు చేసుకుని, సయ్యద్ ఖాన్ రాక కెదురుచూస్తూ ఉండిపోయాడు.

సయ్యద్‌ఖాన్ తాత్సారాన్ని చూసి కతలూ ఖాన్ విజృంభించాడు. అతను మందారణ ప్రాంతానికి సేనతో వచ్చి, పరిసర ప్రాంతాలను కొల్లగొట్టి దోచుకోసాగాడు.

ఈ వార్త విని మానసింహుడు కలవర పడ్డాడు. శత్రుదళాల ఆచూకీ సంపాదించటానికి ఎవరినైనా పంపితే బాగుంటుందని ఆయన అనుకున్నాడు. ఆయన వెంట ఉంటున్న ఆయన కుమారుడు జగతసింహుడే అందుకు సిద్ధపడ్డాడు. మానసింహుడు అతని వెంట మూడుగురు అశ్వక యోధుల నిచ్చి పంపాడు. జగతసింహుడు శత్రువుల ఆచూకీ త్వరలోనే సంపాదించాడు. అతను ఈ విధంగా పని ముగించుకుని తన తండ్రి వద్దకు తిరిగి పోయేటప్పుడే శైలేశ్వర మందిరంలో స్త్రీలను కలుసుకోవటం జరిగింది.



జగతసింహుడు శైలేశ్వర మందిరం నుంచి బయలుదేరి, సైనిక శిబిరాన్ని చేరుకుని తన తండ్రి అయిన మానసింహ మహారాజుకు పఠానులను గురించి ఈ వివరాలు తెలిపాడు.

"ధరపుర గ్రామానికి సమీపంలో పఠానులు తమ సైనిక శిబిరం ఏర్పాటు చేసుకున్నారు. అక్కడ యాభై వేల మంది సైనికు లున్నారు. వారు అక్కడి పరిసర గ్రామాలను కొల్లగొట్టి దోచుకుంటున్నారు. అక్కడక్కడా కోటలు నిర్మించుకుని యథేచ్ఛగా ఆ ప్రాంతాల తమ అధికారాన్ని చలాయిస్తున్నారు."





పఠానుల ఈ విజృంభణను అరికట్టాలనే ఉద్దేశంతో మానసింహ మహారాజు తన సైనికాధికారులను సమావేశ పరిచి వారితో ఇలా అన్నాడు:

"గ్రామం తరువాత గ్రామం, పరగణా తరువాత పరగణా ఢిల్లీ చక్రవర్తి అధీనం నుంచి జారి పోతున్నాయి. పఠానులను ఎలాగైనా అరి కట్టాలని నా ఉద్దేశం, వారితో యుద్ధానికి తలపడి, వారిని కోటలలో నుంచి తరిమి వేయగల బలం మనకు లేదు. సయ్యద్ ఖాన్ వచ్చేదాకా యుద్ధానికి పూనుకోవటం మంచిది కాదు. ఈ లోపుగా మనం బుద్ధికుశలుడైన సేనాపతికి కొద్ది సైన్యాన్నిచ్చి పంపి, పఠాను దళాలను అదుపులో ఉండే లాగు చేస్తే బాగుంటుందని నాకు తోస్తున్నది."

ఈ పని చేయటానికి జగతసింహుడు సిద్ధపడ్డాడు. పది వేల సేనతో వెళ్ళి, కతలూ ఖాన్ను సువర్ణరేఖ నది దాటి వెళ్ళేటట్టు చేయగలనని అతను ప్రతిజ్ఞ చేశాడు.

జగతసింహుడు విష్ణుపురం నుంచి జహానాబాదుకు ప్రయాణమై వెళ్ళాడు. ఆ మార్గానికి కొంచెం దక్షిణంగా మందారణ గ్రామం ఉన్నది. జగతసింహుడు మందిరంలో కలుసుకున్న స్త్రీలు ఆ నగరానికి చెందినవారే.

దామోదర నది ఆ నగరం మీదుగా ప్రవహించేది. అది పెద్ద మలుపు తిరిగిన చోట ముక్కోణాకారం గల భూభాగాన ఒక ఎత్తయిన దుర్గం ఉండేది. నది ఆ దుర్గాన్ని రెండు పక్కలా ఒరిసి ప్రవహించేది. ఈ దుర్గాన్ని జయధరసింహుడనే హిందూ యోధుడు జాగీరుగా పొందాడు. ఈ కథ జరిగే కాలానికి ఆ కోట జయధరసింహుడి వారసుడైన వీరేంద్రసింహుడిది.

వీరేంద్రసింహుడు యువకుడై ఉండగా అతనికీ, అతని తండ్రికీ ఒక్క క్షణం పడేది కాదు. వీరేంద్రసింహుడి కోసం తండ్రి ఒక కన్యను నిశ్చయించాడు, ఆమె కూడా ఒక జమీందారు కూతురు, మంచి అందగత్తె.



ఆమె తల్లి తండ్రులకు ఏక సంతానం. కాని వీరేంద్రసింహుడు సంబంధాన్ని వదులుకుని, ఒక అనాథ స్త్రీని పెళ్ళాడాడు.

ముసలి జమీందారుకు కోపం వచ్చి, కొడుకును ఇంటి నుంచి వెళ్ళగొట్టాడు. యువకుడైన వీరేంద్రసింహుడు సైనిక వృత్తి అవలంబించటానికి ఢిల్లీకి బయలుదేరాడు. ఆ సమయంలో అతని భార్య గర్భవతిగా ఉండటంచేత అత నామెను వెంట తీసుకుపోక తల్లి దగ్గరనే ఉంచి వెళ్ళాడు.

కొడుకును ఇంటి నుంచి బహిష్కరించినాక ముసలి జమీందారు పుత్రవియోగంతో బాధ పడ్డాడు. ఎంత ప్రయత్నించినా కొడుకు జాడ తెలియలేదు. అందుచేత ఆయన తన కోడలిని పుట్టింటి నుంచి తన ఇంటికి తెచ్చుకున్నాడు. ఆమె ఒక ఆడ శిశువును కని, కొన్నాళ్ళ అనంతరం చనిపోయింది.

వీరేంద్రసింహుడు ఢిల్లీ పాదుషా అనుమతితో రాజపుత్ర సేనలో చేరి, త్వరలోనే మంచి పదవి సంపాదించుకుని, కొద్ది సంవత్సరాలపాటు ధనమూ, కీర్తి గడించాడు. తరువాత అతను తన తండ్రి మరణ వార్త విని స్వస్థానానికి తిరిగి వస్తూ, ఢిల్లీ నుంచి తన వెంట విమల అనే స్త్రీని, అభిరామస్వామి అనే సన్యాసినీ తీసుకు వచ్చాడు.



విమల ఇంటి పనులు చూసేది, ప్రత్యేకించి వీరేంద్రసింహుడి కుమార్తె పెట్టుపోతలు చేస్తూ ఉండేది. ఆమె చేసే పనులు దాసీలు చేసేవే అయినప్పటికీ, ఆమెను కేవలం పరిచారికగా ఎవరూ చూసేవారు కారు, ఇంటి మనిషిలాగే గౌరవించేవారు. కొంచెం వయసు ముదిరినప్పటికీ ఆమె చాలా అందంగా ఉండేది. నవయౌవనంలో ఆమె అసాధారణ సౌందర్యవతి అయి ఉండేదనిపించేది.

ఆమె సమయజ్ఞతా, మాట చాతుర్యం చూస్తే సంస్కారం గల కులంలో పుట్టిన దానిలాగా కనిపించేది.



వీరేంద్రుడి వెంట వచ్చిన సన్యాసి అభిరామస్వామి కోటలో ఎల్లప్పుడూ ఉండేవాడు కాదు. ఒకటి, రెండు నెలలు మందారణ దుర్గంలో ఉంటే, ఒకటి రెండు నెలలు దేశ సంచారం వెళ్ళేవాడు. అభిరామస్వామి వీరేంద్రుడి దీక్షా గురువని అందరూ అనుకునేవారు. వారిద్దరూ ఒకరినొకరు గౌరవించుకునే వారు. ఏ విషయంలోనైనా వీరేంద్రసింహుడు అభిరామస్వామి సలహా ప్రకారమే నడిచేవాడు.

విమలా, అభిరామస్వామి కాక, అస్మానీ అనే దాసీ కూడా ఢిల్లీ నుంచి వీరేంద్ర సింహుని వెంట వచ్చింది.



తిలోత్తమా, విమలా శైలేశ్వరమందిరం నుంచి మందారణానికి తిరిగి వచ్చిన మూడు నాలుగు రోజుల తరువాత ఒకనాడు వీరేంద్ర సింహుడు తన సభాభవనంలో కూర్చుని ఉండగా అక్కడికి అభిరామస్వామి వచ్చాడు. వీరేంద్రుడు గౌరవంగా లేచి నిలబడి నమస్కారం చేసి, ఆయన కొక దర్భాసనం చూపాడు.

ఇద్దరూ ఎవరి ఆసనాలపై వారు కూర్చున్నాక అభిరామస్వామి, "పఠానులకూ, మొగలులకూ ఘోర యుద్ధం జరగబోతున్నది. ఆ సందర్భంలో నీవేమి చెయ్యదలిచావు?" అని అడిగాడు.

"శత్రువులను నా బాహుబలంతో ఓడిస్తాను," అన్నాడు వీరేంద్రుడు.

"వీరుడనదగిన మాటే అన్నావు. కాని నీ దగ్గిర ఉండే సేన వెయ్యిమందే కదా, లక్షమంది సైన్యం గల శత్రువు నెలా జయిస్తావు? అటు మొగలులూ, అటు పఠానులూ కూడా బలవంతులే. అందులో ఏదో ఒక పక్షం నీకు సహాయం చేస్తేనేగాని రెండో పక్షాన్ని జయించలేవు. రెండు పక్షాలకూ శత్రువు కావటంకంటె ఒక పక్షాన్ని మంచి చేసుకోవటం క్షేమం కద!" అని అభిరామస్వామి అన్నాడు.



"ఏ పక్షాన చేరమని మీ ఆజ్ఞ?" అని వీరేంద్రుడు అడిగాడు.

"యతో ధర్మ స్తతో జయః! ధర్మం ఉన్న పక్షాన్ని అవలంబించు. రాజద్రోహం మహా పాపం గనుక రాజు పక్షాన్ని అవలంబించు," అన్నాడు అభిరామస్వామి.

"ఎవరు రాజు? మొగలులూ, పఠానులూ కూడా రాజ్యం కోసమే గదా పోట్లాడుతున్నారు?" అన్నాడు వీరేంద్రుడు.

"కర్మశీలుడైన అక్బరు పాదుషాయే రాజు," అని అభిరామస్వామి చెప్పాడు.

ఈ మాట వినగానే వీరేంద్రుడి ముఖాన కోపమూ, చిరాకూ కనిపించాయి; కళ్ళు ఎర్రబడ్డాయి. అతను అభిరామస్వామితో, "స్వామీ, మీ ఆశీర్వాదం ఉన్నట్టయితే ఆ మానసింహుడి రక్తంతో నా చేతులు కడుక్కుంటాను," అన్నాడు.

"పాదుషాను ఆశ్రయించమన్నాను గాని, మానసింహుణ్ణి ఆశ్రయించమనలేదు. శాంతించు, కోపోద్రేకంతో ఆత్మ హాని తెచ్చుకోకు. మానసింహుడు నీకు చేసిన అపరాధానికి తప్పక శిక్షించ వలసిందే. కాని అక్బరు పక్షాన యుద్ధం చేయటం గురించి నీ అభిప్రాయ మేమిటి?" అన్నాడు అభిరామస్వామి.



అక్బరు పక్షం అవలంబించి మానసింహుడి కింద యుద్ధం చెయ్యవలసి వస్తే అది తనకు సాధ్యం కాదని వీరేంద్రసింహు డన్నాడు; తనకు పఠానులలోనే చేరాలని ఉన్నట్టు కూడా బయట పెట్టాడు.

ఈ మాట విని అభిరామస్వామి కన్నీరు కార్చాడు. అది చూసి కంగారుపడి వీరేంద్రసింహుడు ఆసనం మీది నుంచి లేచి, ఆయనను క్షమాపణ చెప్పుకున్నాడు, కర్తవ్యం ఆజ్ఞాపించమన్నాడు.

అభిరామస్వామి తన శాలువతో కళ్ళు తుడుచుకుని, "నాకు నీ పైన కన్న కూడా నీ కుమార్తె పైన అభిమానం జాస్తి. ఇటీ

వలనే నామె జాతకాన్ని గుణించాను. మొగలాయి సేనాపతి వల్ల ఆమెకు గొప్ప కష్టం కలగనున్నది. మొగలులను మిత్రులుగా చేసుకుంటే ఆ ఆపద తప్పి పోవచ్చు. అందుకే వారి పక్షం చేరమన్నాను. నీ కుమార్తె విషయం బయటపెట్టి నిన్ను బాధించ దలచలేదు. కాని ఆమె కా కష్టం తప్పదు గనకనే నీకు పఠానుల పక్షం కావాలన్న దృఢసంకల్పం ఏర్పడిందేమో!" అన్నాడు.

ఆయన లేచి వెళ్ళి పోబోతూ, "ద్వారం వద్ద కతలూఖాన్ దూత వేచి ఉన్నాడు. అతణ్ణి ఆపి ఉంచమని ద్వారపాలకుడికి చెప్పాను. నేను చెప్పవలసింది చెప్పేశాను గనుక, ఆ దూతను యిక్కడికి పిలిపించి అతనికి చెప్పవలసిన సమాధానం చెప్పి పంపెయ్యి," అన్నాడు.

"స్వామీ, నా అభిప్రాయం మార్చుకున్నాను. మానసింహుడి కింద కూడా పని చేస్తాను. ఆ దూతను లోపలికి పంపమని ద్వారపాలకుడితో చెప్పండి," అన్నాడు వీరేంద్రసింహుడు.

కొద్ది సేపట్లో కతలూఖాన్ దూత వచ్చి వీరేంద్రసింహుడి కొక లేఖ ఇచ్చాడు. అందులో ఇలా ఉన్నది:

"వీరేంద్రసింహా, వెయ్యిమంది అశ్వ సైనికులనూ, అయిదు వేల బంగారు నాణాలనూ పఠాను శిబిరానికి పంపించు. లేక పోతే నా సైనికులు ఇరవై వేల మంది మందారణ దుర్గంపై దాడి చేయగలరు—కతలూఖాన్."

వీరేంద్రసింహుడు ఉత్తరం చదువుకుని దూతతో, "సేనను పంపిస్తానని మీ ప్రభువుతో చెప్పు!" అన్నాడు. దూత బయటికి వెళ్ళిపోయాడు.

ఆ సభా భవనంలో జరిగిన సంభాషణ అన్నిటినీ విమల చాటు నుంచి విన్నది.

—(ఇంకా ఉంది)






# 3

[బెంగాలులో పఠానుల విశృంఖలతను అణచటానికి ఢిల్లీ పాదుషా అక్బరు తరపున రాజా మానసింహుడు కొంత సైన్యంతో వచ్చి వర్ధమానపురం వద్ద శిబిరం ఏర్పాటు చేసుకున్నాడు. అతని కుమారుడు జగత్సింహుడు శత్రువుల జాడలను కనుక్కోటానికి మందారణ ప్రాంతానికి వచ్చి, అక్కడి శైలేశ్వరాలయంలో మందారణ దుర్గేశుడైన వీరేంద్రసింహుడి కుమార్తెను తిలోత్తమనూ, ఆమె వెంట ఉన్న విమల అనే ఆమెనూ కలుసుకున్నాడు. తిలోత్తమా జగత్సింహులకు ప్రథమ వీక్షణంలోనే పరస్పర ప్రేమ ఏర్పడింది. ఆ ప్రేమ క్షణికమైనది కాదు, చాలా గాఢమైనది కూడానూ.

మొగలులకూ, పఠానులకూ యుద్ధం వస్తే పఠానుల పక్షం కావాలనే వీరేంద్రసింహుడి ఉద్దేశం. దానికి కారణం అతనికి మానసింహుడి పట్ల ఆగ్రహమే. అతని గురువైన అభిరామస్వామి మొగలులకే చేరటం మంచిదని సలహా ఇచ్చాడు, కాని అది వీరేంద్రుడికి అంతగా తలకెక్కలేదు.]

దుర్గాన్ని ఒరుసుకుంటూ దామోదర నది ప్రవహిస్తున్నది. అటు పక్కగానే కోట పై భాగాన ఉన్న కిటికీ వద్ద కూర్చుని తిలోత్తమ నదిలోని సుడిగుండాలను గమనిస్తున్నది. సూర్యాస్తమయం కాబోతున్నది. నీరెండ అంతటా ప్రసరించింది. నది అవతలి ఒడ్డున ఒక ఎత్తయిన మేడా, పెద్ద పెద్ద చెట్లూ ఉన్నాయి. దుర్గం ఆవరణలో

బంకించంద్ర చట్టోపాధ్యాయ



నెమళ్ళూ, చిలుకలూ, కోయిలలూ, ఇతర పక్షులూ సంతోషంతో కేకలు పెడుతున్నాయి. వేసవి అయినప్పటికీ నది పైనుంచి చల్లని గాలి వీస్తున్నది.

తిలోత్తమ పదహారేళ్ళ వయసు గల బాలిక. గొప్ప సౌందర్యరాశి. ఆమె శరీరం అతి కోమలమైనది. ఆమె ఏదీ చూడటం లేదు, ఏమీ వినటం లేదు; ఆమె ధ్యాస ఎక్కడో ఉన్నది.

కొంచెం సేపటికి దాసీది దీపం తెచ్చి గదిలో ఉంచి వెళ్ళిపోయింది. తిలోత్తమ తన ఆలోచనలను కట్టిపెట్టి, ఒక పుస్తకం తీసుకుని, చదవటానికి దీపం ముందు కూర్చున్నది. ఆ పుస్తకం కాదంబరి. ఆమెకు సంస్కృతం వచ్చును; అభిరామస్వామి వద్ద నేర్చుకున్నది. కొంచెం సేపు చదివి, ఆ పైన సాగక ఆమె ఆ పుస్తకాన్ని అవతల పెట్టి మరొక పుస్తకం తెచ్చుకున్నది. అది వాసవదత్త. ఆమె దాన్ని అవతలపెట్టి గీతాగోవిందం తీసుకున్నది. ఆమె దాన్ని కూడా మూసిపెట్టి పక్కమీద కూర్చుని తిరిగి ఆలోచనలో పడింది.

ఆమె ఆలోచిస్తున్నది. జగతసింహుణ్ణి గురించి!...

విమల అభిరామస్వామి ఉండే ప్రత్యేక గృహానికి వెళ్ళి, తిలోత్తమా, తానూ శైలేశ్వరాలయంలో జగతసింహుణ్ణి కలుసుకున్న ఉదంతమంతా వర్ణించి ఆయనతో చెప్పి, "అది జరిగి పధ్నాలుగు రోజులయింది. జగతసింహుణ్ణి తిరిగి ఆ ఆలయంలో కలుసుకుని తిలోత్తమ ఎవరో చెప్పవలిసి ఉన్నది," అన్నది.

"అలాగా. అంతకూ నీవేమి చేయాలని నిశ్చయించుకున్నావు?" అని అభిరామస్వామి అడిగారు.

"ఈ విషయంలో తమరు ఆలోచించి తగిన సలహా ఇస్తారనే మీ వద్దకు వచ్చాను," అన్నది విమల.

"సరే, అయితే ఆ విషయం పూర్తిగా మరిచిపోవలసిందని నా సలహా!" అన్నాడు అభిరామస్వామి.

విమల కళ్ళనీళ్ళు పెట్టుకుని, "తిలోత్త మకు ఏం దారి చూపను? ఆ పిల్ల నేం చెయ్యను?" అన్నది.

"విమలా, తిలోత్తమ హృదయంలో ప్రేమానురాగాలు మొలకెత్తాయా?" అని అభిరామస్వామి అడిగారు.

విమల కొంచెంసేపు తటపటాయించి, "స్వామీ, మీతో ఏమని చెప్పేది? ఈ పద్నాలుగు రోజులుగా ఆ పిల్ల అహో రాత్రాలు అదోక మాదిరిగా ఉంటున్నది. ఆమె మనస్సూ, చర్యలూ అన్నీ గుర్తించలేనంతగా మారిపోయాయి. ఆమె హృదయంలో ప్రేమానురాగాలు అంకురించటమే గాదు, క్రమంగా వృద్ధి చెందుతున్నాయి కూడా," అన్నది.

అభిరామస్వామి నవ్వి, "మీ ఆడవాళ్ళెప్పుడూ ఇంతే. ప్రేమ అనగానే దాన్ని గురించి రాద్ధాంతం చేస్తారు; దానికి మార్పే ఉండనట్టు మాట్లాడతారు. తిలోత్తమ పసిపిల్ల. మనస్సు కాస్త చలించినా, ఇతర విషయాలలో పడితే జగతసింహుణ్ణి తప్పక మరిచిపోతుంది," అన్నాడు.



విమల అందుకు సమ్మతించలేదు. తిలోత్తమ ఈ రెండు వారాల కాలంలోనూ ఎలా మారిపోయిందో, నిద్రాహారాలు లేక ఎలా కృశించిపోయిందో అభిరామస్వామికామె వివరంగా చెప్పింది.

అంతా విని అభిరామస్వామి, "ఆడ వాళ్ళ విషయం చెప్పలేం. కాని ఏం చెయ్యాలి? వీరేంద్రసింహుడు కొంచెం కూడా సుముఖుడుగా లేడు," అన్నాడు.

"ఆ భయం చేతనే నేను తిలోత్తమ స్థితిని గురించి దాచి ఉంచాను. ఆమె ఫలానా అని ఆ జగతసింహుడికి కూడా చెప్పలేదు. ఇప్పుడు వీరేంద్రసింహుడు

మానసింహుడితో స్నేహం చేసుకోవటానికి సిద్ధంగా ఉంటే, జగతసింహుణ్ణి అల్లుడుగా ఎందుకు చేసుకోకూడదు?" అన్నది విమల.

"మానసింహుడు ఈ వివాహానికి అంగీకరిస్తాడని ఏమిటి?" అని అభిరామస్వామి అడిగాడు.

"ఎందుకు అంగీకరించడు? యువరాజు అనుకూలంగానే ఉన్నాడు కద?" అన్నది విమల.

"జగతసింహుడు మాత్రం వీరేంద్ర సింహుడి కుమార్తెను పెళ్ళాడటానికి సుముఖుడుగా ఉంటాడని నీవెందుకనుకున్నావు?" అన్నాడు అభిరామస్వామి.

"జాతి, కుల, గౌరవాలకు రెండూ సమానమైన వంశాలే. జయధరసింహుడి పూర్వీకులు యదువంశస్థులే కదా?" అన్నది విమల.

"యదు వంశంలో పుట్టిన ఇలోత్తమ మొగలాయీల బంధువుల ఇంట కోడలవుతుందా?" అని అభిరామస్వామి అడిగాడు.

విమల అభిరామస్వామి కేసి నిశ్చలంగా చూస్తూ, "ఎందుకు కాదూ? యదువంశం కన్న హీనవంశమేమున్నది?" అన్నది.

ఈ మాట వింటూనే అభిరామస్వామి కళ్ళ నిప్పులు రాలుస్తూ, "పాపిష్ఠిదానా, నీ దౌర్భాగ్యాన్ని ఇంకా మరిచి పోలేదా?



పో, నా ఎదట నుంచి అవతలికి పో!" అని కఠోరంగా అన్నాడు.

* * *

జగతసింహుడు తన తండ్రి వద్ద సెలవు తీసుకుని, సైన్యంతో బయలుదేరి పోయాక ఆతను చేసిన సాహస చర్యలకు పఠాను సైన్యం గడగడ లాడిపోయింది. పఠానులు కుంగి పోయారు. జగతసింహుడు అయిదు వేల సేనతో యాభై వేల సైన్యం గల కతలూ ఖానును సువర్ణరేఖా నదిని దాటించి తరిమి వేస్తానని ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు. ఆ ప్రతిజ్ఞ నెరవేరే అవకాశా లింకా ఏర్పడలేదు, అయినప్పటికీ రెండు వారాల కాలంలో అతను తన సైనికులతో సహా చూపిన శౌర్య ధైర్య పరాక్రమాలను గురించి విని మానసింహుడు, "ఫరవాలేదు, నా కొడుకు రాజపుత్రుల పూర్వపు కీర్తి ప్రతిష్ఠలను తిరిగి నిలబెడతాడు!" అనుకున్నాడు.

యాభై వేల సైన్యాన్ని అయిదు వేల సేనతో ఎదిరించి పోరాడి నెగ్గటం సాధ్యం కాదని జగతసింహుడికి తెలుసు; అందువల్ల అపజయమూ, మరణమూ తప్ప మరొక ఫలితం ఉండదు. అందుచేత అత నొక కొత్త యుద్ధ తంత్రం అవలంబించాడు. అతను తన సేనయొక్క ఆచూకీ ఏమాత్రమూ బయట పడకుండా ఉంచాడు.





అతని సైనికులు ఏ క్షణాన, ఎటు నుంచి ఆకస్మికంగా వచ్చి తమ పై పడేదీ శత్రువులకు లేశమాత్రమూ తెలిసేది కాదు. అతను తన సైనికులను అనేక చిన్న చిన్న దళాలుగా విభజించి, వాటిని దట్టమైన అరణ్యంలోనూ, పర్వత గుహలలోనూ, మిట్టల మీదా, పల్లాల లోనూ దాచి ఉంచాడు. అతనికి అనేక మంది గూఢచారు లుండేవారు. వారు తమ తమ పనులను ఎంతో చాకచక్యంతో చేసుకు పోయేవారు.

జగతసింహు డనుసరించిన ఈ యుద్ధ తంత్రం వల్ల పఠాను సైనికులు అసంఖ్యాకంగా చచ్చారు. వారి సేనలు పెద్ద కంగా రులో పడిపోయారు. ఇది చూసి పఠాను సేనా నాయకుడు శత్రువులతో సమ్ముఖ యుద్ధం ఎలాగైనా జరిగేలాగు చూడాలని యత్నించాడు. కాని ఈ ప్రయత్నాలను జగతసింహుడు కొన సాగనియ్యలేదు. తన సైనికులు నాశనమయారన్న వార్తలు కతలూఖాన్‌కు విడవకుండా చేరేవి. ఉదయమని లేదు, మధ్యాహ్నమని లేదు, సాయంకాలమని లేదు — ఎప్పుడు చూసినా దుర్వార్తలే. చిట్టచివరకు పఠాను సైనికులు తమ కోటలను దాటి బయటికి రావటానికి వీలులేని పరిస్థితి ఏర్పడింది. అక్కడ వారికి ఆహారం అందక ఆరోజు కారోజు పరిస్థితి విషమించింది.

పఠానుల అధీనంలో ఉండిన ప్రాంతాలలో తిరిగి శాంతి నెలకొని, అవి తన ఏలుబడికిందికి వస్తున్నాయని తెలిసి సంతోషించి మానసింహుడు తన కుమారుణ్ణి అభినందిస్తూ, మరి పది వేల సేనను కూడా పంపుతున్నట్టు ఉత్తరం రాశాడు.

జగతసింహుడు దానికి జవాబు రాస్తూ, అధికంగా సేన రావటం ఉపయోగమేనని, అదనపు సేనలు రాకపోయినప్పటికీ, ఉన్న అయిదు వేల సేనతోనే తన ప్రతిజ్ఞ నిలబెట్టుకుంటానని తండ్రికి తెలియజేశాడు.

అభిరామస్వామితో మాట్లాడిన మరునాటి సాయంకాలం విమల తన గదిలో కూర్చుని చక్కగా అలంకరణ చేసుకున్నది. ముప్పై ఐదేళ్ళ స్త్రీకి శృంగార మేమిటనవచ్చు. కాని మనసులో యౌవనం ఉన్నవాళ్ళు ఏళ్ళతో సంబంధం లేకుండా శృంగారం చేసుకోవచ్చు. కొందరు ఇరవై ఏళ్ళకే మానసికంగా వృద్ధులైపోతారు. విమల మానసికంగా యౌవనవతి. ఆమె అలంకరించుకుంటున్నంతసేపూ సన్న సన్నగా ఏవో పాటలు పాడుకున్నది. మధ్య మధ్య నవ్వుకున్నది.

అలంకరణ పూర్తి అయినాక ఆమె జగతసింహు ఇచ్చిన హారాన్ని ధరించి తిన్నగా తిలోత్తమ గదికి పోయింది. తిలోత్తమ ఆమెను చూసి ఆశ్చర్యపడి, "ఇవాళ ఇంతగా ముస్తాబయావేమిటి, విమలా? నిజం చెప్పు, ఎక్కడికి ప్రయాణం?" అని అడిగింది.

"చాలా దూర ప్రయాణం మీద పోతున్నాను," అన్నది విమల.

"నిజం చెప్పు, ఎక్కడికి పోతున్నావు?" అని తిలోత్తమ అడిగింది.

విమల ఆమెను చెయ్యి పట్టుకుని కిటికీ వద్దకు తీసుకుపోయి, ఆమె చెవిలో రహస్యంగా, "నేను కైలేశ్వర మందిరానికి పోతున్నాను. అక్కడ ఒక రాజపుత్రుణ్ణి కలుసుకోవాలి," అన్నది.



ఆ మాటలు వింటూనే, తిలోత్తమ శరీరం ఒక్కసారి ఆపాదమస్తకం పులకించింది. ఆమె ఏమీ అనలేదు.

"అభిరామస్వామి వారితో ఈ సంగతి మాట్లాడాను. నీకూ, జగతసింహుడికీ వివాహం జరగటం సాధ్యంకాదని ఆయన అభిప్రాయం. మీ నాన్నగారు అందుకు సుతరామూ ఒప్పరు. ఆయన సమక్షంలో ఈ సంగతి పొరపాటున బయటికి వచ్చిందో కొంప అంటుకుంటాయి," అన్నది విమల.

తిలోత్తమ తల వంచుకుని, అస్పష్టమైన గొంతుతో, "అయితే మరి దేనికి—అయితే మరి దేనికి—?" అన్నది.

"దేనికేమిటి? ఆవాళ రాత్రికి అతన్ని కలుసుకుని, నీ వెవరో చెబుతానని మాట ఇచ్చాను. అంతమాత్రాన పోయేదేమున్నది? నేను చెప్పే దేదో చెప్పాక, అతను చేసేదేదో చేసుకోనీ! ఒకవేళ అతనికి నీ పైన నిజంగానే ప్రేమ ఉన్నపక్షంలో—"

విమల మాట పూర్తి చేసేలోపుగా తిలోత్తమ ఆమె నోటిని మూసి, "నీ మాటలు వింటుంటేనే నాకు సిగ్గవుతున్నది. పొదలిస్తే నీ యిష్టం వచ్చిన చోటికి పో; కాని నన్ను గురించి ఎవరితోనూ ఏమీ చెప్పనవసరం లేదు," అన్నది.

"అలాటి దానివి ఇంత చిన్న వయస్సులోనే ప్రేమ సముద్రంలో ఎందుకు పడిపోయావు?" అని విమల నవ్వుతూ అడిగింది.

"పో, పో! నీ మాట లేమీ నేను వినను," అన్నది తిలోత్తమ.

"సరే అయితే నేను పోనే పోను," అన్నది విమల.

తిలోత్తమ తల వంచుకుని, "వెళ్ళు," అన్నది. విమల గట్టిగా నవ్వి, "సరే, వెళుతున్నాను. నేను తిరిగి వచ్చేదాకా నీవు నిద్రపోకు," అన్నది.

పోవాలంటే మటుకు నిద్ర రావద్దా అన్నట్టుగా తిలోత్తమ నవ్వింది. విమల ఒక చేతిని తిలోత్తమ భుజం మీద వేసి, రెండో చేత్తో ఆమె గడ్డం పట్టుకుని ఆమె చెక్కిలి ముద్దు పెట్టుకున్నది.

వెళ్ళిపోయేటప్పుడు విమల కళ్ళ నీరు తిరగటం తిలోత్తమ గమనించింది.

విమల తిలోత్తమ గది ద్వారం దాకా వెళ్ళేసరికి, అన్నాని ఎదుట వచ్చి ఆమెతో, "బాబుగారు పిలుస్తున్నారు," అన్నది.

—(ఇంకా వుంది)






## 4

[జగత్సింహుణ్ణి చూసినది మొదలు దుర్గేశనందిని తిలోత్తమ అతని పై ప్రేమతో కృశించి పోతున్నది. మొదటి సమావేశంలో తిలోత్తమను గురించి విమల జగత్సింహుడికి కేమి చెప్పక, పదిహేను రోజుల తరవాత అతన్ని ఆ మందిరంలోనే కలుసుకుని చెబుతానని మాట ఇచ్చింది. గడువు రోజు వచ్చింది. విమల చక్కగా అలంకరించుకుని బయలుదేర బోతూండగా దుర్గేశుడైన వీరేంద్రసింహుడి వద్ద నుంచి ఆమెకు పిలుపు వచ్చింది.]

"ఈ వేషం మార్చుకుని వెళ్ళు," అని తిలోత్తమ విమలకు రహస్యంగా సలహా ఇచ్చింది.

"మరేమీ భయంలేదు," అంటూ విమల తిలోత్తమ గది నుంచి వీరేంద్రసింహుడి గదికి వెళ్ళింది.

అతను పడుకుని ఉన్నాడు. ఒక దాసి అతనికి కాళ్ళు పట్టుతున్నది, మరొకతె విసురుతున్నది. విమల అతని మంచానికి సమీపంగా వెళ్ళి, "చెప్పండి, ఏమిటి సెలవు?" అన్నది.

అతను తల ఎత్తి ఆమె ముస్తాబు చూసి ఆశ్చర్యపడి, "ఎక్కడికో పని మీద బయలు దేరినట్టుందే?" అన్నాడు.

"చిత్తం. నా కేమిటి సెలవు?" అని విమల అడిగింది.

"తిలోత్తమ ఎలా ఉంది?"

"బాగానే ఉంది."



"ఆస్మానీ వెళ్ళి తలో త్తమను తీసుకొస్తుంది, అంతదాకా నువ్వు విసురుతూ ఉండు," అన్నాడు వీరేంద్రసింహుడు. ఆస్మానీ పంకా కిందపెట్టి బయలుదేరింది.

బయటనే ఉండమని విమల ఆస్మానీకి సైగ చేసింది. వీరేంద్రసింహుడు రెండో దాసీతో, "నువ్వు తాంబూలం సిద్ధంచెయ్యి," అని ఆమెను కూడా పంపేసి, "విమలా, ఏమిటి ఇవాళ ఇలా ముస్తాబయావు?" అని అడిగాడు.

"దీనితో నాకు పని ఉన్నది."

"ఆ పని ఏమిటో నాకు తెలుసుకోవాలని ఉన్నది."

"అయితే వినండి. నేనివాళ ప్రియ సమాగమం కొరకు పోతున్నాను."

"యమరాజు వద్దకా?"

"మనిషి కాకూడదేం?"

"అలాటి మనిషి ఇంకా పుట్టలేదే!"

"ఒక్కరు తప్ప!" అంటూ విమల దివానుంచి లేచి వెళ్ళిపోయింది.

ఆమె తన కోసం బయటనే వేచి ఉన్న ఆస్మానీతో, "నీ కొక రహస్యం చెప్పాలి," అన్నది.

"ఇవాళ నీ అర్భాటం చూసి ఏదో ఉన్నదని అప్పుడే అనుకున్నాలే," అన్నది ఆస్మానీ.

"ఇవాళ నేనొక ముఖ్యమైన పని మీద చాలా దూరం వెళ్ళాలి. ఈ రాత్రివేళ ఒంటరిగా వెళ్ళలేను. తోడు తీసుకు పోదామంటే నువ్వు తప్ప ఎవరూ నమ్మదగిన వాళ్ళు లేరు... అన్నట్టు, వెనక నీకు తెలిసిన వారెవరైనా నన్నిప్పుడు చూసి గుర్తించగలరంటావా?" అన్నది విమల.

"ఎవరిమాట అడుగుతున్నావు?"

"కుమార జగతసింహుడు నన్ను చూశాడనుకో."

"అంత అదృష్టమా?"

"ఎందుకు కాగూడదు?"



"యువరాజు నన్ను తప్పక గుర్తిస్తాడు."

"అయితే నా వెంట నువ్వు రావద్దు. ఎలాగబ్బా? ఒంటరిగా పోలేనే!" అంటూ విమల ఆలోచనలో పడింది. అస్మాని నోటికి చెంగు అడ్డం పెట్టుకుని నవ్వసాగింది.

"ఏమిటలా నీలో నువ్వు నవ్వుకుని చస్తున్నావు?" అని విమల అడిగింది.

"బంగారు తండ్రి దిగ్గజు డున్నాడే, అతన్ని నీ వెంట తీసుకుపోతే?"

"మంచి ఆలోచన! మన రసిక రాజును తీసుకు పోతాను," అన్నది విమల.

"అంతా నయం! నేను వేళాకోళాని కన్నాను."

"వేళాకోళం కాదు. మూర్ఖులకు ఏమీ తెలీదు. అందుచేత వాళ్ళ వల్ల ఎలాంటి ప్రమాదమూ ఉండదు. కాని బ్రాహ్మడు రానంటా డేమో."

"అదంతా నాకు వదిలిపెట్టెయ్యి. నువ్వు ద్వారం దగ్గిర వేచి ఉన్నావంటే అతన్ని నీ దగ్గిరికి పంపుతాను," అంటూ అస్మాని వెళ్ళింది.

అస్మాని దిగ్గజుని ఇంటికి వచ్చేసరికి తలుపు గడియవేసి ఉన్నది. "ఓ మహారాజ్!" అని అస్మాని కేక వేసింది.

ఒకటికి రెండు కేకలు పెట్టినా లోపలి నుంచి జవాబులేదు. ఆమె తలుపు సందుల్లో





నుంచి చూస్తే "రసికరాజు" భోంచేస్తూ-ఉండటం కనిపించింది. అందుకే ఆ బ్రాహ్మడు పలకలేదు.

"ఈ బ్రాహ్మడు నాతో మాట్లాడి మళ్ళీ భోజనం చెయ్యడా? చూస్తాను," అనుకుని ఆస్మాని గట్టిగా పిలిచింది.

దిగ్గజాడు "ఊఁ!" అన్నాడు.

"లోపల ఇంకెవతె ఉన్నదే! భోంచేస్తూ మాట్లాడొచ్చుగాదూ, బ్రాహ్మడా? అందరితోటీ చెబుతానుండు!" అన్నది ఆస్మాని.

దిగ్గజాడు కంగారుగా చుట్టూ కలయ చూసి, ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని భోజనం చెయ్యసాగాడు.

"అది మాదిగది, అది నాకు తెలుసు. అరె, మాట్లాడి మళ్ళీ తింటున్నావా?" అన్నది ఆస్మాని.

దిగ్గజాడు కంగారుపడి, "నే నెప్పుడు మాట్లాడాను?" అన్నాడు.

ఆస్మాని కిలకిలా నవ్వి, "ఇది మాట్లాడటం కాదేమిటి?" అన్నది.

"అయ్యో, ఇప్పు డెలా భోంచేసేది?" అన్నాడు దిగ్గజాడు.

"అయితే తలుపు తియ్యి," అన్నది ఆస్మాని తలుపు సందులో నుంచి అంతా చూస్తూ. దిగ్గజాడు నిజంగానే అన్నం ముందు నుంచి లేస్తూండటం చూసి ఆమె, "లేవకు, లేవకు, భోజనం పూర్తిచెయ్యి," అన్నది.

"మాట్లాడేశాను, మరి భోంచెయ్యను," అన్నాడు దిగ్గజాడు.

"భోజనం చెయ్యకపోతే నామీద ఒట్టే!"

"రామ, రామ! బ్రాహ్మణ్ణయి ఉండి మాట్లాడినాక మళ్ళీ భోజనమా?"

"అలా అయితే నే పోతున్నాను. ఇవాళ ఒక ముఖ్య విషయం చెబుదామనుకున్నాను. అంతా పాడయింది. నే పోతున్నాను."

"వద్దు, వద్దు, ఆస్మానీ. నువలా కోపగించుకోకు. ఇదుగో తింటున్నాను," అంటూ దిగ్గజాడు రెండు, మూడు ముద్దలు నోట

"పెట్టుకున్నావే ఛీఛీ," అస్మాని, "చాల్లే, లేచి తలుపు తెరు," అన్నది.

"ఇంకో మూడు నాలుగు ముద్ద లున్నాయి. వాటిని కూడా తిననీ."

"తలుపు తీస్తావా మాట్లాడుతూ తిన్నావని అందరికీ చెప్పెయ్యమన్నావా?"

దిగ్గజుడు అన్నం ముందు నుంచి లేచి, చెయ్యి, మూతి కడుక్కుని తలుపు తెరిచాడు. అస్మాని లోపలికి రాగానే చేతులెత్తి, "ఆయాహా పరదే దేవి!" అన్నాడు.

"ఎంత చక్కని కవిత్వం! అందుకేగదా నీకు రసికరాజని పేరు పెట్టాను," అన్నది అస్మాని.

"చెప్పు, ఏమిటి విశేషం? ఈ మధ్య నువ్వు ఖాత్రిగా కనిపించటమే లేదు," అన్నాడు దిగ్గజుడు.

"అరె, కంచం నిండా అన్నం అలాగే ఉండిపోయిందే! భోజనం పూర్తి చెయ్యి, తరవాత మాట్లాడుకుందాం," అన్నది అస్మాని.

"తినటం పూర్తి చేసి లేచానుగద."

"ఉపోషం ఉంటావేమిటి?"

"ఏంచెయ్యను? నువ్వు తొందర చేసి నన్ను లేవగొట్టేశావు." ఇంతలో విమల గబగబా అక్కడికి వచ్చింది.



ఆమె దిగ్గజుణ్ణి భోజనం పూర్తి చెయ్యమన్నది. కడుపు కాలి ఉన్న దిగ్గజుడు సంతోషంగా భోజనం పూర్తి చేశాడు.

"రసికరాజా, ఆవాళ నీతో చాలా ముఖ్యమైన పని ఉన్నది," అన్నది విమల.

"ఏమిటది?" అన్నాడు దిగ్గజుడు.

"మేమిద్దరమూ అంటే నీ కిష్టమే గదా? మే మెందుకు వచ్చామో తెలుసా?" అన్నది విమల.

"మేము నీతో లేచి పోవాలనుకుంటున్నాం," అన్నది అస్మాని.

బ్రాహ్మడు నిశ్చేష్టుడైపోయి, "ఎప్పుడు?" అన్నాడు.



"అవ్వాలె. వెంటనే, నేను వస్తాలె ఉన్నాను కనిపించటం లేదా?" అన్నది విమల.

ముగ్గురూ కలిసి బయలుదేరారు.

"మనం మళ్ళీ ఎప్పుడు తిరిగి వస్తాం?" అన్నాడు దిగ్గజుడు.

"లేచి పోయేవాళ్ళం తిరిగి ఎలా వస్తాం? ఆ మాత్రం తెలీదా?"

దిగ్గజుడు తన అజ్ఞానానికి సిగ్గుపడ్డాడు.

కొంత దూరం వెళ్ళాక అస్మాని, "మీరు నడుస్తూ ఉండండి. నేను వెనక నుంచి వచ్చి కలుసుకుంటాను," అని వాళ్ళను వదిలేసి తిన్నగా ఇంటికి పోయింది.

మరికొంత దూరం వెళ్ళాక దిగ్గజుడు విమలను, "అస్మాని ఎక్కడికి పోయింది? ఇంకా రాదేం?" అన్నాడు.

"పని ఉండి ఇంటికి పోయింది. రాలేక పోయింది కాబోలు," అన్నది విమల ముందు నడుస్తూ.

ఇద్దరూ మందారణి దాటారు. విమల చాలా చురుకుగా నడుస్తున్నది. అంత కంతకూ అంధకారం జాస్తి అవుతున్నది. ఎక్కడా జనసంచారం లేదు.

విమల దిగ్గజుడితో, "నీకు దయ్యా లంటే భయమేనా? ఈ మార్గాన, ప్రత్యే



కించి రాత్రివేళ, దయ్యాల భయం జాస్తి," అన్నది.

దిగ్గజుడు బెదిరిపోయి చప్పున ముందుకు వచ్చి విమల చీర కొంగు పట్టుకున్నాడు.

"ఆనాడు మేం శైలేశ్వర మందిరానికి వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు మర్రి చెట్టుమీద భయంకరాకారం కనిపించింది," అన్నది విమల. దిగ్గజుడు వణికి పోతూండటం చూసి, ఇంక ఈ ప్రస్తావన ఆపకపోతే బ్రాహ్మడు అడుగు వెయ్యలేని స్థితిలో పడి పోతాడనుకుని ఆమె మాట మార్చి, "రసిక రాజా, నీకు పాటలు వచ్చా? ఏదీ, ఒక మంచి పాట పాడు," అన్నది.



పాట వింటూ ముందు నడుస్తున్న విమల కొంగు గుంజినట్టయి, వెనక్కు తిరిగి, "ఏమయింది?" అన్నది.

దిగ్గజుడు హీనస్వరంతో, "అదుగడుగో!" అంటూ ఒక చచ్చిపోతున్న గుర్రం కేసి చూపాడు. ఆ గుర్రం చక్కగా అలంకరించి, జీను వేసి ఉన్నది.

విమల వ్యాకుల మనస్సుతో వేగంగా ముందుకు సాగింది. వారిద్దరూ సుమారు అరకోసు నడిచిన మీదట వారి కొక సైనికుడి తలపాగా కనబడింది.

ఇంతలో చంద్రోదయ మయింది. విమల అన్యమనస్కురాలై ఉండటం చూసి దిగ్గజుడు, "ఏమీ మాట్లాడవేం?" అన్నాడు.

"దారి వెంబడి గుర్రాల డెక్కల గుర్తులు చూశావా? నీ కేమైనా అర్థమవుతున్నదా?"

"లేదు."

"చచ్చిన గుర్రం, సైనికుడి తలపాగా, గుర్రాల డెక్కల గుర్తులు—ఏమీ బోధపడలేదా? ఎందుకు నిన్నడగటం?" అన్నది విమల. అంతలోనే ఆమెకు శైలేశ్వర మందిర గోపురం కంటపడింది. ఇక దిగ్గజుణ్ణి తన వెంట ఉండనివ్వ నవసరం లేదనుకుని విమల అతనికి భయంకరమైన భూతాల కథలు చెప్పింది. దిగ్గజు డవి విని, కారెత్తి మందారణ దుర్గం కేసి కాలి సత్తువకొద్దీ పరుగు తీశాడు.

విమల మందిర ద్వారాన్ని సమీపించి, ద్వారం లోపలినుంచి గడియపెట్టి ఉండటం గ్రహించి, తలుపు మీద కొట్టింది.

లోపలి నుంచి గంభీరంగా, "ఎవరు?" అనటం వినిపించింది.

"అలిసి ఉన్న అతిథిని," అన్నది విమల తన ధైర్యాన్ని చిక్కబట్టి.

ద్వారం తెరుచుకున్నది. మందిరంలో దీపం వెలుగుతున్నది. కత్తి చేతబట్టి నిలబడి ఉన్న దీర్ఘశరీరుణ్ణి విమల గుర్తించింది. అతను జగతసింహుడు. —(ఇంకా వుంది)






## 5

[దుర్గేశనందిని తిలోత్తమా, మానసింహమహారాజు కొడుకు జగత్సింహుడూ శైలేశ్వర మందిరంలో కలుసుకున్నప్పుడు యువరాజు తానెవరో చెప్పుకున్నాడు, కాని తిలోత్తమ వెంట ఉన్న విమల తన యజమానురాలి వివరాలు అతనికి తెలపటానికి పదిహేను రోజులు వ్యవధి కోరింది. ఈలోపుగా ఆమె రెండు విషయాలు స్పష్టంగా తెలుసుకున్నది; ఒకటి, తిలోత్తమ యువరాజును గాఢంగా ప్రేమిస్తున్నది; రెండు, వారిద్దరి వివాహానికి దుర్గేశుడైన వీరేంద్రసింహుడు ఒప్పుకోడు. అయినప్పటికీ విమల తాను యువరాజుకిచ్చిన మాట నిలబెట్టుకోవటానికి శైలేశ్వర మందిరానికి రాత్రివేళ బయలుదేరి వెళ్ళింది.]

విమల మందిరం ప్రవేశించి, విశ్రాంతి తీసుకోవటానికి రెండు క్షణాలసేపు కూర్చుని, లేచి వెళ్ళి శైలేశ్వరుడి పాదాలకు వందనం చేసి, యువరాజు వద్దకు వచ్చి నమస్కరించింది.

కొద్దిసేపు ఇద్దరికీ సంభాషణ ఎలా ప్రారంభించాలో తెలియలేదు. అయితే ఇలాటి విషయాలలో సిద్ధహస్తురాలైన విమల, "యువరాజా, శైలేశ్వరుడి అనుగ్రహం వల్ల నా కివాళ మీ దర్శన భాగ్యం కలిగింది. ఇంత రాత్రివేళ ఒంటరిగా వస్తూ దారిలో ప్రాణాలు అరచేత పట్టుకుని వచ్చాను. మీరు కనిపించాక మనస్సుకు కాస్త ధైర్యం వచ్చింది," అన్నది.

బంకించంద్ర చట్టోపాధ్యాయ



"అందరూ క్షేమమా?" అని యువరాజు అడిగాడు. అతడికి తనలో తనపై నిజమైన గాఢానురాగం ఉన్నదీ లేనిదీ తెలుసుకోగోరి విమల, "ఆ క్షేమం కోసమే శైలేశ్వరుణ్ణి దర్శించ వచ్చాను. శైలేశ్వరుడు మీ పూజలకు అనుగ్రహించినట్టు నా కర్థమయింది. నా పూజలు గ్రహించడు. తమ శెలవైతే నేను వెళ్ళివస్తాను," అన్నది.

"వెళ్ళిరా! కాని ఒక్కర్తెవూ వెళ్ళటం భావ్యంకాదు. నేను వెంట వచ్చి దిగబెడతాను," అన్నాడు జగతసింహుడు.

"ఒంటరిగా వెళ్ళటం ఎందుకు భావ్యం కాదు?" అని విమల అడిగింది.

"దారిలో ఎన్ని అపాయాలైనా కలగవచ్చు," అన్నాడు యువరాజు.

"అలా అయితే నేను మానసింహ మహారాజు వద్దకు వెళ్ళి, 'తమరు సేనాపతిగా నియమించిన వారి అధీనంలో స్త్రీలకు క్షేమం లేకుండా ఉంటున్నది; శత్రువులను అదుపులో ఉంచే దక్షత ఆయనకు లేదు,' అని చెబుతాను," అన్నది విమల గడుసుగా.

యువరాజు విరగబడి నవ్వి, "దేవతలకే తప్పలేదు, మనుష్యులన్న తరవాత శత్రువులుండరా? ఉదాహరణకు శివుణ్ణే తీసుకో. ఆయన తపస్సు చేసుకునేటప్పుడు తన శత్రువైన మన్మథుణ్ణి భస్మం చేసేశాడు. ఆ మన్మథుడే ఒక పక్షం రోజుల క్రితం ఆ శివుడి మందిరంలోనే జొరబడి పెద్ద ఉపద్రవం కలిగించేశాడు," అన్నాడు.

"అంత ఉపద్రవానికి గురి అయిన వారెవరు?"

"సేనాపతే."

"మహారాజా, అలాటి అసంగతమైన విషయాన్ని ఎవరు నమ్ముతారు?"

"నాకు సాక్ష్యం సిద్ధంగా ఉన్నది."

"ఎవరా సాక్షి?"

"నా ప్రేమకు విమలే సాక్షి!" అన్నాడు యువరాజు జగతసింహుడు.



"విమల మీ రనుకున్నట్టు సాక్షిగా ఉండదు."

"అదీ సంభవమే. ఏమంటే ఇచ్చిన మాట నిలబెట్టుకోని మనిషి నిజమైన సాక్ష్యం ఎలా చెబుతుంది?" అన్నాడు యువరాజు.

"నేనేం మాట ఇచ్చానో కాస్త జ్ఞాపకం చెయ్యమని ప్రార్థన," అన్నది విమల.

"మీ యజమానురాలి పరిచయం."

విమల ఛలోక్తి ధోరణి విడిచిపెట్టి గంభీరంగా, "యువరాజా, పరిచయం చెయ్యటానికి జంకుగా ఉన్నది. ఆమెను గురించి తెలుసుకున్నాక మీకు ఏమైనా బాధ కలిగితే?" అన్నది.

జగతసింహుడు కూడా వెటకారపు ధోరణి విసర్జించి, "నిజం తెలుసుకోవటం వల్ల నాకు బాధ కలగటానికి తగిన కారణం ఉన్నదా, విమలా?" అని అడిగాడు.

"ఉన్నది."

జగతసింహుడు కొంచెంసేపు ఆలోచించి, "ఏమైతే అయింది, చెప్పు. నే నిప్పుడు పొందుతున్న బాధ కన్న హెచ్చు బాధ కలిగించే కారణం ఏదీ ఉండబోదు. విమలా, ఇవాళ నేను నిన్ను ఇక్కడ కలుసుకున్నది సరదా కోసం కాదు. ఈ పదిహేను రోజులుగా నేను నడుము వాల్చి ఎరగను," అన్నాడు.



ఆ మాట చెవిని వేసుకునేటందుకే విమల ఇంతసేపూ నాటక మాడింది. కాని అప్పటికీ అసలు సంగతి బయట పెట్టక అతన్ని కబుర్లలో పెట్టింది. చివర కతను, "చెప్పు, విమలా, మీ చెలిని కలుసుకోవాలంటే ఎక్కడికి వెళ్ళాలి?" అని అడిగాడు.

"మందారపు దుర్గానికి వెళ్ళాలి. తిలోత్తమ వీరేంద్రసింహుడి కుమార్తె," అన్నది విమల.

ఈ మాట వినగానే జగతసింహుడికి కాల సర్పం కాటు వేసినట్టయింది. అతని చేతి కత్తి కింద పడిపోయింది. అతను దీర్ఘంగా నిట్టూర్చి, "ఏ మాట నిజం! తిలోత్తమ



ఎన్నటికీ నాది కాదు. నేను యుద్ధరంగానికి పోయి నా కోరికను శత్రు రక్తంతో కడిగేసు కుంటాను," అన్నాడు.

అతని నిరాశా నిస్పృహలను చూసి విమల, "యువరాజా, ప్రేమ కేమైనా ప్రతిఫలం ఉండే పక్షంలో దాన్ని తిలోత్తమకు ఇవ్వదగిన వాడవు నీవే!" అన్నది.

ఈ మాటలతో, అతని మనసులో ఆశ చిగిర్చింది. అతను విమలతో, "ఏమైనా ఇవాళ నా మనసు వికలంగా ఉన్నది. నిన్నొక్కటి వేడుకుంటాను, చెయ్యగలవా? నీవు వెళ్ళి మీ సఖికి నా పరిస్థితి చెప్పి, ఒక్కసారి—ఒకే ఒక్కసారి— నా కామె దర్శన భాగ్యం కలిగించమని చెప్ప గలవా?" అన్నాడు.

"దానికి మా సఖి ఏమంటుందో తమకు తెలిసే దెలా?" అని విమల అడిగింది.

"మాటి మాటికీ నిన్ను శ్రమపెట్టటం నా కేమీ బాగా లేదు. కాని ఇంకొక్క సారి ఈ మందిరానికి వచ్చి నన్ను కలుసు కున్నట్టయితే నేను ఎప్పటికీ ఋణపడి ఉంటాను. జగతసింహుడి నుంచి నీకు ఇందుకు గాను ప్రత్యుపకారం లభించక పోదు!" అన్నాడతను.

విమల ఆ పని మాత్రం తన వల్ల కాదని, దారి చాలా భయమనీ, యుద్ధ పరిస్థితి కూడా



ఉంటున్నదనీ, మాట ఇచ్చాను గదా అని ఈ సారికి వచ్చాననీ అన్నది.

"ప్రమాదం ఉండదని నీకు తోచే పక్షంలో నేను నీ వెంట మందారణ దుర్గానికి వస్తాను. నేను అనుకూలమైన చోట వేచి ఉంటాను. నీవు వెళ్ళి జవాబు తీసుకురా!" అన్నాడు జగతసింహుడు.

విమల సంతోషంతో, "అయితే పదండి," అన్నది. వా రిద్దరూ మందిరంలోనుంచి వెలికి రాబోయే సమయంలో బయట అడుగుల చప్పుడయింది. జగతసింహు డాశ్చర్యపడి, "నీ వెంట మరెవరైనా వచ్చారా?" అని అడిగాడు.

"లేదే!" అన్న దామె.

"అయితే ఆ చప్పుడు చేసిన దెవరు? బయటి నుంచి ఎవరో మన సంభాషణ విన్నారని నాకు తోస్తుంది," అంటూ అతను బయటికి వచ్చి, చుట్టూ కలయజూశాడు, కాని ఎవరూ కానరాలేదు.

ఆ ఇద్దరూ శైలేశ్వరుడికి నమస్కరించి, మందారణాని కేసి కొంతదూరం నడిచినాక యువరాజు, "నా కొక విషయం తోస్తున్నది, చెబితే నీ వేమంటావో మరి," అన్నాడు.

"ఏమిటది?" అని విమల అడిగింది.

"నీవు పరిచారికవు కావాలని నా మనస్సులో అనిపిస్తున్నది."





"మీ కలా అనుమాన మెందుకు కలిగింది?"

"వీరేంద్రసింహుడి కుమార్తె అంబర రాజా కోటలు కాజాలదు; అందు కొక నిగూఢ కారణం ఉన్నది. ఆ కారణం పరిచారికకు తెలియటం సాధ్యం కాదు. నీ కెలా తెలిసింది?"

విమల దీర్ఘశ్వాస తీసుకుని విచార స్వరంతో, "మీ అనుమానం నిజమే. నేను పరిచారికను కాను, అభాగ్యవశాన పరిచారిక లాగా ఉంటున్నాను," అన్నది.

ఈ ప్రస్తావన ఆమెకు బాధాకరమని గ్రహించి జగతసింహు డేమీ అనలేదు. విమల తనకు తానే, "యువరాజా, నేను నా విషయమంతా చెబుతాను, కాని ఇప్పుడు కాదు... అదేమిటా చప్పుడు? మన వెనక ఎవరో వస్తున్నట్టున్నది," అన్నది.

వెనక నుంచి అడుగుల చప్పుడు విన పడింది. ఎవరో గుస గుస లాడుకున్నట్టు కూడా వినిపించింది. అప్పటికి వారు మందిరం నుంచి ఒక మైలుదూరం వచ్చి ఉంటారు.

"మనని ఎవరో వెంటాడి వస్తున్నారు," అంటూ జగతసింహుడు ముందుకు సాగాడు. వారు చిన్నగా మాట్లాడుకుంటూ వేగంగా నడవ సాగారు.

వారు మందారణానికి చేరేసరికి నడిరాత్రి అయింది. "ఇంత రాత్రివేళ దుర్గంలోకి ఎలా ప్రవేశిస్తావు?" అని రాజకుమారుడు విమల నడిగాడు.

"అ భయమేమీ లేదు. ఆ ఉపాయా లన్నీ చూసుకునే ఇంటి నుంచి బయలు దేరాను," అన్నది విమల.

ఇద్దరూ దుర్గం వెనుకతట్టున ఉన్న మామిడి తోటలో ప్రవేశించారు.

"ఈ తోట కూడా నిర్జన స్థలం కాదు. మీరు నా వెంట దుర్గంలోకి రండి," అన్నది విమల.



జగతసింహుడు కొంచెం ఆలోచించి, "నే నలా చెయ్యటం ఉచితం కాదు. దుర్గేశుడి అనుమతి లేకుండా నే నెలా దుర్గంలోకి అడుగు పెట్టేది?" అన్నాడు. అంబర రాజకుమారుడైన తాను అలా దుర్గంలో ప్రవేశించటం దొంగవాడు చేసే పని అని అతనికి అనిపించింది.

"నేను వెంట ఉండి తీసుకుపోతున్నాను కదా?" అన్నది విమల.

"కాని నీకు నన్ను దుర్గంలోకి తీసుకుపోయే అధికారం ఉన్నదా? పరిచారికవని తక్కువ చేసి ఈ మాట అడుగుతున్నా ననుకోవద్దు," అన్నాడు యువరాజు.

విమల కొంచెం సేపాలోచించి, "నా కున్న అధికారం ఏమిటో తెలుసుకోకుండా నా వెంట రాలేరా?" అని అడిగింది.

"ఎంతమాత్రం రాలేను," అన్నాడతను.

విమల అతని చెవిలో ఏదో రహస్యంగా చెప్పింది.

"పద!" అన్నాడతను.

ఇంతలో తోటలోని ఎండుటాకులపై ఎవరో నడుస్తున్న ధ్వని అయింది.

"అదుగో మళ్ళీ!" అన్నది విమల.

"కొంచెంసేపిక్కడే ఉండు. నేను వెళ్ళి చూసి వస్తాను," అని అతను కత్తి దూసి



ధ్వని వినిపించిన వైపు వెళ్ళాడు. అతని కెక్కడా ఎవరూ కనిపించలేదు. పోషణ లేక మామిడి తోటంతా అడవిలాగా పెరిగి ఉన్నది. అందులో ఎంత మంది అయినా దాగవచ్చు.

జగతసింహుడు కత్తి చేత పట్టుకుని ఒక చెట్టెక్కాడు. దాని పై నుంచి అతను చుట్టూ కలయ జూసిన మీదట అతని దృష్టి అన్నిటికన్న ఎత్తుగా ఉన్న ఒక చెట్టుపైన పడింది. దాని పైన ఇద్దరు మనుషులు దాగి ఉన్నారు. వెన్నెలలో వారి తలపాగాలు మాత్రమే కనిపిస్తున్నాయి. అతను ఆ చెట్టును చక్కగా గుర్తు పెట్టుకుని, తా నెక్కిన చెట్టు



నుంచి దిగి వచ్చి, విమలకు తాను చూసి నది చెప్పి, "ఇప్పుడు రెండు బల్లా లుంటే బాగుండును," అన్నాడు.

"ఎందుకు?" అన్నది విమల.

"వాళ్ళెవరో తెలుసుకోవటానికి. పరిస్థితి అనుమానాస్పదంగా ఉన్నది. తలపాగాలు చూస్తే, ఈ దుష్ట పఠాను లేదా దురుద్దేశం తోనే మనని వెన్నాడుతున్నట్టు తోస్తుంది," అన్నాడు జగతసింహుడు.

వెంటనే విమలకు దారిలో తాను చూసిన గుర్రం కళేబరమూ, తలపాగా మొదలైనవి జ్ఞాపకం వచ్చి భయం కలిగింది. "మీ రిక్కడే ఉండండి. నేను దుర్గంలోకి వెళ్ళి ఇప్పుడే బల్లాలు తెస్తాను," అంటూ చర చరా వెళ్ళిపోయిందామె.

విమల దుర్గపు రహస్య ద్వారాన్ని తన తాళపు చెవితో తెరిచి, లోపల ప్రవేశించి, రహస్య ద్వారానికి తాళం వేసి, ఆయుధా గారానికి వెళ్ళి, అక్కడ ఉండే మనిషితో, "నాకు రెండు బల్లాలు కావాలి. అప్పుడే తిరిగి ఇస్తాను," అన్నది.

"అమ్మా, వాటితో మీకేం పని?" అని ఆయుధాగార రక్షకు డడిగాడు.

"ఇవాళ వీరపంచమి. వీరమాతను కొలవటానికని వ్రతం చేస్తున్నాను. ఎవరికీ చెప్పకు," అన్నది విమల.

అత డిచ్చిన రెండు బల్లాలూ తీసుకుని ఆమె వేగంగా యువరాజున్న చోటికి తిరిగి వచ్చింది; కాని తొందరలో రహస్య ద్వారానికి తాళం వెయ్యటం మరిచిపోయింది. ఇందువల్ల గొప్ప విపత్తు సంభవించింది.

వెలుపలి అస్త్రధారిగా ఉన్న పురుషు డొకడు రహస్య ద్వారం బార్లా తెరిచి ఉండటం గమనించి ఆ ద్వారం గుండా దుర్గంలో ప్రవేశించాడు. ఎక్కడా ఎవరూ మేలుకుని ఉన్న జాడలు లేవు. ఆ మనిషి తిన్నగా అంతఃపురం దాకా వెళ్ళిపోయాడు.

—(ఇంకా ఉంది)






## 6

[జగతసింహుణ్ణి కలుసుకుని తన వెంట వృత్తాంతం చెప్పుకొనని మాట ఇచ్చిన విమల గడువునాటి రాత్రి శైలేశ్వర మందిరానికి వెళ్ళింది. తిలోత్తమ వీరేంద్రసింహుడి కుమార్తె అని తెలియగానే జగతసింహుడు హతాశుడయాడు. ఒక్కసారి తిలోత్తమను చూడగోరి అతను విమల వెంట మందారణ దుర్గానికి వచ్చాడు. విమల పొరపాటు చేత ఒక పఠానువాడు దుర్గంలో ప్రవేశించాడు. ఆ సమయంలో—]

జగతసింహుడు విమల తెచ్చిన బల్లాలు రెండూ తీసుకుని, వెనక ఎక్కిన చెట్టే మళ్ళీ ఎక్కాడు. అప్పు డతనికి దూరంగా చెట్టు ఆకుల మధ్య ఒక్క తలపాగాయే కనిపించింది; రెండోది లేదు. అతను ఆ కని పించే తలపాగా కేసి గురిచేసి ఒక బల్లాన్ని ఎంత బలంతో విసిరాడంటే, తలపాగావాడు తక్షణమే కింద పడిపోయాడు. జగత సింహుడు చప్పున దిగి వచ్చి ఆ వ్యక్తిని పరిశీలించాడు. సాయుధ సైనికుడిలా కనిపించే ఒక ముసల్మాను వాడు చచ్చిపడి ఉండటం అతనికి కనిపించింది. బల్లెం అతని కంటి గుండా మెదడులోకి చొచ్చుకు పోయింది.

ఆ సైనికుడి కవచంలో నుంచి ఏదో కాగితం సగం పైకి వచ్చి జగతసింహుడి

బంకించంద్ర చట్టోపాధ్యాయ





కంట పడింది. అతను ఆ కాగితాన్ని తీసి వెన్నెల కాంతిలో ఇలా చదువుకున్నాడు: "ఈ పత్రం గలవారు చెప్పే ఆజ్ఞలను కళలాకాస్ అనుచరులు నిర్వర్తిస్తారుగాక."

విమలకి గొడవ కొంచెం కూడా తెలియదు. ఆమె యువరాజును చేర వచ్చి, "ఇక్కడ ఉండటం క్షేమం కాదు. దుర్గం లోకి పోదాం పదండి. నేను పొరపాటున రహస్య ద్వారాన్ని మూయకుండా వచ్చేశాను," అన్నది.

ఇద్దరూ గుండెలు దడ దడ లాడుతూ దుర్గాన్ని ప్రవేశించారు. విమల రహస్య ద్వారాన్ని లోపలి నుంచి బంధించింది.

ఆమె అతన్ని ఒక శయ్యాగారం వద్దకు తీసుకుపోయి, "నే నిప్పుడే తిరిగి వస్తాను. మీరు వెళ్ళి తల్పం పైన విశ్రమించండి," అని చెప్పింది.

ఆమె వెళ్ళి తిరిగి వచ్చి, తలుపు తెరిచి, "యువరాజా, రాండి," అన్నది. యువరాజు కంపిత హృదయంతో లేచి, విమల వెంట అంతఃపురంలోని ఒక గది వద్దకు చేరుకున్నాడు. వెంటనే విమల అక్కడి నుంచి నిష్క్రమించింది. గది నుంచి కమ్మని వాసనలు వస్తున్నాయి. దీపం ప్రకాశిస్తున్నది. గదిలో ఒక నవయువతి తల వంచుకుని కూర్చుని ఉన్నది. ఆమే తిలోత్తమ.

విమల యువరాజును గది వద్దకు చేర్చి తన గదికి వెళ్ళిపోయింది. ఆమె ముఖాన ఆనందం తాండవిస్తున్నది, ఎందు కంటే ఆమె మనోరథం ఈనాడు సిద్ధించింది. ఆమె అద్దం ముందు నిలబడి తన రూప లావణ్యాలను చూసుకుని మురిసి పోయింది. తరవాత ఆమె తిరిగి వచ్చి, శయ్యపై కూర్చుని జగత్ సింహుడి కొరకు నిరీక్షించసాగింది.

అంతలో వెలుపల కోటలో బాకాధ్వని పెద్దగా వినపడింది. ఆమె ఉలికి పడింది. తూర్యధ్వనులు ముఖద్వారం నుంచి విని

పించాలి గాని, వెనుక నుంచి విలపించడ మేమిటి? ఇంతలో ఏదో వైపరీత్యం ఉందని శంకించి ఆమె భయ విభ్రాంతు రాలయింది. ఆమె కిటికీ వద్దకు వెళ్ళి, వెనుక ఉన్న తోట నాలుగు మూలలా కలయ చూసింది, కాని ఏమీ కనిపించలేదు.

విమల తన గది నుంచి బయటికి వచ్చి, రహస్యమార్గాన మెట్లెక్కి, డాబా మీదికి వెళ్ళి, దృష్టి అన్ని వైపులా ఎంతో దూరం పారించింది, కాని గాఢాంధకారంలో ఏమీ కనిపించ లేదు. ఆమె మిద్దె మీద గోడ వెంబడి ఒక చివరకు వెళ్ళి, అక్కడి నుంచి తిరిగి వస్తూండగా, తన వీపు మీద ఎవరో వేలు పెట్టినట్టయింది. ఆమె గతుక్కుమని వెనక్కు తిరిగే సరికి ఒక అపరిచితుడు అస్త్రధారి అయి కనిపించాడు. విమల కొయ్యబారి పోయింది.

"అరవకు. అందగత్తెలు అరవటమూ, కెవ్వుమనటమూ బాగుండదు," అన్నా డా మనిషి.

విమల అతణ్ణి ఆపాదమస్తకమూ చూసి అతను సామాన్య సైనికుడు కాడని గ్రహించింది. చతురురాలైన విమల క్షణంపాటు నిశ్చేష్ట అయింది. ఆమె అంతలోనే తన చైతన్యాన్ని తిరిగి పొంది, "ఎవరు నువ్వు?" అని ఆ వ్యక్తిని అడిగింది.





"నా పరిచయం వల్ల నీకేం లాభం?" అని అతను అడిగాడు.

"నీవు దుర్గంలోకి ఎలా ప్రవేశించావు? దొంగలను కొరతవేస్తారని వినలేదా?" అన్నది విమల.

"సుందరీ, నేను దొంగను కాను."

"దుర్గంలోకి ఎలా దొరబడ్డావు?"

"నీ దయవల్లనే. నీవు రహస్యద్వారం తెరుచుకుని కోటలోకి వెళ్ళేటప్పుడు నా అదృష్టం కొద్దీ దాన్ని తెరిచి ఉంచి వెళ్ళావు. ఆ సమయంలో నేను లోన ప్రవేశించాను. అప్పుడు మొద్దు మీద నిన్ను అనుసరించి వస్తున్నాను."

"ఇంతకూ నీ వెవరు?"

"పఠానును. నా పేరు ఉస్మాన్ ఖాన్...గుర్తు రాలేదా? ఇంకా వివరంగా చెప్పాలా? కతలూఖాన్‌యొక్క సేనాపతిని," అన్నాడా పఠాను.

విమల నిలువునా కంపించి పోయింది. యువరాజుకీ సమాచారం ఎలా అందజేయాలా అని గిలగిలలాడింది; అందుకు మార్గమే కనిపించలేదు. అందుచేత చివరకామె ఆ పఠానువాణ్ణి సాధ్యమైనంత సేపు అక్కడినుండి కదలకుండా చెయ్యటం మంచిదని నిశ్చయించుకున్నది. ఇంతలో ఎవరైనా దుర్గానికి చెందిన సైనికుడు ఇటుగా వచ్చి, పరిస్థితి గ్రహించి, ప్రతిక్రియకు కొరకు ప్రయత్నించవచ్చు. ఆమె ఉస్మాన్‌ఖానును మాటలలోకి దింపింది.

ఆమె తన నెలాగైనా మొద్దుపైనే నిలిపి ఉంచటానికి తన చాతుర్యమంతా వినియోగిస్తున్నదని ఉస్మాన్‌ఖాన్ చివరకు గ్రహించాడు. "నీ పైబట్ట కొంగున కట్టి ఉన్న తాళపు చెవులగుత్తి మర్యాదగా నా కిచ్చెయ్యి. నీ వంటి పై చెయ్యివేసి నీ మానానికి కళంకం కలిగించటం నా కిష్టంలేదు," అన్నాడు.

తన ఆట కట్టయిపోయినట్టు విమల తెలుసుకున్నది. బలాత్కారంగా తాళపు



చెప్పులను తొడుక్కొగలవారు అంత మర్యాదగా మాట్లాడటం వెటకారం గాక మరేమిటి?

ఆమె తన పైబట్టను తీసి చేతిలో పట్టుకుంటూ, "అయ్యో, నా అంతట నేను తాళపుచెవి ఇవ్వకపోతే, మీ రెలా తీసుకుంటారు?" అన్నది.

"మర్యాదగా ఇవ్వకపోతే నిన్ను స్పృశించవలసి వస్తుంది," అన్నాడు ఉస్మాన్‌ఖాన్.

"తీసుకోండి," అంటూ ఆమె తన పై బట్టను తోటలోకి విసిరింది. ఉస్మాన్ ఖాన్ చెయ్యి చాచి బట్టను అందుకుని, దాని కొంగు నుంచి తాళపు చెవులగుత్తిని తీసి, తన మొలలో దోపుకుని, ఆ పై బట్ట తోనే విమలను గట్టిగా బంధించి, మెట్ల మీదుగా కిందికి దిగి వెళ్ళిపోయాడు.

విమల గట్టిగా అరిచి కేకలు పెట్టింది. కాని వాటిని విన్నవారు లేరు. కిందికి వెళ్ళిన ఉస్మాన్‌ఖాన్ మొదట విమల గదిలోకి వెళ్ళాడు. తాళపుచెవుల సహాయంతో రహస్యద్వారం తెరిచాడు. తెరిచిన ద్వారం గుండా ఒక్కొక్కరుగా అనేక మంది సైనికులు లోపలికి వచ్చారు. చివర కతను, "ఇంక చాలు. మిగిలిన వాళ్ళు ఇక్కడనే ఉండండి. నేను సంకేతం ఇవ్వగానే కోటను



ఆక్రమించుదాం. ఈ మాట తాజ్‌ఖాన్‌కు చెప్పాలి," అన్నాడు.

ఉస్మాన్ వెంట సైనికులు లోపల ప్రవేశించారు. అతనొక సైనికుణ్ణి మేడపైకి తీసుకుపోయి, విమలను అతనికి చూపి, "ఈమె చాలా చాతుర్యం గలది. ఈమెనే మాత్రమూ నమ్మవద్దు. రహీమ్‌షేక్, నిన్నీమెకు కావలా ఉంచుతున్నాను. ఈమె పారిపోవటానికి గాని, కేకలు పెట్టటానికి గాని యత్నించిందో నరికెయ్యి, అడిగితే ఏమీ మాట్లాడవద్దు. తెలిసిందా?" అన్నాడు.

"జీహుకుమ్," అని రహీమ్‌షేక్ విమలకు కావలా ఉండిపోయాడు.



ఉస్మాన్‌ఖాన్ వెళ్ళిపోగానే విమలకు ధైర్యం వచ్చింది. చాకచక్యం వినియోగించి బంధవిముక్తి పొందవచ్చునన్న నమ్మకం కూడా కలిగింది. తన చెంత నిలబడి ఉన్న కావలావాడితో ఆమె సంభాషణ పెట్టుకున్నది. ఒక అందమైన ఆడది తన సుఖదుఃఖాలను గురించీ, గృహ విషయాలను గురించీ సానుభూతితో అడుగుతూంటే సామాన్య సైనికుడి హృదయం కరిగిపోవటంలో ఆశ్చర్య మేమిటి? రహీమ్‌షేక్ విమల చల్లిన మచ్చుమందు ప్రభావానికి పూర్తిగా వశుడైపోయాడు. అది గమనించి విమల అతడితో తనకు చాలా భయంగా ఉన్నదని చెప్పి, సమీపంగా వచ్చి కూర్చో మన్నది. అతను సంతోషంతో వచ్చి ఆమె పక్కన కూర్చున్నాడు.

"షేక్‌జీ, మీ నుదిటి మీద అంత చెమ టేమిటి? ఒక్కసారి నా కట్లు విప్పరాదా? కాస్సేపు విసురుతాను. తరవాత మళ్ళీ బంధించవచ్చు." అన్నది విమల. అతని నుదిటి మీద చెమట ఏ మాత్రమూ లేదు. అయినా అతను ఆమె చేత విసిరించుకుని ఆనందించటానికిగాను ఆమె చేతులకు కట్టిన పై బట్ట విప్పేశాడు.

విమల ఆ బట్టతో కాస్సేపు అతనికి విసిరి, దానిని తన ఒంటి పైన వేసుకు



కున్నది. రహీమ్‌ఖాన్ ఆమె చేతులను తిరిగి బంధించే మాట తలపెట్టలేదు. పై బట్టను ధరించి పక్కనే కూర్చుంటే ఆమె సౌందర్యం రెట్టింపయినట్టుగా అతనికి తోచింది.

"ఖాన్‌జీ, నీ భార్యకు నీవంటే ప్రేమ లేదా?" అన్నది విమల.

"అదేమిటి? లేకేం?" అన్నాడు రహీమ్‌ఖాన్ ఆశ్చర్యంగా.

"ప్రేమ ఉంటే ఈ వసంతకాలంలో నిన్ను విడిచి ఉండ గలదా?" అన్నది విమల. వసంతకాలం వెళ్ళిపోయి మూడు నెల లయింది. కాని ఆ మూర్ఖుడికి విమల రూపంలో వసంతం ఎదురుగా ఉన్నట్టే తోచింది.

విమల తనను ప్రేమిస్తున్నదనీ, తనతో లేచిపోయి రావటానికి సిద్ధంగా ఉన్నదనీ అతను నమ్మేలాగా ఆమె అతనికి కబుర్లు చెప్పింది.

"అయితే, ఈ యుద్ధంలో జయం లభించి నే నింటికి తిరిగి వెళ్ళేటప్పుడు నిన్ను తప్పకుండా వెంట పెట్టుకుపోతాను. అక్కడ మా నాయకుడు పెట్టే బాధలు పడింద లేకుండా ఉన్నాను," అన్నాడు రహీమ్. అతను విమల విచారంగా ఉండటం చూసి, "ఏమిటాలోచిస్తున్నావు?" అన్నాడు.






# 7

[దుర్గంలోకి ప్రవేశించిన పఠాను యోధుడు కతలూఖాన్ సేనాపతి అయిన ఉస్మాన్‌ఖాన్. విమల జగత్సింహుణ్ణి తిలోత్తమ గదికి చేర్చి, పైకి వెళ్ళేసరికి ఉస్మాన్‌ఖాన్ ఆమెను పట్టుకుని, ఆమె వద్ద ఉన్న తాళపు చెవులు తీసుకుని, ఆమెను బంధించి ఒక సైనికుడి కాపలాలో ఉంచి, రహస్య ద్వారంగుండా కొంతమంది పఠానులను దుర్గంలోకి ప్రవేశపెట్టాడు. విమల తనకు కాపలావున్న పఠాను సైనికుణ్ణి మోసగించి, తప్పించుకుపోయింది.]

శత్రువులు కోటలో ప్రవేశించిన సంగతి వీరేంద్రసింహుడికి తెలియజెయ్యటం తన ప్రథమ కర్తవ్యం గనక విమల ఆయన శయన మందిరం దిక్కుగా పరిగెత్తసాగింది. మధ్య దారిలో ఆమెకు "అల్లా హో అక్బర్!" అన్న నినాదం వినిపించింది. అది పఠానుల విజయ నినాదం.

క్రమంగా దుర్గంలో కలకలం జాస్తి కాసాగింది. నిద్రపోతున్న వారంతా లేచి పట్టుకున్నారు. ఆమె కంగారు పడుతూ వీరేంద్రసింహుడి శయన మందిరం కేసి వెళ్ళింది. అక్కడ కోలాహలంగా ఉన్నది. పఠాను సైనికులు తలుపు పగలగొట్టి లోపల ప్రవేశించారు. వీరేంద్రసింహుడు చేత కత్తి పట్టి, వెర్రివాడిలాగా గిరగిరా తిప్పుతున్నాడు. ఆయన శరీరమంతటా రక్త ప్రవాహాలు. చివర కతని పోరాటం వ్యర్థమైపోయింది. ఒక పఠానువాడి నిడుపైన కత్తి దెబ్బతో



వీరేంద్రసింహుడి కత్తి ఎగిరి, కింద పడి పోయింది. మరుక్షణం అతను పఠానులకు బందీగా చిక్కిపోయాడు.

విమల ఇదంతా కళ్ళారా చూసి హతాశురాలైపోయింది. "ఇప్పటికైనా మించి పోలేదు. తిలోత్తమను కాపాడవచ్చు," అనుకుని, తిలోత్తమ గది కేసి పరిగెత్తింది. కాని తిలోత్తమ గదిని చేరుకోవటం ఆమెకు సాధ్యం కాలేదు. అంతటా పఠానులు పోరాడుతున్నారు. దుర్గాన్ని దోపిడీ చేస్తున్నారు. దుర్గం పఠానుల కైవసమయినట్టు స్పష్టమయింది. పఠానుల చేతిలో పడకుండా తిలోత్తమ గదిని చేరుకోవటం అసంభవమని గ్రహించి విమల వెనక్కు తిరిగింది. తిలోత్తమా జగతసింహులకి ప్రమాద వార్త ఎలా చేర్చాలో ఆమెకు తోచలేదు.

ఈ విషయమే ఆలోచిస్తూ ఆమె ఒక గదిలో కూర్చున్నది. అంతలోనే కొంత మంది పఠాను సైనికులు ఒక్కొక్క గదే దోచుకుంటూ తానున్న గది కేసి వస్తున్నట్టు ఆమెకు పొడకట్టింది. వారి నుంచి తప్పించుకునే మార్గం లేక ఆమె ఒక పెట్టె వెనక నక్కి దాక్కున్నది.

సైనికులా గదిలో ప్రవేశించి అందులో ఉన్న వస్తువులన్నీ సంగ్రహించ నారంభించారు. వారా పెట్టె తెరవటానికి వచ్చి తప్పక తనను చూస్తారు. అయినా విమల ధైర్యం కోల్పోక, పఠానుల చర్య లన్నిటినీ పెట్టె వెనుక నుంచి శ్రద్ధగా గమనిస్తున్నది. సైనికులు తాము సంగ్రహించిన వస్తువులను చూసుకుని మురిసిపోతూ, ఉబ్బి తబ్బిబ్బవుతున్న అదను చూసుకుని విమల పెట్టె వెనక నుంచి లేచి బయటికి జారుకున్నది.

ఆమె గది నుంచి బయటికి వచ్చిందో లేదో, వెనకపాటున ఎవరో ఆమె చెయ్యి పట్టుకున్నారు. ఆమె వెనక్కు తిరిగి చూస్తే, రహీమ్‌శేఖ్!



"అప్పు డెలా తప్పించుకు పారి పోతావు?" అన్నాడు రహీమ్.

జాణ అయిన విమల ఒక్క క్షణం ఆలో చించి, "మాట్లాడకు! నోరు మూసుకుని నా వెంట రా!" అంటూ రహీమ్ చెయ్యి పట్టుకుని బయటికి లాక్కు పోయింది. రహీమ్ సమ్మతంగానే ఆమె వెంట వెళ్ళాడు.

విమల అతన్ని ఏకాంత స్థలానికి తీసుకు పోయి, "ఛీ, ఛీ! నువ్విలా చేస్తావని నే నెన్నడూ అనుకోలేదు! నన్ను ఒంటిగా వైన విడిచి ఎక్కడికి పోయావు? నీ కోసం వెతుకుతూ కోట అంతా తిరగలేక చచ్చాను," అన్నది. ఈ మాట అంటూ ఆమె అతని కేసి చూసిన చూపులకు శేఖ్ చిత్తయిపోయాడు.

"నేనేం చెయ్యను? సేనాపతిగారి కోసం తెగ వెతికాను. ఆయన అందరనుకుని పైకి వస్తే నువ్వు లేవు," అన్నాడు రహీమ్‌శేఖ్.

"నువ్వెంతకీ రాకపోయేసరికి నన్ను మరిచిపోయా వనుకుని నిన్ను వెతు క్కుంటూ బయలుదేరాను. ఇంకా నయం, కనిపించావు? హమ్మయ్య, బతికిపోయాను! శేఖ్, ఇంక ఆలస్యం చెయ్యకు. దుర్గం చిక్కిపోయినట్టే. ఇద్దరమూ పారి పోదాం పద," అన్నది విమల.



"ఇవాళ కాదు. రేపొద్దున పోదాం. యజమానితో చెప్పకుండా ఎలా పోవటం?" అన్నాడు రహీమ్.

"అయితే పద, ఇప్పటి నుంచే నగా నట్రా, డబ్బూ దస్కమూ అంతా మూట గట్టుకుని జాగ్రత్త పెట్టుకోవాలి. లేకపోతే ఏ సైనికుడో కాజేస్తాడు," అన్నది విమల.

"పద," అన్నాడు రహీమ్.

తాను కనీసం ఇతర సైనికుల చేతిలో పడకుండానైనా రహీమ్ కాపాడతాడని ఆమె ఉద్దేశం. ఆమె శంకించినట్టే వాళ్ళకు అనేక మంది సైనికులు తగిలారు, కాని రహీమ్‌ను చూసి వారు ఏమీ చేయలేదు. వాళ్ళల్లో





కొందరు రహీమ్ అదృష్టాన్ని గొప్పగా అభినందించారుకూడా.

విమల రహీమ్ నొక గదికి తీసుకుపోయింది. అక్కడ ఎన్నో పెట్టెలూ, రకరకాల విలువైన వస్తువులూ ఉన్నాయి. "దీనిపైదే నా పడక గది. ఇక్కడ నీకేమేం కావాలో ఏరుకుని మూటగట్టుకుంటూ ఉండు. నేను పైకి వెళ్ళి, నా వస్తువులు తీసుకుని అప్పుడే వస్తాను, సరేనా?" అన్నదామె, తాళపు చెవుల గుత్తి ఒకటి రహీమ్ కేసి విసురుతూ.

గదిలో ఉన్న వస్తువులు చూస్తుంటే రహీమ్ కళ్ళు చెదిరిపోయాయి. అతను వేగంగా పెట్టెలన్నీ తెరవటంలో నిమగ్నుడై పోయాడు. విమల ద్రోహం చేస్తుందన్న శంక అతనిలో కలగనేలేదు. ఆమె బయటికి వెళ్ళి తలుపులు మూసి తాళం వేసేసింది. రహీమ్ ఖైదీ అయిపోయాడు.

విమల తిలోత్తమ గది కేసి పరిగెత్తింది. అది దుర్గానికి ఒక మూలలో ఉన్నది. దానికి దిగువనే నది ప్రవహిస్తున్నది. అప్పటికింకా సైనిక విద్రోహం ఎవరూ అటుగా రాలేదు. దుర్గంలో చెలరేగే కోలాహలం తిలోత్తమా జగతసింహులకు వినిపించిందో లేదో కూడానూ. విమల ఒక్కసారిగా తిలోత్తమ గదిలోకి ప్రవేశించక, తలుపు సందుగుండా లోపలికి చూసింది. తిలోత్తమ మంచం మీద కూర్చుని ఉన్నది. జగతసింహుడు పక్కనే నిలబడి ఆమె ముఖంలోకి చూస్తున్నాడు. తిలోత్తమ కంట నీరు పెట్టుకుంటున్నది, జగతసింహుడామె కన్నీరు తుడుస్తున్నాడు. అవి ఏడ్పుల అశ్రువులని విమలకనిపించింది.

విమల లోపలికి వస్తుండగానే జగతసింహుడు, "బయట ఆ కోలాహల మేమిటి?" అని అడిగాడు.

"పఠానుల విజయధ్వానాలు. వాళ్ళు ఏ క్షణానైనా ఇక్కడికి రావచ్చు. మీరు

"త్వరగా ఏదో ఒక మార్గం ఆలోచించండి," అన్నది విమల.

"వీరేంద్రసింహుడు ఎక్కడ?"

"శత్రువులకు చిక్కిపోయాడు."

ఈ మాట వింటూనే తిలోత్తమ కెవ్వున అరిచి, స్పృహ తప్పి శయ్యపై పడిపోయింది. జగత్సింహుడి ముఖం నిస్తేజమయింది. అతను విమలతో, "నీవు తిలోత్తమ సంగతి చూడు," అన్నాడు.

విమల పన్నీటి బుడ్డి తీసుకుని తిలోత్తమ ముఖం పైన చల్లి, విసరసాగింది. శత్రువుల కోలాహలం ఇప్పుడు దగ్గరలో వినిపిస్తున్నది. విమల ఆత్రుత కంఠంతో, "వస్తున్నారు! వస్తున్నారు! ఏం కానున్నది, యువరాజా? ఏం కానున్నది?" అన్నది.

జగత్సింహుడు కళ్ళు నిప్పులు రాల్చుతూ, "ఒంటరిగాణ్ణి ఏం చెయ్యగలను? నీ సఖిని రక్షించటానికి నా ప్రాణాలు ధారపోస్తాను," అన్నాడు. శత్రువుల కోలాహలమూ, కత్తి కటార్ల చప్పుళ్ళూ మరింత సమీపంగా వినిపిస్తున్నాయి. విమల గట్టిగా, "తిలోత్తమా, ఇలాటి సంకట సమయంలో స్పృహ తప్పి పడితివే, నిన్నెలా కాపాడేటట్టు?" అన్నది.

తిలోత్తమ కళ్ళు తెరిచింది.

"యువరాజా, తిలోత్తమకు స్పృహ వచ్చింది," అన్నది విమల.



"ఈ ఇంట్లో ఉండగా ఆమె నన్నూ కాపాడలేదు. తిలోత్తమ బయటికి రాగల స్థితిలో ఉన్నట్టయితే నేను మిమ్మల్ని బయటికి చేర్చగలిగి ఉందును. కాని ఆమెలో అంత శక్తి లేదు. శత్రువులు వచ్చి పడుతున్నారు. విమలా, నేను నా ప్రాణాలనైతే అర్పించగలను గాని, తిలోత్తమను రక్షించలేనందుకు విచారిస్తున్నాను," అన్నాడు జగత్సింహుడు.

విమల తిలోత్తమను చప్పున ఎత్తుకుని, "అయితే పదండి. నేను తిలోత్తమతో సహా మీ వెనకే వస్తాను," అన్నది. వాళ్ళు గది దాటి వచ్చే సరికల్లా పఠాను సైనికులు ఎదుర్కొని, "అల్లాహో అక్బర్!" అని కేకలు పెట్టారు. వారు జగత్సింహుడి పై లంఘించారు.

ఒక్క క్షణంలో జగత్సింహుడు తన కరవాలంతో ఒక సైనికుడి గుండెల్లో పొడిచాడు. ఆ సైనికుడు ఒక చావు కేక పెట్టి పడిపోయాడు. వాడి గుండెలో గుచ్చుకున్న కత్తిని తీసేలోపుగా మరొక సైనికుడు జగత్సింహుడి మెడకు గురిచేసి బల్లెం విసిరాడు. జగత్సింహుడు మెరుపులాటి వేగంతో దాన్ని పట్టుకుని ఆ సైనికుడి పైనే ఎంత బలంగా విసిరాడంటే, వాడా క్షణంలోనే ప్రాణాలు విడిచాడు. మిగిలిన ఇద్దరు పఠానులూ ఒకే సారి తమ కత్తులను అతడిపై విసిరారు.







రెప్పపాటులో అతను ఒక కత్తిని తన కరవాలంతో పట్టగలిగాడు. కాని రెండవది అతని భుజానికి తగిలి గాయం చేసింది. ఆ దెబ్బ తగులుతూనే అతను గాయపడిన సింహం లాగా అయిపోయి, తనను గాయపరిచిన వాణ్ణి ఒక్క వేటున చంపేశాడు. ఈలోపుగా దెబ్బతిన్న పఠానువాడొకడు ఎడమ చేత్తో ఒక బాకు విసిరాడు. అది జగతసింహుడి ఛాతీకి తగిలింది. అయితే అతని కది నాటి గుచ్చుకున్నట్టు కూడా లేదు. అతడా సైనికుడి నడుము పైన బలంగా తన్నే సరికి వా డంత దూరాన వెళ్ళి పడ్డాడు. జగతసింహుడు తన కత్తితో వాడి తల నరికెయ్య బోయేలోగా, "అల్లాహో అక్బర్!" అంటూ అనేక మంది పఠాను సైనికు లక్కడికి వచ్చారు.

ఇంక పోరాటమంటే చావేనని అతను తెలుసుకున్నాడు. అతని శరీరమంతా రక్తంతో తడిసి ఉన్నది.

తిలోత్తమ ఇంకా విమల చేతుల్లోనే స్పృహతప్పి ఉన్నది. విమల ఏడుస్తున్నది. జగతసింహుడి రక్తంతో ఆమె చీర కూడా తడిసిపోయింది.

గది అంతా పఠాను సైనికులతో నిండిపోయింది. జగతసింహుడు కత్తిని నేలపై మోపి, దీర్ఘంగా నిట్టూర్చి, కొద్దిగా తూల సాగాడు. ఒక్కసారిగా చాలా రక్తం పోవటం చేత అతనికి నీరసం వచ్చేసి, కళ్ళు మూసుకు పోతున్నాయి.

ఆ సమయంలో ఒక సైనికుడు, "ఒరే, తొత్తా! కత్తి కింద పడెయ్యరా, నీ ప్రాణాలు తియ్యం!" అన్నాడు.

ఈ మాటలు వింటూనే జగతసింహుడు, ఆరే నిప్పుపై ఆజ్యం పోసినట్టయిపోయి, ఒక్క కత్తి వేటుతో ఆ మాట అన్నవాడి తల నరికేశాడు. వాడి పైన పాదం పెట్టి, "రాజపుత్రుడు తన ప్రాణాల నెలా విసర్జిస్తాడో చూడండి!" అని గర్జించాడు.

మళ్ళీ సైనికులు కత్తులు ఝళిపించారు. తాను ఒంటరిగా పోరాటం సాగించటం సాధ్యం కాదని జగత్‌సింహుడు గ్రహించాడు. సాధ్యమైనంత మందిని చంపి ప్రాణాలు వదులుదామనుకున్నాడు. అతను స్పృహతప్పి పడిపోతూ ఈ మాటలు విన్నాడు:

"కబడ్దార్! రాజకుమారుడి ప్రాణాలు తీయవద్దు! సింహాన్ని మర్యాదగా ప్రాణాలతో పట్టుకుని బోనులో ఉంచవలసి ఉన్నది," ఆ మాట అన్నది ఉస్మాన్‌ఖాన్.

ఉస్మాన్‌ఖానూ, అతని సైనికు లొకరూ కలిసి జగత్‌సింహుణ్ణి ఎత్తి శయ్యపై పడుకోబెట్టారు. జగత్‌సింహుడి ప్రియురాలైన తిలోత్తమ శయ్య అతనికి మరణశయ్య అయే పరిస్థితి ఏర్పడింది.

ఉస్మాన్‌ఖానుకు గది లోపల స్త్రీ ఎవ్వరూ కనిపించలేదు. "ఆ స్త్రీ లేమయారు?" అని అతను అడిగాడు.

జరిగిన దేమిటంటే, రెండో దఫా కత్తుల యుద్ధం సాగగానే, విమల జరుగనున్నది గ్రహించి, తిలోత్తమతో సహా ఒక పెద్ద పెట్టె వెనక నక్కి దాక్కున్నది. ఆమె కంతకంటె ఉపాయం కనిపించలేదు.

ఉస్మాన్‌ఖాన్ వారిని కానక, తన సైనికులతో, "వాళ్ళెక్కడ ఉన్నారో వెతకండి. కోట అంతా గాలించండి. దాసిది మహా చురుకైనది. అది తప్పించుకు పోగలదు. అందువల్ల మనకు భయమున్నది. వీరేంద్ర సింహుడి కుమార్తె పై మాత్రం ఎలాటి అత్యాచారమూ జరగటానికి వీల్లేదు, జాగ్రత్త!" అన్నాడు.

ఆ సమయంలో ఒక సైనికుడు పెట్టె పైగా తొంగిచూసి, "వాళ్ళిక్కడే ఉన్నారు, హుజూర్!" అన్నాడు.

ఉస్మాన్‌ఖాన్ ముఖం వికసించింది. "బయటికి వచ్చేయండి. భయమేమీ లేదు," అన్నాడతను. —(ఇంకా ఉంది)






## 8

[మందారణ దుర్గం పఠాను సేనానాయకుడైన ఉస్మాన్‌ఖాన్ వశమయింది. దుర్గాధిపతి అయిన వీరేంద్రసింహుడు గాయపడి బందీగా చిక్కిపోయాడు. అతని కుమార్తె తిలోత్తమా, ఆమె పరిచారిక విమలా ఉస్మాన్‌ఖాన్ వశమయారు. పఠానుల దౌష్ట్యాన్ని అణచటానికి కంకణం కట్టుకుని ఉన్న జగత్‌సింహుడు—రాజా మానసింహుని కుమారుడు—తన ప్రియురాలైన తిలోత్తమను ఒక్కసారి కలుసుకునే ఉద్దేశంతో దుర్గంలో ప్రవేశించి, పఠానులతో తీవ్రంగా పోరాడి గాయపడి, కొనప్రాణంతో పఠానులకు దొరికిపోయాడు.]

జగత్‌సింహుడికి తిరిగి స్పృహ వచ్చింది. అతను కళ్ళు తెరిచి చూశాడు. అతను ఒక రమణీయమైన గదిలో శయ్యపైన పడుకుని ఉన్నాడు. అది చాలా విశాలమైన గది. కాని అత నెన్నడూ చూసి ఉండ లేదు. అది నిర్జనప్రదేశంలాగా నిశ్శబ్దంగానూ, ప్రశాంతంగానూ ఉన్నది. ఒక స్త్రీ అతని పాదాల దిక్కున కూర్చుని, అతనిపై సుగంధజలం చిలకుతూ, విసురుతున్నది. మరొకతె కొంత దూరంలో మాటా పలుకు లేకుండా నిశ్చలంగా నిలబడి ఉన్నది. జగత్‌సింహుడు పడుకుని ఉన్న దంతపు మంచంపైననే ఒక అందమైన, బలిష్ఠుడైన పఠాను ఉత్కృష్టమైన దుస్తులు ధరించి కూర్చుని, తాంబూలం నములుతూ, ఏదో పార్సీ గ్రంథం చదువుకుంటున్నాడు.

బంకించంద్ర ఛటోపాధ్యాయ



వారిలో ఏ ఒక్కరూ మాట్లాడటం లేదు. అంతా నిశ్శబ్దం.

యువరాజు చుట్టూ కలయజూసి పక్కకు ఒత్తిగిలడానికి ప్రయత్నించాడు, కాని అతనికి అది సాధ్యం కాలేదు, పైగా సర్వాంగాలలోనూ భరించరాని బాధ కలిగింది. ఒత్తిగిలడానికి అతను చేసిన ప్రయత్నం గమనించి కాళ్ళ దిక్కుగా కూర్చుని ఉన్న యువతి కోకిల కంఠంతో, "కదలకండి. ఎలా పడుకునివున్నారో, అలాగే ఉండిపొండి," అన్నది.

అతను హీనస్వరంతో, "నే నెక్కడ ఉన్నాను?" అని అడిగాడు.

"మీరు మాట్లాడకండి. మీరున్నది మంచి చోటు. విచారించక, విశ్రాంతి పొందండి."

"ఇప్పు డేవేళ అయి ఉంటుంది?"

"మీకింకా బాగా నెమ్మదిగా ఉండాలి, మాట్లాడితే హైరాన పెట్టుకుంటే త్వరగా కోలుకోలేరు. మీరు మౌనంగా ఉండనట్టు ఉంటే మే మందరమూ ఇక్కడి నుంచి వెళ్ళిపోతాం."

అతికష్టం మీద యువరాజు పలికాడు. "ఇంకొక్క మాట. నువ్వెవరు?" అన్నాడు.

"అరుణ."

అతను అరుణ కేసి దీర్ఘంగా చూశాడు. ఆమెను పూర్వ మెన్నడూ అతను చూసి ఉండినట్టు లేదు.

అరుణ వయస్సు సుమారు ఇరవై రెండుండవచ్చు. ఆమె అప్సరసలాగున్న దని. అతను అలాగే చూస్తూ ఉన్న జగతి సంఘటనకి తిలోత్తమ జ్ఞాపకం వచ్చింది. వెంటనే అతని గుండె ఆగిపోయినట్టయి పోయింది; రక్తం ఉడుకెత్తి పోయింది; అతని గాయాల నుంచి తిరిగి రక్తస్రావం ప్రారంభమయింది; అతనికి వెంటనే స్పృహ తప్పింది.



"చాలా పొద్దు పోయింది. పద, నిన్ను అంతదాకా దిగబెడతాను," అన్నాడు ఉస్మాన్‌ఖాన్.

అయిషా అక్కడి దాసీలకు చెప్పవలసిం దంతా చెప్పి, రాజకుమారుణ్ణి వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉండమని హెచ్చరించి, తన తల్లి వద్దకు బయలుదేరింది.

దారిలో ఉస్మాన్, "ఇవాళ నువ్వు బేగం సాహెబా దగ్గిరే ఉంటావా?" అని అడిగాడు.

"లేదు. తిరిగి రాజకుమారుడి వద్దకు వచ్చేస్తాను." అన్నది అయిషా.

"అయిషా, నీ మంచితనానికి మితి ఉన్నట్టు కనబడదు. ఈ గర్వ శత్రువుకు నువ్వు చేసే సేవ తోబుట్టిన చెల్లెలు కూడా చెయ్యదు. నువ్వు శత్రువుకి ప్రాణదానం చేస్తున్నావు."

అయిషా చిరునవ్వుతో, "ఉస్మాన్, నాది స్త్రీ స్వభావం. బాధితులకు సేవ చెయ్యటం తప్ప నాకు గొప్ప ధర్మంలేదు. కాని నీ దయ మాత్రం తక్కువైనదా? నీ ప్రజల శత్రువును బతికించాలని నువ్వెందుకు చూస్తున్నావు?" అన్నది.

"నువ్వు ఉదారహృదయం గల దానివి గనక నేనూ అంతేననుకుంటున్నావు. కాని అసలు సంగతి వేరు. నా అభిప్రాయ మేమంటే, జగతసింహుడు మన చేత చిక్కి ఉండగా మానసింహుడి జుట్టు మన చేతిలో ఉన్నట్టే; మనకు లాభించే విధంగా అతను మనతో సంధి చేసుకో గలుగుతాం. అలా జరగని పక్షంలో కూడా, జగతసింహుణ్ణి తనకు అప్పగించినందుకు మానసింహుడు పుష్కలంగా ధనమిస్తాడు. అందుచేత జగతసింహుడి ప్రాణాలు కాపాడటం మనకు లాభదాయకం. ఈ విషయంలో నేను ఉపేక్ష వహించలేను." అన్నాడు ఉస్మాన్.

"ఉస్మాన్, అందరూ నీలాగా స్వార్థంతో కూడిన దూరదృష్టి గలవారైతే ఇక ధర్మంతో పనే ఉండదు." అన్నది అయిషా.



"వీరేంద్రసింహు డేమయ్యాడు?"

"ఆయన బందీగా కారాగృహంలో ఉన్నాడు. ఇవాళే ఆయన విచారణ."

జగత్సింహుడి ముఖం వాడిపోయింది. "అంటా — మిగిలిన వాళ్ళ మాటేమిటి?" అని అతనడిగాడు.

"అన్ని విషయాలూ నాకు తెలీవు," అన్నది అయేషా, కలవరపడుతూ.

రాజకుమారుడు లేచి తనలో తాను గొణగసాగాడు. ఆ గొణుగుడులో "తిలోత్తమ" అనే మాటను అయేషా పదే పదే విన్నది. ఆమె లేచి వెళ్ళి అతనికి మందు తెచ్చి ఇచ్చింది.



"నేను చావు బతుకుల మధ్య ఉండి ఒక కల గన్నాను. ఎవరో దేవకన్య నా తల వైపున కూర్చుని నాకు పరిచర్యలు చేసింది. అది నిజా, లేక తిలోత్తమా?" అని జగత్సింహుడు అడిగాడు.

"మీకు కలలో కనిపించినది తిలోత్తమే అయి ఉండవచ్చు," అన్నది అయేషా.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు కతలూఖాన్ దర్బారు తీర్చాడు. ఆ రోజే వీరేంద్రుడికి శిక్ష పడుతుంది. కొందరు సైనికులు వీరేంద్రసింహుణ్ణి సంకెళ్ళతో సహా దర్బారులోకి తీసుకువచ్చి, కతలూఖాన్‌కు ఎదురుగా నిలబెట్టారు. వీరేంద్రసింహుడి ముఖం నిప్పుల కుంపటిలాగా ఉన్నది. ఆయనలో భయ చిహ్నాలేవీ లేవు.

కతలూఖాన్ శాంతంగా, "వీరేంద్రసింహా, ఈ దర్బారులో నీ అపరాధాలను గురించి విచారణ జరగనున్నది. ముందు ఒక మాట చెప్పు. నీవు మాకు విరుద్ధమైన చర్య ఎందుకు చేశావు?" అని అడిగాడు.

"నేను ఏది విరుద్ధంగా చేసిన చర్య లేదో అది ముందు నీవే చెప్పు," అన్నాడు వీరేంద్రసింహుడు కోపోద్రేకంతో.

"మర్యాదగా మాట్లాడు!" అని ఒక సభికుడు గద్దించాడు.



"నా ఆజ్ఞానుసారం నువ్వు ధనాన్ని, సేనలూ ఎందుకు పంపలేదు?" అని కతలూ ఖాన్ అడిగాడు.

"నువ్వు రాజ్యద్రోహివి! తిరుగుబాటువు! నీకు నేను ధనం ఎందుకు పంపాలి? సేన ఎందుకు పంపాలి?" అని వీరేంద్రసింహుడు నిర్భయంగా ప్రశ్నించాడు.

ఆయన చేజేతులా తన మరణాన్ని తెచ్చి పెట్టుకుంటున్నట్టు సభికులకు స్పష్టమయింది.

కతలూఖాన్ క్రోధావేశంతో కంపించాడు. అయినా అతను తన క్రోధాన్ని నిగ్రహించుకుంటూ, "మా పరిపాలనలో ఉన్నవాడివి శత్రువర్గంతో ఎందుకు చేరిపోయావు?" అని అడిగాడు.

"నీ అధికారం ఎక్కడిది?" అని వీరేంద్రసింహుడు గట్టిగా అడిగాడు. కతలూఖాన్ కోపం అనుమతించింది.

"విశ్వాసఘాతకుడా, విను. శత్రువుగానే నీ పనులకు తగిన ఫలితం పొందుతున్నావు. నీ కింకా ప్రాణాలు దక్కించుకునే అవకాశం ఉన్నది. కాని వెర్రిగా నీవా అవకాశాన్ని నాశనం చేసుకుంటున్నావు." అన్నాడు కతలూఖాన్.

వీరేంద్రసింహుడు పెద్దపెట్టున నవ్వి, "కతలూఖాన్, నేను శృంఖలాబద్ధుణ్ణయి



నీ ఎదటికి వచ్చినది నీ దయాదాక్షిణ్యాలను నమ్ముకుని కాదు. నీ వంటి శత్రువు యొక్క దయాదాక్షిణ్యాల ఆధారంతో ప్రాణాలు దక్కించుకునే వారు జీవించి ఉండవలసిన అవసరమేమున్నది? నేను నిన్ను ఆశీర్వదించి నా ప్రాణాలను త్యజించి ఉండును. కాని నీవు నా వంశానికి చిచ్చుపెట్టావు; వారి ప్రాణం కన్న ఎక్కువైన..." అని అంటుండగా ఆయన కంఠం రుద్ధమై మాట పెగలలేదు. కళ్ళ వెంట నీటిధారలు కారసాగాయి. ఆయన తల వంచి రోదించాడు.

కరటఖాన్ క్రూరుడు, కఠినుడు, ఇతరుల దుఃఖం చూసి నిశ్చింతగా ఉండగల వాడు. దర్పం గల శత్రువు అలాటి దుఃఖంలో ఉండటం చూసి అతని ముఖాన మందహాసం తాండవించింది. అతను వీరేంద్రసింహుడితో, "నన్ను నీవేమీ అడుగదలచటం లేదా? బాగా ఆలోచించుకుని మాట్లాడు! నీకు కాలం ఆసన్నమవుతున్నది," అన్నాడు.

వీరేంద్రసింహుడు, "నిన్ను మరేమీ కోరను. నన్ను సాధ్యమైనంత శీఘ్రంగా మృత్యువు పాలపడవెయ్యి." అన్నాడు తల ఎత్తి.

"అలాగే...ఇంకేమన్నా ఉందా?"

"లేదు. ఈ జన్మ కింకేమీ లేదు."

"చచ్చే ముందు నీ కుమార్తెను ఒకసారి చూడవా?"

వీరేంద్రసింహుడి కళ్ళు మళ్ళీ అశ్రుపూరితాలయాయి. ఆ కళ్ళ నుంచి అదే సమయంలో నిప్పురవ్వలు కూడా వెలువడ్డాయి. "ఒకవేళ నా కుమార్తె నీ యింట ప్రాణాలతో ఉన్నపక్షంలో నా కామెను చూడాలన్న కోరిక లేదు. ఒకవేళ ఆమె చచ్చిపోయి ఉంటే తీసుకురా! ఆమెను నా ఒడిలో పెట్టుకుని మరణిస్తాను." అన్నా డాయన. —(ఇంకా వుంది)






## 9

[మందారణ దుర్గం పఠానుల వశమైనప్పుడు యుద్ధం చేస్తూ తీవ్రంగా గాయపడిన యువరాజు జగత్‌సింహుణ్ణి పఠాను సేనానాయకుడైన ఉస్మాన్ ఖాన్ పఠానులకు నవాబైన కతలూ ఖాన్ రాజభవనానికి చేర్చి, అతనికి చికిత్స చేయించాడు. నవాబు కుమార్తె అయిన అయెషా అతనికి శ్రద్ధగా సేవ చేసి ప్రాణం నిలబడేటట్టు చేసింది. అతను కోలుకున్న నాటికి కతలూ ఖాన్, వీరేంద్రసింహుణ్ణి విచారించి, మరణ దండన విధించాడు.]

నవాబు సైగ చేయగానే సిపాయీలు వీరేంద్ర సింహుణ్ణి వధ్య భూమికి తీసుకుపోయారు. అక్కడికి వెళ్ళే దారిలో ఒక ముసల్మాను వాడు వీరేంద్రసింహుడి చెవిలో ఏదో చెప్పాడు. కాని అది అతనికి అర్థం కాలేదు. అప్పుడా ముసల్మాను వా డాయన చేతిలో ఒక చీటీ ఉంచాడు. వీరేంద్రసింహుడు ధ్యాస ఎక్కడో ఉంచి చీటి విప్పి చూశాడు. అది విమల రాసిన ఉత్తరం. వెంటనే అతను ఆగ్రహావేశంతో దాన్ని నలిపి, దూరంగా విసిరేశాడు.

చీటి తెచ్చినవాడు దాన్ని ఏరి తీసుకుని, అక్కడి సిపాయీలతో, "నేను తిరిగి వచ్చేదాకా ఆగండి," అన్నాడు.

"చిత్తం," అన్నారు సిపాయీలు.

ఎందుకంటే ఆ చీటీ తెచ్చిన ముసల్మాను వాడు ఉస్మాన్ ఖానే; సిపాయీలు అతని ఆజ్ఞను పాలించి తీరాలి.

బంకించంద్ర చట్టోపాధ్యాయ



ఉస్మాన్ ఖాన్ ఆ ఉత్తరం తీసుకుని అంతఃపుర ప్రాంగణం ప్రవేశించాడు. ఒక చెట్టు కింద విమల మేలిముసుగు కప్పుకుని నిలబడి ఉన్నది. అత నామెను సమీపించి, చుట్టూ ఒకసారి కలయ చూసి, ఆమెకు జరిగిన దంతా చెప్పాడు.

"మీకు చాలా శ్రమ ఇస్తున్నాను. అయితే మీ మూలానే మాకీ దుర్దశ సంప్రాప్త మయింది. మీరు నా పని నెరవేర్చక తప్పదు," అన్నది విమల.

"అమ్మా, మీ కోరుతున్నది ఎంత ప్రమాదంతో కూడిన విషయమో మీకు తెలీదు. ఈ సంగతి ఏ విధంగా నైనా కతలూ ఖానకు తెలిసిన పక్షంలో నాకు మరణ శిక్ష పడినా పడవచ్చు," అన్నాడు ఉస్మాన్ ఖాన్.

"కతలూ ఖానా? ఎందుకు నాతో అబద్ధాలాడతావు? నీ వంటి పై చెయ్యి వెయ్యటానికి కతలూ ఖానకు గుండెలు ఉన్నాయా?" అన్నది విమల.

"కతలూ ఖాన్ సంగతి మీకేమీ తెలీదు. సరే, ఏమయితే అదవుతుంది. పదండి, మిమ్మల్ని వధ్యభూమి దగ్గిరికి చేరుస్తాను," అన్నాడు ఉస్మాన్ ఖాన్.

ఇద్దరూ వధ్యభూమి చేరుకున్నారు. ఉస్మాన్ ఖాన్ వెనకనే నడుస్తూ విమల వీరేంద్రసింహుడి వద్దకు వచ్చింది. అప్పుడు వీరేంద్రసింహుడు భిక్షుక వేషంలో ఉన్న అభిరామస్వామితో మాట్లాడుతున్నాడు: "గురుదేవా, ఇక నాకు సెలవిప్పించండి. ఇంక నేను మీకు చెప్పేదేమున్నది? ఈ జన్మలో నాకు ఏమీ అవసరం లేదు. ఎందుకు? ఎవరి కోసం?"

అభిరామస్వామి మేలిముసుగు ధరించిన విమల కేసి సైగ చేశాడు. వీరేంద్రసింహు డామె కేసి చూడగానే, విమల తన మేలిముసుగు తీసేసి, దూరంగా విసిరి, వీరేంద్రసింహుడి కాళ్ళ పైన పడిపోయింది.



వీరేంద్రసింహుడు, "విమలా!" అన్నాడు ఆశ్చర్యంతో.

విమల ఉన్మాదిని లాగా అయిపోయి, గొంతు చించుకుంటూ, "స్వామీ! ప్రభూ! ప్రాణేశ్వరా! ఈ నాడు లోకానికి నిజం చెప్పేస్తాను. నన్నెవరు రక్షిస్తారు? ప్రాణనాథా! నా ప్రాణమా! ఇవాళ మీరెక్కడికి పోనున్నారు? మా భారం ఎవరి పైన వేసి వెళుతున్నారు?" అన్నది.



వీరేంద్రసింహుడి కళ్ళ నుంచి అశ్రువులు జలజలా రాలాయి. "విమలా! ప్రియా! ఈ సమయంలో నా కెందుకు కన్నీరు తెప్పిస్తావు? శత్రువులు చూస్తే, నేను చావుకు వెరిచి ఏడుస్తున్నానను కుంటారు," అన్నాడాయన.

విమల మాట్లాడ లేదు.

"విమలా, నేను పోతున్నాను. మీరు కూడా రండి," అన్నాడు వీరేంద్రసింహుడు.

విమల అతని చెవిలో రహస్యంగా, "వస్తాను. ముందీ సైతాను పై పగ తీర్చుకుని మరీ వస్తాను," అన్నది.

వీరేంద్రసింహుడి ముఖం విప్పారింది. "నీకు చాతనవుతుందా?" అన్నాడు.

విమల తన కుడి చెయ్యి చూపుతూ, "ఇదే చెయ్యి! దీని నుంచి అలంకారాలు తీసేసి, ఈ చేతిలోనే లోహపు అలంకారాలు ధరించి, దీని రక్త దాహం తీరుస్తాను," అంటూ తన చేతి కంకణాలు తీసి దూరంగా పారేసింది.

"నీ నిశ్చయం నెరవేరుగాక! జగదీశ్వరుడు నీ కోరిక తీర్చుగాక!" అన్నాడు వీరేంద్రసింహుడు. అంతలో తలారివాడతన్ని తొందర చేశాడు.

"ఇక నీవు వెళ్ళు," అన్నాడు వీరేంద్రసింహుడు విమలతో.

"వెళ్ళను. నా వైధవ్యప్రాప్తిని కళ్ళారా చూస్తాను. మీ రక్తమే నాకు మోక్షదర్శకం కావాలి," అన్నది విమల.





తలారి కత్తి పైకెత్తటం ఆమె చూసింది. అంతలోనే ఆమె కళ్ళు వాటంతటవే మూతపడిపోయాయి. తిరిగి ఆమె కళ్ళు తెరిచి చూసేసరికి వీరేంద్రసింహుడి తల శరీరం నుంచి వేరైపోయి నేలపై దొర్లుతున్నది.

విమల శిలాప్రతిమలాగా, కొంచమైనా చలనం లేకుండా, కంట ఏమాత్రం తడి లేకుండా, తన భర్తయొక్క శిరస్సును తదేక దృష్టితో చూస్తూ నిలబడిపోయింది.

* * *

విధివిలాసం విచిత్రమైనది. తిలోత్తమా, విమలా కూడా అప్పుడు కతలూఖాన్ ఉంపుడుగత్తె లుండే భవనంలో ఉంటున్నారు. ఒక కోటగాని, గ్రామంగాని తనకు లొంగిపోయినప్పుడు అక్కడి అందగత్తె లెవరైనా చిక్కితే వారిని నవాబు సేవకు ప్రత్యేకించాలని నియమం. అందుచేత తిలోత్తమా, విమలా నవాబు విలాస భవనానికి చేర్చబడ్డారు. అయితే, ఇద్దరూ చెరొక చోట ఉండిపోయారు. తిలోత్తమ గతి ఏమైనదీ కూడా విమలకు తెలియరాలేదు. విమల అయితే తన భవిష్యత్తు తానే నిర్ణయించుకున్నది. కాని తిలోత్తమను కనిపెట్టి ఉండేటందుకు విమల తప్ప మరెవరూ లేరు. అందుచేత ఆమె ఒంటరిదైపోయింది.

విమల ఉస్మాన్‌ఖాన్ రాక కెదురు చూస్తూ కూర్చుని ఉన్నది.

ఉస్మాన్‌ఖాన్ పఠానులలో మణిపూస లాటివాడు. యుద్ధం అతని వృత్తి, అతని ధర్మం. యుద్ధంలో అతను ఎలాటి పని చెయ్యటానికీ సంకోచించడు. కాని యుద్ధంలో విజయం చేకూరినాక ఓడిపోయిన వారిపై అత్యాచారాలు చెయ్యటమనేది అతని కేమాత్రమూ గిట్టదు.

విమలా తిలోత్తమల పై కతలూఖాన్ పాపిష్టి కళ్ళు పడకపోయినట్టయితే, ఉస్మాన్‌ఖాన్ దయచేత వారిద్దరూ స్వతంత్రులై ఉండేవారు. అతని దయచేతనే విమల

వీరేంద్రసింహుణ్ణి ఆఖరు క్షణంలో కలుసుకో గలిగింది.

ఉస్మాన్‌ఖాన్ కతలూఖానుకు అన్న కొడుకు. అందుచేత అతను రాజమహలు లోకి చిత్తం వచ్చినట్టు వచ్చి పోవటానికి అధికారం ఉన్నది. కాని నవాబు విలాస గృహంలోకి వెళ్ళే హక్కు ఎవరికీ లేదు; ఉస్మానుకు కూడా లేదు.

విమల ఎలాగో ఒక దాసి ద్వారా ఉస్మాన్‌కొక చీటీ పంపింది. దాన్ని చదువుకుని ఉస్మాన్ దాసితో, "నే నక్కడికి రావటం మా ఇద్దరికీ ముప్పు. అందుచేత ఆమెనే ఇక్కడికి రమ్మను," అన్నాడు.

దాసి ఈ మాట తనతో చెప్పగా విమల, "నే నక్కడికెలా వెళ్ళగలను?" అన్నది.

"దానికి తగిన ఏర్పాటు ఆయనే చేస్తా నన్నాడు," అన్నది దాసి.

ఆ సాయంకాలం అయుపా దాసి ఒకతె వచ్చి అంతఃపుర రక్షకులైన కొజ్జాలతో ఏదో మాట్లాడింది. తరవాత ఆమె వచ్చి విమలను తన వెంట పిలుచుకుపోయింది.

"నా వల్ల ఇంకేమైనా సహాయం కావలసి ఉన్నదా?" అని ఉస్మాన్ విమల నడిగాడు.

"పెద్ద సహాయమేమీ అవసరంలేదు. యువరాజు జగతసింహుడు జీవించి



ఉన్నాడా? ఆ సంగతి చెప్పండి చాలు," అన్నది విమల.

"జీవించే ఉన్నాడు."

"స్వతంత్రుడా? ఖైదీయా?"

"నిశ్చయంగా ఖైదీయే. కాని ప్రస్తుతం జైలులో మాత్రం లేడు. అతనికి చికిత్స జరుగుతున్నది. మంచానపడి ఉన్నాడు. కతలూఖానుకు తెలియకుండా నే నతన్ని నా భవనంలోనే ఉంచాను. చికిత్సా, ఉపచారాలూ చక్కగా జరుగుతున్నాయి."

"అభాగినులమైన మా మూలానే, పాపం అతనికీ దుర్దశ సంభవించింది. కాని విధి నిర్ణయాన్ని ఎలా తప్పించటం? నా దొక



చిన్న మనిషి. ఈ ఉత్తరాన్ని అతనికి చేర్చ గలరా? ఇంతకు మించి నేను మిమ్మల్ని ఏమీ కోరబోను."

విమల ఇచ్చిన ఉత్తరాన్ని ఉస్మాన్ ఆమెకే తిరిగి ఇస్తూ, "ఇది నేను చెయ్యరాని పని. రాజకుమారుడు ఏనాటి స్థితిలో ఉన్నప్పటికీ అతను ఖైదీగానే పరిగణించబడతాడు. నేను ముందుగా చదివి, అందులో హాని ఏమీ లేదనుకున్న మీదటనే ఏ ఉత్తరాలైనా ఖైదీలకు చేరుతాయి," అన్నాడు.

"మీకు హానికరంగా ఉండే అంశమేమీ ఈ ఉత్తరంలో లేదు. అందుచేత ఇదేమీ చేయరాని పని కాదు. కాకపోయినా మీరు మీకే ప్రభువు? నాకున్నా మీరే ప్రభువు," అన్నది విమల.

"ఇతర విషయాలలో అయితే నేను నవాబు ఆజ్ఞలకు విరుద్ధంగా అప్పుడప్పుడు వ్యవహరిస్తూనే ఉంటాను, కాని ఈ విషయంలో అదెంత మాత్రమూ సాధ్యం కాదు," అన్నాడు ఉస్మాన్‌ఖాన్.

"అయితే మీరా ఉత్తరాన్ని చదువుకొని మరీ పంపండి," అన్నది విమల.

ఉస్మాన్‌ఖాన్ దాన్ని ఈ విధంగా చదువుకున్నాడు:

"యువరాజా, నేను తమను ఒకనాడు నన్ను గురించి తెలుపుకుంటానని లోగడ మాట ఇచ్చి ఉన్నాను. ఇప్పు డా రోజు వచ్చింది. మా తిలోత్తమ అందల సింహాసనం ఆరోహించిన సమయంలో నా సంగతి చెప్పదామనుకున్నాను. అప్పుడా ఆశ కాస్తా అడుగంటి పోయింది. మరి కొన్ని రోజుల అనంతరం భూమి మీద తిలోత్తమ అనే వ్యక్తి, విమల అనే వ్యక్తి లేరన్న సమాచారం కూడా మీకు చేరితే చేరవచ్చు. అందుచేత ఇప్పుడే మీకీ లేఖ వ్రాస్తున్నాను. నేను పాపిని. చెయ్యరాని పనులెన్నో నా జీవితంలో అనేకం చేశాను. అందుచేత

నాకు ఈ లోకంలో కీర్తి ప్రతిష్ఠలంటూ ఏమీవుండవు.

"రాజకుమారా, ఈ జన్మలోనే నేను మీ పరిజనంలో ఒకదాన్ని కాగలనని ఒకప్పుడు భావించాను. కాని నావంటి అభాగినుల సౌభాగ్యం అగ్నిహోత్రంలాగా, మా మేలు కోరి మా సమీపానికి వచ్చిన వారిని కూడా దహించివేయగలదు. ఈ దాసి లోక ప్రార్థన. ప్రజలు నన్ను దాసి వేషం వేసుకున్న కులట అనీ, వేశ్య అనీ అన్నప్పుడు, 'విమల నీచ జాతిది, అభాగిని, నోటి దురుసు వల్ల అపరాధాలు చేసినది. అంతేగాని ఆమె కులట కాదు, జారిణి కాదు,' అని చెప్పండి. ఈ నాడు స్వర్గస్థులైపోయినవారు విమల అదృష్టం కొద్దీ ఆమెను శాస్త్రోక్తంగా వివాహం చేసుకున్నారు. విమల ఒక్క క్షణం పాటు కూడా ఆయన పట్ల అతిచరించలేదు.

"అయితే నేను వీరేంద్రసింహుడి ఇంట ఏ కారణంచేత దాసిగా మసులుకుంటూ వచ్చానో ఆ వృత్తాంతం కూడా సంగ్రహంగా చెబుతాను, వినండి.

"మందారపు దుర్గానికి సమీపంలోని ఒక గ్రామంలో జయధరసింహుడనే ఆయన పరిచారికలలో భర్తకు దూరమైన అపురూప



సుందరి ఒకతె ఉండేది. ఆమె భర్త సైనికుడు, ఎప్పుడూ దూరప్రాంతంలో ఉండేవాడు. శశిశేఖరుడనే బ్రాహ్మణ యువకుడి కన్ను ఆమె పైన పడింది. ఆమె ఆ యువకుడి వలలో పడి, కొద్ది రోజులకు గర్భవతి అయింది. ఈ సంగతి తెలిసి శశిశేఖరుణ్ణి అతడి తండ్రి ఇల్లు వెళ్ళగొట్టాడు. శశిశేఖరుడు కాశీ వెళ్ళి అక్కడ విద్యాభ్యాసం చేయసాగాడు. అక్కడ కూడా ఆయన స్వభావం మారలేదు. కాశీలో ఒక శూద్ర స్త్రీ ఆయన వల్ల గర్భవతి అయింది. ఆ సంగతి ఏమని వివరించి చెప్పను. ఆ శూద్ర స్త్రీ గర్భాన జనించిన దాన్ని నేనే!

"కొంత కాలమయాక శశిశేఖరుడు మా అమ్మను విడిచిపెట్టేసి ఎటో వెళ్ళిపోయాడు. మా అమ్మ అతి కష్టంతో నన్ను పెంచుతూ వచ్చింది. నే నారేళ్ళ దాన్నయి ఉండగా, చలి రోజుల్లో, ఒక పఠాను తన భార్యతోనూ, కొడుకుతోనూ కాశీ మీదుగా ఢిల్లీ వెళుతూ, కాశీలో హిందువు లెవ్వరూ ఆ రాత్రి బస ఇవ్వనందున, మా గుడిసెలో ఆ రాత్రికి ఆశ్రయం అర్థించాడు. మా అమ్మ సరే నన్నది. ఆ కాలంలో కాశీలో పిల్లల దొంగతనాలు విరివిగా జరిగేవిట. ఆ రాత్రి ఒక దొంగ మా యింటికి కన్నం వేసి లోపలికి వచ్చి, పఠాను కొడుకును సంగ్రహించాడట. ఆ సమయంలో నేను అంతా చూసి గట్టిగా కేకలు పెట్టానట. పఠాను భార్య లేచి చూస్తే పక్కలో పిల్లవాడు లేడు. దొంగ పిల్లవాడితోసహా మంచం కింద దాక్కున్నాడు. పఠాను వాణ్ణి జుట్టు పట్టుకుని బయటికి ఈడ్చి, వాడి చేతిలోని పిల్లవాణ్ణి లాగేసుకుని, దొంగ చెవి ఒకటి కోసేసి, వాణ్ణి పోనిచ్చాడట. ఇదంతా నాకు జ్ఞాపకం లేదు; మా అమ్మ చెప్పింది."

అంత వరకు విని ఉస్మాన్ ఖాన్ కొంచెం సేపు ఏదో ఆలోచించి, విమలతో, "నీ కప్పుడు మరొక పేరేదైనా ఉండేదా?" అని అడిగాడు.

"ఉండేది. కాని అది ముసల్మానుల పేరు కావటంచేత మా నాన్న దాన్ని తీసేసి విమల అనే పేరు పెట్టాడు." అన్నది విమల.

"ముందుండిన పేరేమిటి? మాహరూయేనా?"

విమల ఆశ్చర్యపడి, "మీ కెలా తెలిసింది?" అన్నది.

"ఆ ఉత్తరంలో నీవు చెప్పే పఠాను కొడుకును నేనే!" అన్నాడు ఉస్మాన్ ఖాన్.

విమల నిర్ఘాంతపోయింది.

—(ఇంకా వుంది)






## 10

[దుర్గేశుడైన వీరేంద్రసింహుడికి నవాబు కతలూ ఖాన్ శిరచ్ఛేదం చేయించాడు. ఉస్మాన్ ఖాన్ సహాయంతో విమల ఆ సమయాన వధ్య భూమికి వెళ్ళి చావనున్న తన భర్తకు పగ తీర్చుకుంటానని మాట ఇవ్వ గలిగింది. యువరాజు జగత్సింహుడు ఖైదీగా ఉన్నట్టు తెలిసి, విమల తన చరిత్ర అంతా అతనికి తెలుపుతూ ఒక ఉత్తరం రాసింది. దాన్ని ఉస్మాన్ ఖాన్ చదవసాగాడు. అది చదువుతుంటే అతనికి ఒక వింత సంగతి తెలియ వచ్చింది—అతను పసివాడై ఉండగా విమల అతన్ని దొంగవారి నుంచి కాపాడింది!]

ఉస్మాన్ తిరిగి ఉత్తరం చదవటానికి ఉపక్రమించాడు. విమల అంతా ఇలా రాసింది: "మర్నాడు పఠాను తన దారిన వెళ్ళిపోతూ, మా అమ్మతో, 'మీ అమ్మాయి నాకు చేసిన ఉపకారానికి ఇప్పుడేమీ ప్రత్యుపకారం చెయ్యలేను. కాని మీ కేమైనా కావలిస్తే, ఢిల్లీ వెళ్ళాక పంప గలను,' అన్నాడు. మా అమ్మ తనకు ద్రవ్యమేమీ అవసరం లేదని, నా తండ్రి జాడ తెలిస్తే కబురు చెయ్యమని అన్నది. పఠాను ఢిల్లీ వెళ్ళి ఎంతో శ్రమపడి వాకబు చేశాడు గాని, మా తండ్రి జాడ తెలియనే లేదు. పధ్నాలుగు సంవత్సరాల అనంతరం నా తండ్రి ఢిల్లీ లోనే ఉంటున్నాడని, ఆయన అభిరామస్వామి అనే పేరు పెట్టుకున్నాడని తెలియ వచ్చింది.

బంకించంద్ర చట్టోపాధ్యాయ



"అప్పటికి మా అమ్మ పోనే పోయింది. నా తండ్రి జాడ తెలిశాక నాకు కాశీలో ఒక్క క్షణం ఉండ బుద్ధి కాలేదు. నాకు ప్రపంచంలో మా తండ్రి తప్ప మరెవరూ లేరు. అందుచేత నేను ఒంటరిగా బయలు దేరి ఢిల్లీ వెళ్ళాను. మొదట ఆయన నన్ను చూసి చాలా ఆశ్చర్య పడ్డారు. నేను ఏడుస్తూ నిలబడ్డాను. చివరకు ఆయన నన్ను తన సేవలో ఉంచుకొనటానికి సమ్మతించారు. మాహురూ అన్న పేరు బాగాలేదని ఆయన నా పేరు విమల అని మార్చారు. నేను ఆయనకు తృప్తికరంగా సేవ చెయ్యటంలో చాలా ఆనందం పొందాను.

నా తండ్రి నన్ను కామరాను చాలా దయగా చూసేవాడు.

"మందారపు గ్రామంలో ఒక సైనికుడి భార్య నా తండ్రి కారణంగా గర్భవతి అయిందని ముందు చెప్పానే. ఆమెకు కూడా ఒక ఆడపిల్ల కలిగింది. ఆ తరవాత కొద్ది కాలానికే ఆమె భర్త అయిన సైనికుడు మరణించాడు. నా తల్లి లాగే ఆమె కూడా శరీర శ్రమతో పొట్టపోసుకుంటూ తన పిల్లను పోషించింది. ఆ విధవరాలి కూతురు పెరిగి పెద్దదై, అపురూప సుందరి అని పెంచుకుని, చివరకు తిలోత్తమకు తల్లి అయింది.

"తిలోత్తమ తల్లి గర్భంలో ఉండగానే నా పెళ్ళి గురించి మొట్టమొదటి సారిగా ప్రస్తావన వచ్చింది. వీరేంద్రసింహుడు నా తండ్రి శిష్యుడుగా మెసులుతూ ఆశ్రమానికి వచ్చాడు. నా తండ్రి ఆయనతో, 'నేను విమలను విడిచి ఉండలేను. నువ్వామెను పెళ్ళాడితే నేను మీ ఇద్దరి వెంటా ఉంటాను,' అన్నారు. వీరేంద్రసింహుడు రోషంతో, శూద్ర కన్యను ఎలా పెళ్ళాడతానని అడిగాడు. జార స్త్రీకి పుట్టిన దాన్ని పెళ్ళాడావు కాదా అని నా తండ్రి ఎదురడిగాడు. తాను పెళ్ళాడిన మనిషి తల్లి జార స్త్రీ అని తనకు పెళ్ళి సమయంలో





తెలియుందనీ, ఏమైనా ఆమె క్షత్రియ స్త్రీ కాదనీ వీరేంద్రసింహుడు తనను తాను సమర్థించుకున్నాడు. ఆయన నన్ను పెళ్ళాడ నిరాకరించారని నా తండ్రి ఆయనను ఆశ్రమానికి రావద్దనీ, వస్తే నాకు ఇబ్బందిగా ఉంటుందనీ, చూడ దలిచినప్పుడు తానే దుర్గానికి వస్తాననీ, వీరేంద్రసింహుడితో అన్నాడు. వీరేంద్రసింహుడు కొన్నాళ్ళు రావటం మానేసరికి నేను చాలా బాధపడ్డాను.

"నా సంగతి గ్రహించి నా తండ్రి, తాను సన్యాసం స్వీకరించబోతున్నాననీ, తనది ఇక ముందు సంచార జీవితంగా ఉండబోతుందనీ, మానసింహమహారాజు పెళ్ళాడిన కొత్త రాణికి నన్ను పరిచారికగా ఉంచటానికి ఏర్పాటు చేశాననీ అన్నాడు. యువరాజా, నేను మీ ప్రాంగణంలో ఒక అంతఃపురాంగన నయాను. నే నక్కడ చాలా రోజు లున్నాను గాని నీకు తెలీదు. నీవు మీ తల్లి దగ్గిర ఉండేవాడవు. నేను జోధ్పూరు రాజకుమారి ఊర్మిళాదేవి వద్ద ఉండేదాన్ని. ఆమె నన్ను ప్రాణం కంటె ఎక్కువగా చూసుకునేది. ఆమె దయ వల్ల నేను చాలా కళలు నేర్చుకున్నాను—శిల్పమూ, సంగీతమూ, నృత్యమూ. నన్నామె మహారాజు దగ్గిర కూడా ఎంతో ఎన్నిక చేసింది. ఆ మహారాజు నా పాట విని ఎంతో ఆనందించేవారు, నన్నొక ప్రత్యేకతతో చూసేవారు. నా తండ్రి అంటే కూడా ఆయనకు చాలా భక్తి. నా ఒక్కటే విచారం—నేను ప్రేమించిన మనిషికి దూరమయాను.

"నీకు అస్మాని జ్ఞాపకం ఉండవచ్చు. మా ఇద్దరికీ చాలా స్నేహం. తండ్రితో పాటు ఢిల్లీ వచ్చి ఉంటున్న వీరేంద్రసింహుడి వద్దకు అస్మానిని పంపాను. ఆమె ఆయనను కలుసుకుని నా సమాచారం చెప్పింది. మా ఇద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి. మా మధ్య ప్రేమ





పెరుగుతూ వచ్చింది. అలా మూడేళ్ళు గడిచాయి.

"అంతలో వీరేంద్రసింహుడు ఒక ఉపద్రవమైన పని చేశాడు. ఆయన పళ్ళు మోసేవాడి లాగా నటిస్తూ అన్నాని వెంట అంతఃపురంలోకి వచ్చి, నేను ఒంటరిగా విశ్రమించే చోట దాక్కున్నాడు. ఒక రాత్రి వేళ మానసింహమహారాజుగారే మేమున్న చోటికి వచ్చారు. వీరేంద్రసింహుణ్ణి పట్టుకుపోయి ఖైదులో పెట్టారు. ఆయనకు శిక్ష పడుతుంది. నాకు వెర్రెత్తిపోయింది. వెళ్ళి ఊర్మిళాదేవి కాళ్ళు పట్టుకున్నాను, నా తండ్రి పాదాల మైన పడి ఏడ్చాను. ఆయన నా దుఃఖం చూసి జాలి పడకపోగా, 'పాపిష్ఠిదానా, సిగ్గు పూర్తిగా వదిలేశావా?' అని తిట్టాడు.

"ఊర్మిళాదేవి నా తరఫున మహారాజును బతిమాలింది. 'అతను విమలను పెళ్ళాడే పక్షంలో క్షమించి విడిచిపెడతాను,' అన్నారు మహారాజు. ఆ మాట విని వీరేంద్రసింహుడికి కోపం వచ్చింది. 'నేను ఖైదులోనే ఉండి, మరణ దండన అయినా పొందుతాను గాని శూద్ర స్త్రీని పెళ్ళాడను. హిందువునై ఉండి కూడా నన్నిలా తగని పని చెయ్యమని ఎందుకడుగుతారు?' అన్నాడాయన. 'నా చెల్లెలిని యువరాజు సలీముకిచ్చి పెళ్ళిచేశాను. బ్రాహ్మణుడికి పుట్టిన పిల్లను పెళ్ళాడటానికి నీ కేమిటి అభ్యంతరం? నువ్వు పెళ్ళాడకపోతే ఆమెనిప్పుడు మరెవరు పెళ్ళాడతారు?' అన్నారు మహారాజు.

"అప్పటికీ వీరేంద్రసింహుడు ఒప్పుకోలేదు. ఖైదులో ఆయనను నీచంగా చూస్తూండటం చేత చివరకు అర్ధాంగీకారంగా, 'ఆమెను పెళ్ళాడతాను గాని, ఆమె నా భార్య అని చెప్పుకోకూడదు, నా భార్య లాగా వ్యవహరించ కూడదు, నా ఇంటి దాసి లాగా మసులుకోవాలి,' అన్నాడాయన.

నే నందుకు సంతోషంగా ఒప్పుకున్నాను. మాకు వివాహ మయింది. నేను దాసీ లాగా నా భర్త ఇంటికి వచ్చాను.

"మాది బలవంతంగా జరిగిన పెళ్ళి. అదివరకు నా భర్తకు నేనంటే ఎంతో ప్రేమా, దయా ఉండేవి. పెళ్ళయాక నే నాయనకు విష మయాను. నా మీద ఉండిన కోపం కొంత కాలానికి పోయింది గాని, ఆయనకు మానసింహమహారాజు పైన కలిగిన కోపం అలాగే ఉండిపోయింది. అది విధి నిర్ణయం. నన్ను గురించి చెప్పేది అయిపోయింది. అందులో తిలోత్తమ విషయం ఏమీ రాయలేదు. నీ వామెను మరిచిపో."

ఉస్మాన్‌ఖాన్ ఉత్తరం చదవటం పూర్తి చేసి, దీర్ఘంగా నిట్టూర్చి, "అమ్మా నీవు నన్ను కాపాడావు. అందుకు ప్రత్యుపకారం తప్పక చేస్తాను," అన్నాడు.

"ఉస్మాన్, ఈ మోడులో ఆశ చిగిర్చింప చూస్తున్నావా?" అన్నది విమల. ఆమె కళ్ళు మెరిశాయి.

ఉస్మాన్ తన చేతిలోంచి ఉంగరాన్ని తీసి ఆమె కిస్తూ, "దీన్ని నీ వద్ద ఉంచు. అంత త్వరలో ఏమీ సాధ్యం కాదు. కాని త్వరలోనే కతలూ ఖాన్ జన్మదినం రాబో



తున్నది. ఆ రోజు బ్రహ్మాండమైన ఉత్సవం జరుగుతుంది. రాజమహల్‌లో అందరూ ఆనంద పారవశ్యంలో మునిగి తేలుతూం టారు. కావలివాళ్ళు తెగ తాగి బాగా రాత్రి వచ్చాక ఒళ్ళు తెలియని స్థితిలో ఉంటారు. ఆ రోజున నీకు విముక్తి కలిగిస్తాను. ఆ నాడు అర్ధరాత్రి సమయానికి అంతః పుర ద్వారం వద్దకు రా. అక్కడ ఎవరైనా నీకు ఇలాటి ఉంగరమే చూపించినట్టయితే, వాడి వెంట క్షేమంగా బయటికి వెళ్ళి పోవచ్చు," అన్నాడు.

విమల అతన్ని అనేక రకాల దీవించి వెళ్ళిపోయింది. ఉస్మాన్ ఆమెను అపి,



"కాని సిద్ధ ఒంటరిగా మాత్రమే రావాలి. లేకపోతే పని పాడుగావటమే గాక లేనిపోని చిక్కులు కూడా కలగవచ్చు," అన్నాడు.

తిలోత్తమను తన వెంట తీసుకుపోదలచిన ఉస్మాన్ అభిప్రాయ మైనట్టు విమల గ్రహించి, "ఒక్కరే తప్పించుకు పోయే అవకాశం ఉంటే, తిలోత్తమే తప్పించుకు పోతుంది. నా కేమున్నది? నే నెలాగైనా తప్పించుకు పోగలను," అనుకున్నది.

ఆమె ఉస్మాన్‌ను మళ్ళీ దీవించి, తా నుండే చోటికి తిరిగి వెళ్ళిపోయింది.

రోజులు గడుస్తున్నాయి. క్రమంగా జగత్సింహుడు కోలుకుంటున్నాడు. బలం కూడా వస్తున్నది. కాని ఆరోగ్యం చేకూరుతున్న కొద్దీ అతని మనస్సు తిలోత్తమను గురించిన విచారంతో బాధపడటం జాస్తి అయింది. అతను కనబడిన వారి నందరినీ అడిగి చూశాడు. కాని ఒక్కరైనా తిలోత్తమను గురించిన ఒక్క శుభవార్త అతని చెవిన వేశారు కారు. ఆమె ఎక్కడ ఉన్నదీ అయేషాకు కూడా తెలీదు. ఉస్మాన్ తెలిసి కూడా చెప్పడు. "ఆమె ఎక్కడ? ఆమె ఎక్కడ?" అన్న ప్రశ్న అహోరాత్రాలు యువరాజు మెదడులో ఒకే తీరున ప్రతిధ్వనిస్తున్నది. అందుచేత అతనికి సుఖ మయంగా ఉండవలసిన శయ్య అంప శయ్యలాగా అయింది.

ఇది గాక జగత్సింహుడికి మరొక చింత కూడా ఉంది. "ముందు ఏం జరగనున్నది?" ఆ ప్రశ్నకు కూడా సమాధానం చెప్పేవారు లేరు. తాను ఖైదీ అన్న సంగతి అతనికి తెలుసు. అతను కారాగృహంలో కాకుండా సుఖంగా హంసతూలికా తల్పం పైన ఉన్నాడంటే అందుకు ఉస్మాన్, అయేషాల అనుగ్రహమే కారణం. దాసదాసీలు అతనికి నిరంతరమూ పరిచర్యలు చేస్తున్నారు. అయేషా [illegible] ఎక్కువగా అతన్ని కనిపెట్టుకుని



ఉంటున్నది. కాని ద్వారం వద్ద కాపలా వాడు ఉండనే ఉన్నాడు.

జగతసింహుడికి పరిచర్యలు అవసరమైన సమయంలో ఆయిషా అహోరాత్రాలు దగ్గిరే ఉండి సేవ చేసింది. అతనికి ఆరోగ్యం హెచ్చినకొద్దీ ఆమె రాకపోకలు మందగించాయి. అతనికి పూర్తి స్వాస్థ్యం చేకూరాక ఆమె రావటం దాదాపు మానేసింది; ఎప్పుడైనా వస్తే వచ్చేది, లేకపోతే లేదు.



ఒకనాడు జగతసింహుడు గవాక్షం వద్ద నిలబడి బయటికి చూస్తూ ఉండగా వెనక నుంచి ఉస్మాన్ వచ్చి, "ఏమిటి చూస్తున్నావు?" అని అడిగాడు.

"వీధిలో ఎవరో మనిషి చుట్టూ జనం మూగి వినోదం పొందుతున్నారు," అన్నాడు జగతసింహుడు.

"ఆ బ్రాహ్మడు మందారేణు దుర్గం మనిషి." అన్నాడు ఉస్మాన్.

మందారేణు దుర్గం మనిషి అని వినగానే, అతని ద్వారా తిలోత్తమ సమాచారం తెలుస్తుందేమో నని ఆశపడుతూ జగతసింహుడు, "అతని పేరేమిటో?" అన్నాడు.

"గణపతా? గుణపతా? అలాటి పేరే ఏదో ఉంది," అన్నాడు ఉస్మాన్.

"బెంగాలీ వాడిలా గున్నాడు. వాడి పిచ్చి వాళ్ళకు వినోదం కలిగించటం చూస్తే ఆశ్చర్యం వేస్తున్నది."

దిగ్గజాన్ని గురించి ఉస్మాన్ లోగడ విని ఉన్న దాన్ని బట్టి అతను ప్రమాదకరమైన మనిషి అనిపించలేదు. అందుచేత అతను జగతసింహుడితో, "కావలిస్తే ఆ బ్రాహ్మణ్ణి పిలిపించవచ్చునే!" అన్నాడు.

మనిషి వెళ్ళి దిగ్గజాన్ని పిలుచుకు వచ్చాడు. ఉస్మాన్ అతన్ని, "మీరు బ్రాహ్మణులేనా?" అని అడిగాడు.

దిగ్గజుడు చేతు లాడిస్తూ, "అసారే ఖలు సంసారే సారం శ్వశుర మందిరం,"

అని చదివాడు. అంటే అత్తవా రిల్లంత సుఖమైన చోటు ప్రపంచంలో లేదని అర్థం.

జగతసింహుడు నవ్వు అపుకుంటూ దిగ్గజుడికి వందనం చేశాడు. దిగ్గజు డతన్ని, "ఖుదా ఖాన్ బాబుగారిని సుఖంగా చూచు గాక!" అని ఆశీర్వదించాడు.

"పండిట్జీ, నేను ముసల్మానును కాను, హిందువుణ్ణి," అన్నాడు యువరాజు.

ఆ యువకుడు అబద్ధం చెప్పి తనను మోసగించ జూస్తున్నా డనుకుని దిగ్గజుడు, "ఖాన్ బాబూ, నేను తమ పాద దాసుణ్ణి. నన్ను అవమానించకండి." అన్నాడు.

"మీది మందారం. మీ పేరు దిగ్గజుడు. మందారపు సమాచారా లేమైనా చెబుతారా?" అన్నాడు జగతసింహుడు.

"అభిరామస్వామి పరిపాలయతుగా!" అన్నాడు దిగ్గజుడు.

"వీరేంద్రసింహుడి సంగతి?" అని జగతసింహం డడిగాడు.

"నవాబాయనను చంపేశాడు," అన్నాడు దిగ్గజుడు.

జగతసింహుడు ఉస్మాన్ కేసి తిరిగి, "ఏమిటి ఈ బ్రాహ్మణు డిలా పిచ్చి అబద్ధా లాడుతున్నాడు?" అన్నాడు.

నవాబు వీరేంద్రసింహుణ్ణి నిండు సభలో రాజద్రోహిగా విచారణ జరిపి శిక్ష విధించి నట్టూ, ఆయన తన సలహా కూడా పాటించ నట్టూ ఉస్మాన్ తెలిపి, దిగ్గజుడితో, "ఇక నువ్వు వెళ్ళవచ్చు," అన్నాడు.

యువరా జతన్ని అది విమల ఏమయిం దని అడిగాడు. నవాబుకు విమల ఉంపుడు గత్తె అయిందని దిగ్గజుడు చెప్పాడు. యువరాజు అపుకోలేక తిలోత్తమ సంగతి అడిగితే, ఆమె కూడా ఉంపుడుగత్తె అయిపోయిందని దిగ్గజుడు చెప్పాడు.

జగతసింహుడు ఉస్మాన్ కేసి తిరిగి, "మీరు సేవ చేస్తున్నది నవాబుకు కాదు, పిశాచానికి!" అన్నాడు.—(ఇంకా వుంది)






# 11

[విమల జగతసింహుడికి రాసిన ఉత్తరంలో తాను ఏ విధంగా అభిరామస్వామి వల్ల ఒక శూద్ర స్త్రీకి జన్మించినదీ, వీరేంద్రసింహుడు తనను ప్రేమించి కూడా పెళ్ళాడటానికి ఎలా సంకోచించినదీ, మానసింహ మహారాజు అతన్ని ఏ విధంగా పెళ్ళికి బలాత్కరించి వీరేంద్రసింహుడికి శత్రు వైపోయినదీ, తాను వీరేంద్రసింహుడి భార్య అయి ఉండీ కూడా ఎలా దాసిగా మసులుకున్నదీ తెలిపింది. ఈ సమయంలోనే జగతసింహుడు విమలా తిలోత్తమలు నవాబు ఆధీనంలో ఉన్నట్టు దిగ్గజాది వల్ల తెలుసుకుని క్షోభపడ్డాడు.]

ఆ రాత్రి జగతసింహుడు నిద్రపోలేదు. తనకు సర్వస్వమూ అయిన తిలోత్తమ నవాబు విలాస భవనంలో చేరి, నవాబు ఉంపుడుగత్తెలలో ఒకతెగా ఉంటున్నది. అప్పుడామె జీవించి ఉండి మాత్రం ఏం ప్రయోజనం? ఇంతకన్న తిలోత్తమ చనిపోయి ఉండినా బాగుండేదే అనుకున్నాడు జగతసింహుడు.

ఇలా విచార సాగరంలో కొట్టుమిట్టాడుతూ ఎప్పుడు కన్ను మూశాడో అతనికే తెలియదు. మర్నాడు ఉదయం ఉస్మాన్‌ఖాన్ అతన్ని నిద్రలేపి, అతని చేతిలో ఒక ఉత్తరం పెట్టి, "రాజకుమారా, ఈ ఉత్తరాన్ని నీకు అందజేస్తానని అది రాసిన మనిషికి మాట ఇచ్చాను. దీన్ని తీరికగా చదువుకో. మూడు జాముల వేళ

బంకించంద్ర చట్టోపాధ్యాయ



నేను మళ్ళీ వస్తాను. దీనికి జవా బేమైనా రాసిపెట్టుంటే అందజేయగలను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

తన మనోవైకల్యం కాస్త తగ్గాక జగతసింహుడా ఉత్తరాన్ని మొదటి నుంచి చివరదాకా చదివాడు. అది విమల రాసిన ఉత్తరం. సాంతం చదివి అతను ఆ ఉత్తరాన్ని తగలబెట్టి బూడిద చేశాడు. ఉత్తరమైతే తగలబడి బూడిద అయిందిగాని, అతని మనస్సులో ప్రజ్వలించే ఆలోచనలు మాత్రం బూడిద అయేలాగా కనబడలేదు.

చెప్పిన ప్రకారం మూడుజాముల వేళ ఉస్మాన్ జగతసింహుడి వద్దకు వచ్చాడు; "ఉత్తరానికి జవా బేమన్నా పంపుతావా?" అని అడిగాడు.

అదివరకే రాసి ఉంచిన జవాబును జగతసింహుడు ఉస్మాన్ చేతి కిచ్చాడు.

ఉస్మాన్ ఉత్తరం విప్పి చూస్తే అందులో రెండేరెండు ముక్కలున్నాయి: "అభాగ్యురాలా, నీవు చేసిన మేలు మరవను. నీవు నిజంగా పతివ్రతవే అయితే, నీ భర్త వెళ్ళిన మార్గాన్నే శీఘ్రంగా అనుసరించు—జగతసింహుడు."

ఉస్మాన్ ఆ రెండు ముక్కలూ చదివి, "యువరాజా, నీ హృదయం చాలా కర్కశమైనది," అన్నాడు.

యువరాజు నీరసంగా, "పఠానుల కంటేనా?" అన్నాడు.

ఉస్మాన్ కర్కశంగా, "అందుకేనేమో పఠానులు నీ యోగక్షేమాలలో లోపం చేసింది?" అన్నాడు.

జగతసింహుడు సిగ్గుపడుతూ, "లేదు బాబూ, నేను నా విషయం చెప్పలేదు. మీరు ఎంతో దయగా నాకు క్షేమం కలిగించారు. ఖైదీనైనప్పటికీ నాకు ప్రాణ దానం చేశారు. గన్పృశత్రువుకు ఎంతో సహాయపడ్డారు. నేను ఖైదీనే అయితే నాకు మీ దయా శృంఖలాలు వద్దు, నిజమైన సంకెళ్ళే

వెయ్యండి. నేను ఖైదీని కాకపోతే నన్ను బంగారు పంజరంలో ఎందుకు బంధించి ఉంచారో చెప్పండి," అన్నాడు.

"యువరాజా, కష్టాలను పిలిచి ఆహ్వానిస్తా వెందుకు? వాటంతట అవే వస్తాయి," అన్నాడు ఉస్మాన్.

"హంసతూలికాతల్పం పైన కాకుండా రాళ్ళ పైన పడుకోవటం కష్టాలలో జమ అని రాజపుత్రుడు భావించడు. కతలూఖాన్‌కు తగిన శిక్ష ఇవ్వజాలని పక్షంలో మరణం కూడా నాకు కష్ట మనిపించదు," అన్నాడు జగతసింహుడు.

"యువరాజా, జాగ్రత్త! పఠానులు అన్నంతా చేస్తారు!"

జగతసింహుడు నవ్వి, "సేనాపతీ, నన్ను భయపెట్టటం మీ తరం కాదు," అన్నాడు. ఉస్మాన్‌కు అసలు సంగతి స్ఫురణకు వచ్చింది. అతను జగతసింహుడితో, "నేను మరొక ముఖ్యమైన పని మీద ఇక్కడికి వచ్చాను," అన్నాడు.

జగతసింహు డాశ్చర్యపడి, "ఏమిటది? చెప్పండి!" అన్నాడు.

"నేను చెప్పబోయే విషయం నవాబు తరఫునే నని గుర్తుంచుకో!"

"మంచిది."



"విను, యుద్ధం మూలంగా రాజపుత్రులూ, పఠానులూ కూడా నాశనమై పోతున్నారు."

"పఠానులను నాశనం చెయ్యాలనే మా ఉద్దేశ్యం."

"అది నిజమే. కాని రెండు పక్షాలూ నాశనం కావటమే గాని ఏదో ఒక పక్షం మటుకే నాశనమయ్యే అవకాశం కనిపించదు. మందారణ దుర్గాన్ని జయించిన వాళ్ళు తొత్తిగా బలహీనులని నీకు తోస్తున్నదా?"

"లేదు. వాళ్ళు సమర్థులే."

"ఏమైనా, మా గొప్ప చెప్పుకోవటం నా ఉద్దేశం కాదు. మొగలు పాదుషాతో



శాశ్వత వైరం పెట్టుకుని పఠానులు ఒరిస్సాలో ఒదిగి ఉండటంలో సుఖ మేమీ లేదు. అయితే పాదుషా పఠానులను తన అధీనంలో ఉంచుకో గలగడం కూడా సాధ్యమయేది కాదు; ఢిల్లీకి ఒరిస్సాకూ ఎంత దూరమైనా నీకు తెలుసు. అంత దూరం నుంచి పాదుషా ఒరిస్సానెలా జయిస్తాడు? ఒకవేళ జయించినా బోలెడంత సేన నష్టం కావటమే తప్ప ఒరిస్సా పాదుషా అధీనంలో ఉండదు. అలా ఉభయ పక్షాలూ నాశనం అవుతూ పోవటం వల్ల లాభ మేమిటో నీవే ఆలోచించు," అన్నాడు ఉస్మాన్.

"అయితే ఏం చేస్తామంటారు?" అని జగత్సింహు డడిగాడు.

"నేను స్వయంగా ఏమీ అనటంలేదు. సంధి చేసుకుంటామని మా నవాబు అంటున్నారు."

"ఎలాటి సంధి?"

"ఉభయ పక్షాలూ కొంత త్యాగ బుద్ధి చూపాలి. కతలూ ఖాన్ బెంగాలులో తాను గెలుచుకున్న ప్రాంతాలన్నిటినీ విడిచిపెట్టు టానికి సిద్ధం. పాదుషా మా పైకి పంపిన సేన అన్నిటినీ ఉపసంహరించుకుని, ముందు కూడా మా పైకి రాకుండా ఉండాలి. అందువల్ల నష్టం పఠానులకే గాని, పాదుషాకు కాదు. ఏమంటే, మేము ఎంతో శ్రమపడి గెలుచుకున్న దంతా వదులుకుంటున్నాం. అక్బరు పాదుషా తాను గెలవని దాన్ని మాత్రమే పోగొట్టు కుంటాడు."

"సరే, అదంతా నాతో ఎందుకు చెబు తున్నావు? సంధి విగ్రహాలు చెయ్య సమర్థుడు మానసింహ మహారాజు. ఆయన వద్దకే సంధి రాయబారం పంపండి."

"దూతను పంపాం. అయితే ఆయన కెవరో నిన్ను పఠానులు హత్య చేసినట్టు వార్త చెప్పారట. ఆయన పుత్ర శోకంతో

కుమిలిపోతున్నారు, సంధి ప్రస్తావన విని పించుకునేటట్టులేరు. రాయబారి చెప్పినా ఆయనకు నమ్మకం కలగలేదు. నీవే వెళ్ళి, మా పక్షాన మాట్లాడితే పని జరగవచ్చు."

జగతసింహుడు ఉస్మాన్ కేసి చూసి, "నా దస్తూరీ చూసినా మహారాజుకు నమ్మకం కలుగుతుంది గదా, నన్ను స్వయంగా ఎందుకు పొమ్మంటున్నారు? అసలు సంగతి చెప్పండి," అన్నాడు.

"మహారాజుకు అక్కడి వాస్తవ పరిస్థితి తెలియదు. అదీగాక, ఆయనకు నిన్ను చూస్తే కలిగే తృప్తి నీ ఉత్తరం చూస్తే కలగదు. ముందు నీకు బంధవిముక్తి ఒకటి కలుగుతుంది. ఇవన్నీ ఆలోచించి నవాబీ ఆలోచన చేశాడు."

"నాన్నగారి దగ్గిరికి వెళ్ళటానికి నా కేమీ అభ్యంతరం లేదు."

"చాలా సంతోషం. మరొక్క మనవి. సంధి కుదరని పక్షంలో నీ విక్కడికి తిరిగి వచ్చెయ్యవలిసి ఉంటుంది. అలా మాకు మాట ఇవ్వాలి."

"మాట ఇచ్చి నిలబెట్టుకుంటానని నమ్మక మేమిటి?"

ఉస్మాన్ నవ్వి, "రాజపుత్రులు ఆడి తప్పరని అందరికీ తెలుసు," అన్నాడు.



"నాన్నగారిని కలుసుకుని సాధ్యమైనంత త్వరగా తిరిగి వస్తానని మాట ఇస్తున్నాను," అన్నాడు జగతసింహుడు.

"మేము చెప్పే సంధి నిబంధనలకు మహారాజు ఒప్పుకునే లాగా సాధ్యమైనంత కృషి చేస్తానని కూడా మాట ఇవ్వు."

"అలా మాట ఇవ్వలేను. పఠానులను ఓడించి విజయం సాధించమని పాదుషా మమ్మల్ని పంపారు. మేం విజయం పొందగలం. పఠానులతో సంధి చేసుకోవటానికి పాదుషా మమ్మల్ని పంపలేదు. సంధి చేసుకోవటానికిగాని, మానటానికిగాని మాకు హక్కు లేదు."



ఉస్మాన్ ముఖాన సంతోష విషాదాలు రెండూ తాండవించాయి. అతను జగతసింహుడితో, "యువరాజా, రాజపుత్రుడ వనిపించే లాగా మాట్లాడావు. కాని కాస్త ఆలోచించుకో, నీ విముక్తి కింతకన్న మంచి ఉపాయం దొరకదు," అన్నాడు.

"నేను విముక్తుణ్ణి కాకపోతే పాదుషాకు దిగులా? ఇంకెందరో నా లాటి రాజపుత్రులున్నారు!"

ఉస్మాన్ బాధపడుతున్నట్టుగా జగతసింహుణ్ణి మరీ మరీ బతిమాలాడు. కాని జగతసింహుడు అతను కోరినట్టు మాట ఇవ్వలేదు.

"నేను చెప్పిన దానికి ఒప్పుకోకపోతే నవాబు ఏం చేసేదీ చెప్పలేం," అన్నాడు ఉస్మాన్.

"నన్ను ఖైదులో పెట్టించమని నేను ముందే అన్నాను," అన్నాడు జగతసింహుడు.

"అంతటితో నవాబు తృప్తిపడతారని ఏమిటి?"

"వీరేంద్రసింహుణ్ణి చంపించినట్టు నన్నూ చంపించవచ్చు. అంతకంటె ఏం చెయ్యగలరు?" అన్నాడు యువరాజు.

ఉస్మాన్ విచారంగా, "అయితే ఇక నేను సెలవు పుచ్చుకుంటాను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

మరికొంత సేపటికి జగతసింహుడి వద్దకు ఒక సైనికాధికారి వచ్చాడు. అతని వెంట మరి నలుగురు ఖడ్గహస్తులైన సైనికులు ఉన్నారు. వారిని చూసి జగతసింహుడు, "మీరంతా ఏం పని మీద వచ్చారు?" అని అడిగాడు.

"మిమ్మల్ని మరొక చోటికి తీసుకు పోవటానికి," అని వారు జవాబు చెప్పారు.

"నేను సిద్ధంగానే ఉన్నాను, పదండి." అంటూ జగతసింహుడు వారి వెంట బయలుదేరాడు...

ఆ రోజు నవాబు జన్మదినోత్సవం. ఉదయం నుంచీ ఎక్కడ చూసినా ఒకటే కోలాహలం; ఒక చోట నృత్యం, మరొక చోట తాగుడు, ఇంకోచోట దానధర్మాలు, వేరొకచోట భోజనసంతర్పణలు; అలాగే రోజంతా గడిచి రాత్రి అయింది.

విమల భవన మంతా కలయతిరిగి, ఎలాగైతేనేం తిలోత్తమ పడుకుని ఉన్న గదికి చేరుకున్నది. ఆమె, "నేను వచ్చాను," అనగానే తిలోత్తమ లేచి కూర్చున్నది. తిలోత్తమ మాటా, పలుకూ లేకుండా ఆమె కేసి తేరిపార చూసింది.

"వస్తానన్నాను, వచ్చాను. ఏం మాట్లాడవు?" అన్నది విమల.

"ఏం మాట్లాడను? మాట్లాడే దంతా అయిపోయింది," అన్నది తిలోత్తమ. ఆమె కంఠ ధ్వని చూస్తే అంతకుముందుదాకా ఆమె ఏడుస్తూ ఉన్నట్టున్నది.

"ఇలా అహోరాత్రాలు ఏడుస్తూ ఎంత కాలం బతుకుతావు?" అన్నది విమల.

"బతక్కపోతే ఏమిటి నష్టం? అంత కాలం ఎందుకు బతకాలా అనే నా విచారం," అన్నది తిలోత్తమ.

విమల కళ్ళంట కన్నీరు వచ్చింది. ఆమె కళ్ళు తుడుచుకుని, దీర్ఘంగా నిట్టూర్చి,



"తీరిక లేకా, మన విచారం కొంత తగ్గగలందులకూ కతలూఖాన్ ఇంతవరకూ మన కేసి చూడలేదు. ఇవాళ మనం కనబడకపోతే ఏం చేస్తాడో తెలియదు," అన్నది. తిలోత్తమ వణికిపోతూ, "మరో మార్గం లేకపోతే చచ్చిపోగలను," అన్నది.

"అలా నిరాశపడి లాభం లేదు, తిలోత్తమా. కాస్త ధైర్యం వహించు. ఇక్కడి నుంచి తప్పించుకు పారిపోయే ఉపాయం నా చేతిలో ఉన్నది," అంటూ విమల తన దుస్తులలో నుంచి జిగేలున మెరిసే కత్తినీ, ఉస్మాన్ ఇచ్చిన ఉంగరాన్నీ పైకి తీసి తిలోత్తమకు చూపింది.

"ఈ కత్తి ఎక్కడ నుంచి వచ్చింది?"

"నిన్న ఉస్మాన్ వచ్చింది చూశావుగా? అభిరామస్వామి దాని ద్వారా ఈ కత్తి పంపారు."

"ఈ ఉంగరం?"

"నేను తప్పించుకు పోగలందులకు ఉస్మాన్ ఈ ఉంగరా మిచ్చాడు."

తిలోత్తమ స్తంభించి పోయింది. ఆమె గుండె దడదడలాడుతున్నది.

"ఈ మాసిన గుడ్డలు విడిచి, మంచి బట్టలు వేసుకుని, నృత్య గానాలు జరిగే చోటికి బయలుదేరు," అన్నది విమల.

"ఊహూ!" అన్నది తిలోత్తమ.

"అయితే నువ్వు బయటపడలేవు."

తిలోత్తమ ఏడవసాగింది.

"అలా దుఃఖించకు! మనసు నిబ్బరం చేసుకుని నేను చెప్పినట్టు చెయ్యి. నిన్ను కాపాడడానికి నే నొక ఉపాయం చేశాను," అన్నది విమల.

ఆ మాట వింటూనే తిలోత్తమ విమల కేసి కోపంగా చూసింది.

"ఈ ఉంగరాన్ని తీసుకుని నీ వద్ద ఉంచుకో. నువ్వు వినోద స్థలానికి వెళ్ళ నవసరం లేదు. అర్ధరాత్రి దాకా సంబరం సాగుతూనే ఉంటుంది. అర్ధరాత్రి సమయాన ఉంగరంతో అంతఃపుర ద్వారానికి వెళ్ళు. అక్కడ నీ కొక సిపాయి కని పిస్తాడు. వాడు నీ కిలాటి ఉంగరమే చూపించినట్టయితే దీన్ని వాడికి చూపించు. అప్పుడు వాడు నిన్ను అభిరామస్వామి దగ్గరికి తీసుకుపోతాడు, లేదా నువ్వెక్కడికి పోతానంటే అక్కడికి తీసుకుపోతాడు. నువ్వు నిర్భయంగా వాడి వెంట వెళ్ళవచ్చు. మధ్య దారిలో ఇతర పహారావాళ్ళు నిన్ను నిలిపినా, ఈ ఉంగరం చూపిస్తే నిన్ను అడ్డగించరు. తెలిసిందా?" అన్నది విమల. ఈ మాట చెప్పి విమల వెళ్ళిపోయింది.

—(ఇంకా వుంది)






## 12

విమల వెళ్ళిపోయాక తిలోత్తమ ఏమేమిటో ఆలోచిస్తూ ఒంటరిగా తన గదిలో కూర్చుంది. జగతసింహుడు ఈ కోటలోనే ఉన్నాడనీ, క్షేమంగానే ఉన్నాడనీ విమల ద్వారా ఆమె తెలుసుకుని ఉన్నది. మాటిమాటికీ ఆమె ధ్యాస అతని పైకే పోతున్నది.

ఆమె అలా ఆలోచిస్తూ ఉండగానే అర్ధరాత్రి అయింది. తిలోత్తమ చుట్టూ జాగ్రత్తగా కలయజూసుకుంటూ అంతఃపుర ద్వారాన్ని సమీపించింది. అక్కడ సిపాయి దుస్తులు ధరించి ఉన్న ఒక వ్యక్తి, "మీ వద్ద ఉంగరం ఉన్నదా?" అని అడిగాడు. ఆమె తన వద్ద ఉన్న ఉంగరం అతని చేతి కిచ్చింది. అతను దాన్ని పరీక్షగా చూసి, తన వద్ద ఉన్న మరొక ఉంగరం ఆమెకు చూపి, "పదండి," అన్నాడు.

అంతఃపురానికి ఉన్న పహరా వాళ్ళందరూ తాగి మత్తులో ఉన్నారు. ఆ వ్యక్తి తిలోత్తమను కోట వెలపలికి తీసుకువచ్చి, "చెప్పండి. మిమ్మల్ని ఎక్కడికి చేర్చాలి?" అని అడిగాడు.

విమల చెప్పిన దేమిటో తిలోత్తమ పూర్తిగా మరిచిపోయింది. చాలా సేపు ఆలోచించి, గద్గద కంఠంతో, "జగతసింహు డెక్కడ ఉంటే అక్కడికి తీసుకుపోండి," అనేసింది.

"జగతసింహుడా? జగతసింహుడిప్పుడు కారాగృహంలో ఉన్నాడు. అక్క

బంకించంద్ర చట్టోపాధ్యాయ



డికే తీసుకుపోతాను, పదండి," అన్నాడా వ్యక్తి. అతను తిలోత్తమను వెంటబెట్టుకుని తిరిగి కోటలోకి ప్రవేశించాడు. అతను కారాగృహం వద్దకు వచ్చి చూసేసరికి అక్కడి పహరా మిగిలిన చోట్ల ఉన్నట్టు లేదు. అక్కడ కావలావాళ్ళు తమ విధిని సక్రమంగా నెరవేరుస్తున్నారు.

తిలోత్తమను వెంటబెట్టుకుని వచ్చిన వాడు ఒక కావలావాడికి తన వద్ద ఉన్న ఉంగరం చూపి, "రాజకుమారు డెక్కడ?" అని అడిగాడు. కావలావాడు జగతసింహుడి గది దాకా వెళ్ళి వచ్చి, "అక్కడే, మేలుకునే ఉన్నాడు," అని చెప్పాడు.

"ఆ గది తలుపు తెరు. ఈమె అతన్ని చూడగోరుతున్నది," అన్నాడు తిలోత్తమ వెంట వచ్చినవాడు.

జగతసింహుడు సామాన్యమైన మంచం మీద పడుకుని ఉన్నాడు. తలుపు చప్పుడు విని అతను అటుకేసి చూశాడు. తిలోత్తమ ద్వారాన్ని ఊతగా పట్టుకుని నిలబడి, అడుగు లోపలికి వెయ్యలేకపోయింది. ఆమె వెంట వచ్చినవాడు, "ఏమిటిది? ఎందుకీ వృథా కాలయాపన?" అన్నాడు. అప్పటికీ ఆమె అడుగు లోపలికి పెట్టలేదు.

"లోపలికి వెళ్ళటం ఇష్టం లేకపోతే తిరిగి వెళ్ళండి. అంతేగాని అలా నిలబడ వద్దు," అన్నాడు కావలావాడు.

తిలోత్తమ తిరిగిపోవటానికైనా కాలు కదప లేని స్థితిలో ఉన్నది. ఒక వంక కావలావాడు, లోపలికైనా వెళ్ళమని, తిరిగి అయినా వెళ్ళిపొమ్మని పదే పదే చెబుతున్నాడు, తొందరపెడుతున్నాడు.

జగతసింహుడు మొదట్లో తిలోత్తమను గుర్తించనుకూడా లేదు; కారాగృహం లోకి ఆడది అడుగు పెట్టటం చూసి విభ్రాంత పోయాడు కూడా. కాని దగ్గిరగా చూస్తే తిలోత్తమ! ఒక్క క్షణం ఇద్దరి చూపులూ

కలిశాయి. మరుక్షణం తిలోత్తమకు కళ్ళు వాటంతటవే మూసుకుపోయాయి.

"వీరేంద్రసింహుడి కూతురా?" అన్నాడు జగతసింహుడు.

ఆ మాట తిలోత్తమకు హృదయంలో శూలం లాగా తగిలింది. ఇప్పుడు తాను అతనికి వీరేంద్రసింహుడి కుమార్తె మాత్రమేనా? తిలోత్తమ అన్న పేరు కూడా అతను మరిచిపోయాడా?

కొంచెం సేపుండి అతను, "ఇక్కడి కెందుకు వచ్చావు?" అని అడిగాడు.

ఆ ప్రశ్న కూడా ఆమెకు బాధ కలిగించింది. ఆమెకు తల తిరగ నారంభించింది. అతను సమాధానం కోసం ఎదురు చూస్తున్నాడు. కాని ఆ ప్రశ్నకు సమాధానమేముంది?

"అనవసరంగా హైరాన పడుతున్నావు. వెళ్ళిపో. గతమంతా మరిచిపో," అన్నాడు జగతసింహుడు.

తిలోత్తమకు తన దౌర్భాగ్యం పూర్తిగా అర్థమయింది. ఆమె మొదలు నరికిన చెట్టు లాగా కూలిపోయింది.

ఆమెకు స్పృహ తప్పిపోయిందని గ్రహించి జగతసింహు డామెకు తన బట్టతో విసిరాడు. అలా కూడా ఆమెకు చైతన్యం



రాకపోయే సరికి అతను కావలావాణ్ణి పిలిచాడు. తిలోత్తమ వెంట వచ్చిన మనిషి లోపలికి వచ్చాడు.

"ఈమె ఉన్నట్టుండి మూర్ఛపోయింది. ఈమె వెంట వచ్చిన దెవరు? వాళ్ళను పిలిచి ఈమెకు శైత్యోపచారాలు చెయ్యమను," అన్నాడు జగతసింహుడు.

"నేనే ఈమెను తీసుకు వచ్చాను," అన్నాడు కావలావాడు.

"నువా? అయితే ఇప్పుడేం చేసేటట్టు? ఎవరైనా దాసీదాన్ని పిలిపించు."

కావలావాడు తిరిగి వచ్చేలోగా జగతసింహుడు తిలోత్తమకు తనకు చాతనైన



విధంగా ఉపచర్యలు చేశారు. ఆమెకు కొంచెం కొంచెంగా స్పృహ వస్తున్నట్టు కనబడింది. అంతలో నవాబు కుమార్తె అయిన ఆయుషా, మరొక స్త్రీ అక్కడికి వచ్చారు.

ఆయుషా జగతసింహుడితో, "ఏమిటిది? ఈమె ఎవరు?" అంటూ మూర్ఛపడి ఉన్న తిలోత్తమను చూపింది.

"ఈమె వీరేంద్రసింహుడి కుమార్తె," అన్నాడు జగతసింహుడు.

ఎలాటి సంకోచం గాని, తడబాటు గాని, మానసికమైన గుంజాటన గాని లేకుండా ఆయుషా తిలోత్తమను తన ఒడిలోకి తీసుకుని కూర్చున్నది. పన్నీరు జల్లి, దాసీది విసిరిన మీదట తిలోత్తమకు క్రమంగా మూర్ఛ తెలియసాగింది. ఆమె కళ్ళు తెరిచి, తానెక్కడ ఉన్నదీ గ్రహించగానే, బయటికి వెళ్ళిపోవటానికి లేవబోయింది. కాని ఆమె శరీరంలో లేచి నిలబడే శక్తి కూడా లేదు.

ఆయుషా ఆమె చెయ్యి పట్టుకుని, "చెల్లీ, ఎందుకు కంగారుపడతావు? నీలో శక్తి ఏ మాత్రమూ లేదు. నా గదికి వచ్చి విశ్రాంతి తీసుకో. ఆరోగ్యం పొందాక నిన్ను ఎక్కడికి చేర్చమంటే అక్కడికి చేర్చుతాను," అన్నది.

తిలోత్తమ ఏమీ జవాబు చెప్పక మౌనంగా ఉండిపోయింది.

"ఏమమ్మా, నా మీద నమ్మకం లేదా? నేను మీ శత్రువుకు కూతుర్నే అనుకో. కాని అంత మాత్రాన నన్ను అనుమానించ నవసరం లేదు. నా వల్ల నీ కెలాటి కీడూ రాదు. తెల్లవారే లోపలనే నిన్ను కోరిన చోటికి పంపేస్తాను," అన్నది ఆయుషా.

ఆయుషా ఆ మాట అన్న పద్ధతి వింటే తిలోత్తమకు ఆమెను శంకించటం సాధ్యం కాలేదు. తిలోత్తమకు అప్పుడు వెళ్ళిపోయే శక్తి లేదు. జగతసింహుడి సమీపంలో ఉండటం కూడా బాధాకరంగానే ఉన్నది.

అందుచేత ఆమె ఆయుషా మందిరానికి వెళ్ళటానికి ఒప్పుకున్నది.

"నువ్వు నడవ లేవు. నా దాసి నిన్ను పట్టుకుని నా గదికి తీసుకుపోతుంది. అక్కడ విశ్రాంతి తీసుకో, నే నిప్పుడే వస్తున్నాను," అన్నది ఆయుషా తిలోత్తమతో.

తిలోత్తమ దాసి భుజం మీద చెయ్యి వేసి నింపాదిగా నడుస్తూ బయలుదేరింది. ఆయుషా జగతసింహుడికి వీడ్కోలు చెప్పి తాను కూడా బయలుదేరదామనుకున్నది, కాని జగతసింహుడి ముఖం చూస్తే అతను ఏదో చెప్పదలుచుకున్నట్టు కనబడ్డాడు. అందుచేత ఆమె దాసితో, "నువ్వీమెను నా గదికి చేర్చి మళ్ళీ రా," అన్నది.

తిలోత్తమ కనబడకుండా పోయిన దాకా జగతసింహుడు దామెనే చూస్తూ, "తిలోత్తమా, ఇదే మన తుది సందర్శనం!" అనుకున్నాడు.

ఉంగరం దాచిన మనిషి తిలోత్తమ వెళ్ళిపోయేటప్పుడు ఆమెను సమీపించి, "ఇక నేను వెళ్ళవచ్చునా?" అని అడిగాడు. తిలోత్తమ జవాబివ్వలేదు గాని, ఆమె వెంట ఉన్న దాసి, "ఊఁ" అన్నది. వాడు ఆమె వద్ద ఉండే ఉంగరం తీసుకుని వెళ్ళిపోయాడు.



తన దాసి వెంట తిలోత్తమ వెళ్ళిపోగానే ఆయుషా జగతసింహుడి ముఖం వైపు చూస్తూ, "యువరాజా, మీరు నా కేదో చెప్పా లనుకుంటున్నట్టున్నది. అందుకే నేను ఉండిపోయాను. నా నుండి ఏమైనా కావాలంటే నిస్సంకోచంగా చెప్పవచ్చు. మీ కేదైనా సహాయం చెయ్యగలిగితే నేను సంతోషిస్తాను," అన్నది.

"షహజాదీ, ఇక నాకు ఏ సహాయమూ అవసరం లేదు. నే నిప్పు డున్నది అంతిమ దశ లాగా కనబడుతుంది. అందుచేత మనం కలుసు కోవటం ఇదే ఆఖరుసారి కావచ్చు. నేను మీ కెంతగా ఋణపడి



ఉన్నానంటే వాళ్ళ మాటలలో విశ్వసించటం సాధ్యం కాదు. ఒక వేళ నేను స్వతంత్రుణ్ణయి నాకు మంచి రోజులు వచ్చే మాట ఉంటె నా చేత మీకు కావలసిన ఎలాటి సేవ అయినా సరే చేయించుకోమని నా ప్రార్థన," అన్నాడు జగతసింహుడు.

అతని కంఠంలో ఉన్న దైన్యం చూసి ఆయుషా కంట కన్నీరు తిరిగింది. ఆమె అతనితో, "మీరు అంత నిస్సహాయ స్థితిలో ఉన్నట్టు దేనికి అనుకోవాలి? నిరాశ చెందటం భావ్యం కాదు. ఇవాళ ఉన్న కష్టం రేపు ఉండకపోవచ్చు. సుఖదుఃఖాలు శాశ్వతం కాదు," అన్నది.

"నన్ను బాధిస్తున్నది నిరాశ కాదు. నాకు అక పైన వాంఛ పోయింది. ఈ కారాగారం నుంచి విముక్తుణ్ణి కావాలన్న కోరిక నాకు లేదు. ఈ జన్మ కిక నాకు సుఖమనేది లేదు. నా మనస్సులో ఉన్న దుఃఖాన్ని మీరు గ్రహించలేరు, నేను వివరించనూ లేను," అన్నాడు జగతసింహుడు.

అతని మాటలకు ఆయుషా ఆశ్చర్యం చెంది, "మీకు అంత దుర్భరమైన దుఃఖం ఏ కారణం చేత కలిగింది? వీరేంద్ర సింహుడి కూతురేమైనా—" అని ఏదో చెప్పబోయింది.

జగతసింహు డామె మాటను అడ్డొచ్చి, "ఆమె ఊసెత్తటం వృథా. ఆ కల ఏనాడో కరిగిపోయింది," అన్నాడు.

ఆయుషా కొంచెంసేపు తల వంచుకుని ఉండి, "యువరాజా, మీ రీ విధంగా ఈ కారాగృహంలో కుములుతూ ఉండటం నాకు దుస్సహంగా ఉంది. నా వెంట బయలుదేరండి. నేను మిమ్మల్ని విడిపిస్తాను. ఈ రాత్రే మీ శిబిరానికి క్షేమంగా వెళ్ళిపొండి," అన్నది.

"ఆయుషా, మీ తండ్రికి తెలియకుండానే నన్ను విముక్తుణ్ణి చేస్తావా?" అన్నాడు జగతసింహుడు.



"ఆ విషయమై విచారించకు. నువ్వు ఈ శిబిరం చేరాక నే నాయనతో చెప్పేస్తానులే," అన్నది ఆయెషా.

ఇద్దరూ అప్రయత్నంగా ఒకరి నొకరు "నువ్వు" అని సంబోధించుకున్నారు.

"ఆయనకు తెలిసినాక నీకు చాలా చిక్కు వస్తుంది."

"ఏమీ భయంలేదు. ఏం జరుగుతుందో నేనూ చూస్తాను."

"ఆయెషా, నేను రాను."

"ఏం?" అన్నది ఆయెషా తెల్లబోతూ.

"నా ప్రాణదాతవు. నీకు బాధ కలిగించే పని చెయ్యలేను. నువ్వు వెళ్ళిపో."

ఆయెషా మాట్లాడ లేదు. దుఃఖం వల్ల ఆమె కళ్ళ నుంచి టపటపా కన్నీటి బిందువులు రాలాయి.

ఎప్పుడో వారిద్దరికీ తెలియకుండా మరో మనిషి వచ్చి గది వాకిలి దగ్గిర నిలబడి ఉన్నాడు. అతను వారిద్దరినీ సమీపించి, "భేష్, నవాబ్‌జాదీ! ఇదే బాగుంది!" అన్నాడు.

ఇద్దరూ అతని కేసి చూసి, ఆ వచ్చిన వాడు ఉస్మాన్‌ఖాన్ అని గ్రహించారు. ఉస్మాన్ వెటకారంగా అన్న మాట చెవిని పడే సరికి, ఆయెషా కిక కష్టాలు తప్పవని



జగత్సింహుడు భావించాడు. ఆయెషా కూడా ఉస్మాన్ భావాన్ని సరిగానే గ్రహించింది. కాని ఆ సంగతి ఏమాత్రమూ బయటికి పడనియ్యక, "భలే బాగున్నదేమిటి, ఉస్మాన్?" అని అడిగింది.

"అర్ధరాత్రి వేళ నవాబు కూతురు ఒంటరిగా కారాగృహం లోకి వచ్చి ఖైదీతో ప్రేమసల్లాపాలు జరపడం బాగుండ కేం చేస్తుంది?" అన్నాడు ఉస్మాన్.

ఆయెషా ఉస్మాన్ కేసి తీవ్రంగా చూస్తూ, "కారాగృహం లోకి వచ్చి ఖైదీతో ప్రేమసల్లాపాలు జరపటమూ, జరపక పోవటమూ కేవలం నా ఇచ్ఛపై ఆధారపడిన

విషయం. అది బాగున్నదీ, లేనిదీ తెలుసుకో వలసిన అవసరం నీ కేమాత్రమూ లేదు," అన్నది.

ఈ మాటలు విని ఉస్మాన్ నిర్ఘాంత పోయాడు. అతనిలో ఆశ్చర్యం కంటె క్రోధమే హెచ్చుగా కలిగింది; "అవసరం నా కున్నదో లేదో చెప్ప నవాబుగారి నోటనే విందువుగాని!" అన్నాడు.

"నాన్నగారు అడిగినప్పుడు నేను సమాధానం చెబుతానులే. దాన్ని గురించి నువ్వు బెంగపడ నవసరం లేదు," అన్నది ఆయుషా దృఢంగానూ, రోషంగానూ.

"ఆ మాట నేనే అడిగితే?" అన్నాడు ఉస్మాన్ గుచ్చినట్టుగా.

ఆయుషా మరింత నిటారుగా నిలబడి, అతని ముఖం కేసి కొంతసేపు తేరిపార చూసి, స్ఫుటమైన స్వరంతో, "నువ్వడిగే పక్షంలో, ఈ ఖైదీ నా ప్రాణేశ్వరుడని నా సమాధానం, ఉస్మాన్," అన్నది.

ఈ మాట విని ఉస్మానూ, జగత్సింహుడూ కూడా తమ మీద పిడుగు పడ్డట్టయిపోయారు. యువరాజు కళ్ళు తెరిపిడి పడ్డాయి. ఆయుషా దుఃఖానికి కారణం అతను గ్రహించాడు.

ఆయుషా అతని కేసి తిరిగి, "యువరాజా, నన్ను క్షమించు. ఉస్మాన్ నన్ను ఇలా గుచ్చి అడగక పోయినట్టయితే నా హృదయ మంతా విప్పి నీ ముందు బయట పెట్టి ఉండకపోదును; నీ కెన్నటికీ అది తెలియకుండానే ఉండిపోను!" అన్నది. జగత్సింహుడు మౌనంగా నిలబడ్డాడు.

అక్కడ ఒక్క క్షణమైనా నిలబడకుండా, దాసి రాకకు ఎదురు చూడకుండా ఆయుషా అక్కడి నుంచి ఒంటరిగానే బయలుదేరి వెళ్ళిపోయింది. ఉస్మాన్ కొంచెం సేపు స్తంభించి నిలబడిపోయి, తర్వాత నింపాదిగా తన గృహానికి బయలు దేరిపోయాడు. —(ఇంకా వుంది)






## 13

కతలూఖాన్ విలాస భవనంలో ఇంకా నృత్య గానాలు జరుగుతూనే ఉన్నాయి. ఎవతో పాడుతున్నది, ఎవతో నాట్యం చేస్తున్నది, చాలా మంది స్త్రీలు తాళం వేస్తున్నారు. ఆనందోత్సవం పరాకాష్ఠ నందు కున్నది. కతలూఖాన్ పూర్తిగా మైకంలో ఉండి, "సాకీ, సాకీ!" అంటున్నాడు। అప్పుడల్లా విమల అతనికి మద్యం అందిస్తున్నది. తాగిన కొద్దీ నవాబు మైకం హెచ్చుతున్నది.

విమల నృత్యం చెయ్యసాగింది. నవాబు ఆ నృత్యం చూసి ఆమెను దగ్గిరికి పిలిచాడు. ఆమె వచ్చి అతని సమీపంగా నిలబడింది. అత నామెను తన పక్కన కూర్చోమన్నాడు. "వస్తున్నాను," అంటూ విమల చప్పున చెయ్యి పైకెత్తింది. ఆమె చేతిలో కత్తి ధగేలున మెరిసింది.

కతలూఖాన్ పెట్టిన చావు కేక రాజభవన మంతా మారుమోగింది. అతను విమలను బలంగా నెట్టివేస్తూ, అదే సమయంలో తాను కూడా పడిపోయాడు. ఆ సమయంలో విమల అతని వక్షంలో కత్తిని గుచ్చేసింది. ఆమె భర్త దుర్మరణానికి ప్రతీకారం జరిగిపోయింది.

"సైతాన్! హంతకి!" అని కతలూఖాన్ అరిచాడు. అక్కడ ఉన్న స్త్రీలు కొందరు భయంతో పరుగెత్తుతూ కెవ్వున అరవ నారంభించారు. విమల కూడా కెవ్వున కేకలు



పెడుతూ పరిగెత్తసాగింది. ద్వారం వద్ద ఉన్న కోట కావలావాళ్ళు విమల కంగారు చూసి, "ఏం జరిగింది?" అని అడిగారు.

చకిత బుద్ధిగల విమల, "సర్వనాశనం! అంతఃపురంలో మొగలులు జొరబడ్డారు, త్వరగా వెళ్ళండి! వాళ్ళు నవాబు నేం చేస్తారో?" అన్నది. కోట వాళ్ళంతా ఒక్కుమ్మడిగా అంతఃపురం లోకి అతి వేగంగా పరిగెత్తారు. విమల అంతఃపుర బహిర్ద్వారం వద్దకు చేరుకునే సరికి అక్కడి పహరా వాళ్ళంతా తప్పతాగి నిద్ర పోతున్నారు. ఆమె సునాయాసంగా కోట ద్వారాన్ని చేరుకున్నది.



అక్కడ మటుకు ఒక కావలావాడు పహరా ఉన్నాడు. వాడు విమలను చూసి, "ఎవరు నువ్వు? ఎక్కడికి పోతు న్నావు?" అన్నాడు.

అప్పటికి అంతఃపురంలో మహా పెద్ద కోలాహలంగా ఉంది. అన్ని ప్రాంతాల నుంచీ జనం అటు కేసి పరిగెత్తుతున్నారు. విమల పహరావాడితో, "ఇక్కడ ఉండి నువేం చేస్తున్నావు? ఆ గోల వినపడటం లేదూ? పద, వెళ్ళి రక్షించు!" అన్నది.

"ఏమిటి? ఏమయింది?"

"కోటలో మొగలులు జొరబడ్డారు. నవాబు ప్రాణాలు రక్షించు!"

కోటగుమ్మం వద్ద ఉన్నవాడు కూడా లోపలికి పరిగెత్తాడు. విమల నిశ్చింతగా బయటికి వెళ్ళిపోయింది. ముఖద్వారం దాటి కొంత దూరం వెళ్ళేసరికి ఆమె కొక చెట్టు కింద ఒక మనిషి నిలిచి ఉండటం కనబడింది. ఆమె అభిరామస్వామిని గుర్తించింది.

ఆయన విమలను చూస్తూనే, "నేను చాలా కంగారు పడ్డాను. కోటలో ఆ కోలాహల మేమిటి?" అన్నాడు.

"ఏమీ లేదు. నా వైధవ్యానికి ప్రతీకారం చేశాను. ఇక ఇక్కడ మనలేము, త్వరగా





ఆశ్రమానికి వెళ్ళిపోవాలి. తరవాత సంగతంతా చెబుతాను. తిలోత్తమ ఆశ్రమానికి చేరుతున్నది గదా?" అన్నది విమల.

"తిలోత్తమ అస్మాని వెంట ముందు నడుస్తున్నది. నువ్వు వాళ్ళను త్వరలోనే కలుసుకుంటావు."

ఇద్దరూ చురుకుగా నడుస్తూ త్వరలోనే ఆశ్రమాన్ని చేరుకున్నారు. వారి కన్న కొంచెం ముందుగా తిలోత్తమ అస్మాని వెంట వచ్చి చేరింది.

"ఈశ్వరానుగ్రహం వల్ల మీ రంతా దుర్మార్గుల బారి నుంచి బయటపడ్డారు. ఇక ఇక్కడ ఒక్క క్షణం కూడా ఉండరాదు. ముసల్మానులకు అమ్మాయి దొరికితే మనని ప్రాణాలతో వదలరు. ఈ రాత్రే మనం ఇక్కడి నుంచి వెళ్ళిపోవాలి," అన్నాడు అభిరామస్వామి......

విమల నవాబును గుండెల్లో పొడిచి పారిపోయిన కొద్ది సేపటికి ఒక రాజోద్యోగి గాభరాపడుతూ రాజగృహానికి వచ్చి జగతసింహుడితో, "యువరాజా, నవాబు చావు బతుకుల్లో ఉన్నారు. మిమ్మల్ని రమ్మంటున్నారు. త్వరగా రావాలి," అన్నాడు.

జగతసింహుడు నివ్వెరపోయి, "ఏమిటయింది?" అన్నాడు.



"ఎవరో శత్రువు అంతఃపురంలో ప్రవేశించి, నవాబును పొడిచి పారిపోయాడు. ఆయన వెంటనే చావలేదు గాని, మృత్యువు దగ్గరలోనే ఉన్నది. త్వరగా వెళ్ళకపోతే మించిపోవచ్చు," అన్నాడు ఉద్యోగి.

జగతసింహుడు వెంటనే బయలుదేరి వెళ్ళి, అవసాన దశలో ఉన్న శీతలాఖాన్‌ను చూశాడు. ఉస్మాన్, అయేషా, నవాబు సంతానమూ, భార్యలూ, అంతఃపుర స్త్రీలూ, మంత్రులూ, ఇతర అధికారులూ నవాబు చుట్టూ చేరి ఉన్నారు. అయేషా తండ్రి తల తన ఒడిలో పెట్టుకుని, నిశ్శబ్దంగా అశ్రువులు రాలుస్తున్నది.



జగత్‌సింహుడు వస్తుండగానే ఖ్వాజా ఈసా అనే మంత్రి అతన్ని చెయ్యి పట్టుకుని నవాబు సమీపానికి తీసుకువెళ్ళి, గట్టిగా, "యువరాజా జగత్‌సింహ వచ్చారు!" అని చెప్పాడు.

కతలూఖాన్ హీనస్వరంతో, "నేను శత్రువును. చనిపోతున్నాను. ఇప్పుడు నాకు విరోధ భావం లేదు," అన్నాడు.

"నాకూ లేదు." అన్నాడు జగత్‌సింహుడు.

"పిల్లలు పనివాళ్ళు...యుద్ధం వద్దు... సంధి..." అన్నాడు నవాబు. ఆయన దాహం అంటే ఆయెషా ఆయన నోట షర్బత్ పోసింది. నవాబు జగత్‌సింహుడి కేసి ఆశగా చూసి, అతనేమీ అనకపోయే సరికి, "సమ్మతం కాదా?" అన్నాడు.

"పఠానులు పాదుషా అధిపత్యానికి సమ్మతిస్తే నేను సంధియత్నం చెయ్యగలను." అన్నాడు జగత్‌సింహుడు.

నవాబు తలాడిస్తూ, అస్పష్టంగా, "ఒరిస్సా?" అన్నాడు.

"నా ప్రయత్నం సానుకూలమైతే మీ సంతతికి ఒరిస్సా దక్కుతుంది." అన్నాడు జగత్‌సింహుడు.

మరణ యాతనలో కూడా నవాబు ముఖం వికసించింది, "మీరు... స్వేచ్ఛ...



"దేవుడు... మీకు... శుభం... కలిగించాలి," అన్నాడాయన.

జగత్సింహుడు వెళ్ళిపోతూ ఉండగా ఆయన వంగి తన తండ్రి చెవిలో ఏదో చెప్పింది. నవాబు సంజ్ఞ గ్రహించి త్వరగా లేచి అతని వెనక వెళ్ళి, "నవాబు మీ కింకేదో చెబుతారట్లే ఉంది," అని పిలుచుకు వచ్చాడు.

వచ్చిన తర్వాత జగత్సింహుడితో "చెవిలో," అన్నారు నవాబు. ఆయన రహస్యం చెప్ప దలచినట్టు గ్రహించి చెవి ఒగ్గాడు జగత్సింహుడు. నవాబు అతి కష్టం మీద, మత్తు మత్తుగా "దాహం" అంటూ, ఒక్కొక్క మాటగా, తిలోత్తమను తండ్రి లేని దాన్నిగా చేసి తాను పాపం కట్టుకున్నానని, ఆమె నిష్కళంక అని చెప్పి, ఆయన పేరు ఉచ్చరిస్తూ ప్రాణాలు వదిలాడు.

జగత్సింహుడు కారాగార విముక్తి పొంది, తన తండ్రి ఉండే సైనిక శిబిరానికి వెళ్ళి, మొగలులకూ పఠానులకూ సంధి కుదిర్చాడు. ఒరిస్సాలో వారు స్వేచ్ఛగా పరిపాలన సాగించుకుంటూ, పాదుషా అధికారాన్ని శిరసావహించేటట్టుగా సంధి జరిగింది. ఉభయపక్షాలవారూ ఒకరి కొకరు పరిహారం చెల్లించుకున్నారు. ఇదంతా జరగటానికి కొంత కాలం పట్టింది.





మొగలు సేనలు గుజరాత వెళ్ళిపోవటానికి సిద్ధంగా ఉన్నాయి. ఒక నాటి మధ్యాహ్నం జగత సింహుడు సపరివారంగా నవాబు భవనానికి వెళ్ళి, ఉస్మాన్‌కూ, జ్వాలాఉన్నిసాకూ వెళ్ళి వస్తానని చెప్పి, ఆయనకు వీడ్కోలు చెప్పటానికని ఆమె గది దగ్గిరికి వెళ్ళి, ఆమె దర్శనం అర్థించాడు.

"యువరాజా, క్షమించాలి. నే నిప్పుడు నిన్ను కలుసుకోలేను," అని ఆమె అంటున్నట్టుగా కొజావాడు అతనితో చెప్పాడు. జగతసింహుడు నిరాశుడై తన శిబిరానికి బయలుదేరాడు. కోట ద్వారం



వద్ద అతనికి ఉస్మాన్ కనిపించాడు. అతనితో పాటు నడవసాగాడు.

"సేనాపతి, మీ కేదైనా కావలసినట్టయితే ఆజ్ఞాపించండి," అన్నాడు జగతసింహుడు ఎంతో గౌరవంగా.

"మీ పరివారాన్ని ముందు బయలు దేరి వెళ్ళనివ్వండి. ఆ తరవాత మీతో ఏకాంతంగా ఒక విషయం మాట్లాడాలి," అన్నాడు ఉస్మాన్.

జగతసింహుడు నిస్సంకోచంగా తన పరివారాన్ని ముందు వెళ్ళనిచ్చి తాను తన గుర్రం మీద వెనక ఉండిపోయాడు. ఉస్మాన్ కూడా తన నౌకరు చేత ఒక గుర్రాన్ని తెప్పించి దానిపై ఎక్కాక, ఇద్దరూ కలిసి నడవసాగారు.

ఉస్మాన్ ఒక దట్టమైన బూరుగు చెట్ల తోపు మధ్య ఉండే పాడుబడిన కోటకు దారి తీశాడు. ఇద్దరూ గుర్రాలు దిగి ఆ కోట ప్రవేశించారు. ఆ కోట మధ్య కొత్తగా తవ్విన గోతి ఒకటి ఉన్నది, కాని అందులో పూడ్చే శవం మట్టుకు లేదు. గోతి పక్కనే ఒక చితి పేర్చి ఉన్నది. దాని దగ్గిరా శవం లేదు.

"ఏమిటి ఇదంతా? చిత్రంగా ఉందే!" అన్నాడు జగతసింహుడు.



ఉస్మాన్ కోపావేశంతో అతన్ని కాలితో తన్ని, "యుద్ధం చెయ్యటానికి భయపడుతున్నావా? ఏమన్ని యోధుడివి?" అన్నాడు ఒగరుస్తూ.

జగత్సింహుడికి ఒళ్ళు మండి ఆవేశం వచ్చింది. అతను కింద పడిన తన కత్తిని తీసుకుని ఉస్మాన్ పైకి లంఘించాడు. అతని దెబ్బలకు ఉస్మాన్ ఉక్కిరి బిక్కిరి అయి కింద పడిపోయాడు. జగత్సింహుడు వాడి రొమ్ము మీద ఎక్కి కూర్చుని, అతని కత్తి లాగేసి ఉస్మాన్ కంఠం మీద నొక్కిపెట్టి, "ఏం? ఇప్పటికైనా యుద్ధదాహం తీరిందా?" అన్నాడు.

"నా ఒంట్లో ప్రాణం ఉండగా తగ్గదు." అన్నాడు ఉస్మాన్.

"నీ ప్రాణాలు తియ్యటానికి క్షణం పట్టదు, తెలుసా?"

"చంపెయ్యి. లేకపోతే నన్ను చంపే యత్నం మానను."

"బతికే ఉంటావు. నాకు నీ భయం లేదు. ఒకనాడు నా ప్రాణాలు కాపాడావు. ఇప్పుడు నీ ప్రాణాలు కాపాడుతాను."

జగత్సింహుడు ఉస్మాన్ రెండు చేతులు అతని కాళ్ళతో తొక్కిపట్టి, అతని వద్ద ఉన్న ఆయుధాలన్నీ లాగేసుకుని, తరవాత అతన్ని విడిచిపెట్టాడు. "పో, వెళ్ళిపో. నన్ను కాలితో తన్నావు. లేకపోతే నీ కింత అవమానం చేసి ఉండను." అన్నాడతను.

ఉస్మాన్ గుర్రం ఎక్కి తన కోట వేపు వెళ్ళిపోయాడు.

జగత్సింహుడు వాగు దగ్గిర తన గాయాలన్నీ కడుక్కుని తన గుర్రం దగ్గిరికి వచ్చేసరికి గుర్రం మెడకు ఒక ఉత్తరం కట్టి ఉన్నది. దాని పైన, "రెండు రోజుల దాకా చదవ వద్దు." అని ఉండటం చేత అతను ఉత్తరాన్ని తన కవచంలో దాచుకుని తన శిబిరానికి వెళ్ళాడు.

—(వచ్చే సంచికలో ముగింపు)






## 14

ఆ మర్నాడు జగత్‌సింహుడికి దూత ద్వారా ఆయిషా ఒక ఉత్తరం పంపింది. ఆ ఉత్తరంలో ఇలా ఉన్నది:

"రాజకుమారా, నిన్ను కలుసుకుని మాట్లాడలేకపోయాను. అందుకు కారణం ఉప్పొంగి నను దహించివేస్తున్న క్రోధమూ, బాధా. నిన్ను నేను చూడనందుకు నీవు ఆగ్రహించ వనుకుంటాను. అందుచేత నాకు కలిగిన బాధను గుండె రాయి చేసుకుని సహిస్తున్నాను. నే నిప్పు డీ ఉత్తరం రాస్తున్నది దేనికంటే, నేను నిన్ను ప్రేమిస్తున్నా నన్న విషయం మరిచిపొమ్మని చెప్పటానికి. నేను నీ ప్రేమ కోర దగినంత దాన్ని కాను. నేను నీకు అర్పించవలసిందేదో అదివరకే అర్పించాను. నీ నుంచి నే నేమీ కోరటం లేదు. నీకు మంచి రోజులు వచ్చినప్పుడు నాకు కబురుచెయ్యి. నీ కెప్పుడైనా తీరని దుఃఖం కలిగితే ఆయిషాను జ్ఞాపకం చేసుకుంటావుకదూ?

"నీ వీ దేశాన్ని విడిచిపెట్టి పోతున్నావు. పఠానులు శాంత స్వభావులు కారు. అందుచేత నీవు మళ్ళీ ఈ దేశానికి రావలిసి రావచ్చును. అప్పుడు నేను నీకు కనిపించను—దీర్ఘంగా ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాను. నీకు వివాహం జరిగే పక్షంలో నాకు ముందుగా కబురు చేస్తే నేను దగ్గిర ఉండి నీ వివాహం జరిపిస్తాను. నీ కాబోయే భార్యకోసం మంచి ఆభరణాలు చేర్చి

బంకించంద్ర చట్టోపాధ్యాయ



ఉంచాను. అవకాశం దొరికినప్పుడు వాటిని నేనే నీ వధువుకు స్వయంగా అలంకరిస్తాను. అయిషా చనిపోయిందని తెలిసినప్పుడు నీ వీ దేశానికి రావాలని నా కోరిక. నీ కోసం చందనపు పెట్టెలో దాచి ఉంచిన వాటిని దయతో స్వీకరించ ప్రార్థన. ఇంకేమి రాయను? నన్ను జ్ఞాపకం చేసుకున్నప్పుడు నీకు బాధ కలగకుండా ఉండుగాక!
—అయిషా."

ఈ ఉత్తరానికి జగతసింహుడు ఇలా జవాబు రాశాడు.

"అయిషా, నీవు స్త్రీలలో రత్నం వంటి దానివి. నీ ఉత్తరానికి నే నిప్పుడేమీ



జవాబు రాయలేను. అందుకు నేను చాలా బాధపడుతున్నాను. నన్ను మరవ వద్దు. బ్రతికి ఉంటె ఒక సంవత్సరం అనంతరం నీకు జవాబు రాస్తాను."

ఈ ఉత్తరం ఇచ్చి జగతసింహుడు అయిషా దూతను పంపేశాడు.

మొగలులతో పఠానులతో సంధి జరిగినాక వీరేంద్రసింహుడి భార్యా, కుమార్తె, వారితో బాటు అభిరామస్వామి, ఉస్మాని ఏమయారో ఎవరికీ తెలియరాలేదు. వారిని వెతికించటానికి మానసింహ మహారాజే గాక, ఉస్మాన్, ఖ్వాజా ఈసాలు కూడా ఎంతో ప్రయత్నించి విఫలులయారు.

చివరకు మానసింహ మహారాజు మందారణ దుర్గంలో విశ్వాసపాత్రుడైన తన మనిషి నొకణ్ణి ఉంచి, విమలా తిలోత్తమల జాడ తెలియగానే వారికి మందారణ అప్పగించి రావలసిందని చెప్పి తన సైనిక శిబిరాన్ని ఎత్తివేసే పని ప్రారంభించాడు.

సేన రేపు ప్రయాణమై పోతుండగా జగతసింహుడు బూరుగుచెట్ల తోపులో తన గుర్రం మొతలో లభించిన ఉత్తరాన్ని తీసి చదివాడు. అందులో ఇలా ఉంది:

"ధర్మం పాటించి అయినా సరే, బ్రాహ్మణ శాపానికి వెరచి అయినా సరే





"ఈ ఉత్తరాన్ని చూడగానే తిరిగి ఇక్కడికి రా! నే నొక బ్రాహ్మణ్ణి."

ఈ ఉత్తరాన్ని చూసి జగత్సింహుడు, ఆశ్చర్యపడ్డాడు. తరవాత శత్రువుల పన్నాగమా అని శంకించి, చివరకు ఆ పాడుపడిన కోటకు వెళ్ళాలనే నిశ్చయించుకున్నాడు. అతను తన మనుషులతో, "నేను సమయానికి తిరిగి రాకపోతే నా కోసం ఆగకుండా బయలుదేరి నడవండి. నేను మిమ్మల్ని దారిలో కలుసుకుంటాను," అని చెప్పాడు.

అతను తిరిగి ఆ పాడుపడిన కోటకు చేరేసరికి అక్కడ గోరీ, చితి అలాగే ఉన్నాయి. అయితే చితి మీద ఒక బ్రాహ్మణుడు కూర్చుని దుఃఖిస్తున్నాడు.

"నన్ను ఇక్కడికి రమ్మన్నది మీరేనా?" అని జగత్సింహుడు అడిగే సరికి ఆ బ్రాహ్మణుడు తల ఎత్తి చూశాడు. జగత్సింహుడు అభిరామస్వామిని గుర్తించి, "మీ రెందుకిక్కడ కూర్చున్నారు? దుఃఖిస్తున్నా రెందుకు?" అని అడిగాడు.

"నిన్నెందుకు రమ్మన్నానో అందుకే దుఃఖిస్తున్నాను. తిలోత్తమ చనిపోతున్నది," అన్నాడు అభిరామస్వామి.

జగత్సింహుడు కళ్ళ ముందు ఒక్కసారిగా అనేక దృశ్యాలు మెదిలాయి. తాను



ఆమెను మొట్టమొదట శైలేశ్వరాలయంలో చూసినది మొదలుకొని, తాను కారాగారంలో ఆమెతో క్రూరంగా మాట్లాడినదాకా జరిగిన సంఘటన లన్నీ జ్ఞాపకం వచ్చి అతని హృదయంలో ప్రేమ పొంగి పొర్లసాగింది.

"విమల నవాబును చంపినాక నేను నా కూతురిని, మనమరాలిని వెంటబెట్టుకుని తిరుగుతూ, మారువేషాలతో అజ్ఞాతంగా మసలుతూ నానా అవస్థలూ పడ్డాను. అదే తిలోత్తమ వ్యాధికి ఆరంభం కూడా. ఆమె రోగానికి కారణం నీకు తెలిసే ఉంటుంది. నాకు చాలా ఔషధాలు తెలుసు, కాని ఈ వ్యాధి మందులతో పోయేది కాదు.





అయిదు రోజులుగా అక్కడే ఉంటున్నాను. ఒకనాడు నువ్విక్కడికి రావని తలంపుగా రావటం చూసి, ఈ గుర్రం మెడలో చీటీ కట్టాను. తిలోత్తమకు ప్రాణాపాయం కలిగే పక్షంలో నిన్నూ ఆమెనూ ఒకసారి సమావేశ పరచాలని అనుకున్నాను. అప్పటికింకా ఆమె పరిస్థితి నిరాశాకరంగా లేదు. అందుకని నీకు రెండు రోజులు గడువు పెట్టాను. ఇక తిలోత్తమ జీవించే ఆశ లేదు. ఆమె జీవన దీపం ఆరటానికి సిద్ధంగా ఉంది," అంటూ అభిరామస్వామి ఏడవసాగాడు. ఆయనతో బాటు జగతసింహుడు కూడా దుఃఖించాడు.

అభిరామస్వామి అతనితో, "ఒక్కసారిగా నువ్వామె ఎదట పడటం మరింత ప్రమాదం. నువ్వు వచ్చావని ఆమెకు ముందుగా చెప్పి నీకు కబురు చేస్తాను. అప్పుడు నువ్వు రా," అన్నాడు. ఆయన పాడుపడిన కోట లోపలికి వెళ్ళి కొంచెం సేపట్లో తిరిగి వచ్చి, అతన్ని రమ్మన్నాడు.

లోపల ఒక గదిలో మంచం మీద తిలోత్తమ కళ్ళు మూసుకుని పడుకుని ఉంది. విమల వితంతువు వేషంలో పక్కన కూర్చుని ఆమె శరీరాన్ని రాస్తున్నది.

జగతసింహుడు తిలోత్తమ మంచం దగ్గిరికి వెళ్ళి నిలబడ్డాడు.

"తిలోత్తమా, జగతసింహుడు వచ్చాడు," అని గట్టిగా కేకపెట్టాడు అభిరామస్వామి. తిలోత్తమ కళ్ళువిప్పి జగతసింహుణ్ణి కొంతసేపు చూసి దృష్టి మరల్చుకున్నది. ఆమె కళ్ళవెంట అశ్రుధారలు వెలువడ్డాయి. వాటిని చూస్తూ ఉద్రేకం చెంది జగతసింహుడు తిలోత్తమ కాళ్ళ దగ్గిర కూర్చుని తన కన్నీటితో ఆమెను తడపసాగాడు...

రోజులు గడిచిపోయాయి. అహోరాత్రాలు జగతసింహుడు తిలోత్తమ మంచం దగ్గిరే ఉంటూ ఆమెకు సమస్తోపచారాలూ చేస్తున్నాడు. సేన ఏమయిందో, శిబిరం



"ఆమాట నాకు కొంచెం కూడా నచ్చ లేదు. రాజకుమారుడి దగ్గిర నా ప్రస్తావన ఎన్నడూ తేవద్దు. తేనని మాట ఇయ్యి." అన్నది ఆయెషా. తనని గురించి ఆలోచించి నప్పుడు జగత్సింహుడికి తప్పక బాధ కలుగుతుం దనుకునే ఆమె అలా అన్నది.

తిలోత్తమ ఆమె కోరిన దానికి సమ్మ తించింది.

"కాని నువ్వు నన్ను మరిచిపోగూడదు. నా జ్ఞాపకార్థం నే నిచ్చే వస్తువులను నీ వద్ద పెట్టుకుంటూ ఉంచుకో." అని ఆయెషా దాసిని పిలిచి, ఒక దంతపు పెట్టె తెప్పిం చింది. దాని నిండా రత్నాభరణాలు ఉన్నాయి. ఆయెషా స్వయంగా వాటిని తిలోత్తమకు పెట్టింది. తిలోత్తమ కూడా ధనికుల ఇంటి ఆడపడుచే గాని అలా మెరిసే రత్నాలనూ, అంత పనితనం గల నగలనూ ఆమె ఎన్నడూ చూసి ఉండకపోవటం చేత ఆశ్చ ర్యం చెందింది. నిజానికి ఆ ఆభరణాలన్నీ ఆయెషాకు ఆమె తండ్రి ఇచ్చినవి. ఆమె వాటి నన్నిటినీ మార్పించి చేయించి, తిలో త్తమ కిచ్చే ఉద్దేశంతో దాచి ఉంచింది.

తిలోత్తమ వాటిని మరీ మరీ పొగడు తూండటం చూసి ఆయెషా, "చెల్లీ, వీటిని ఎందుకంతగా మెచ్చుకుంటావు? నీ హృద



యంలో ఉండే రత్నాభరణం ముందు ఇవి ధూళితో సమానం గద!" అన్నది. అంటూనే ఆమె కళ్ళ వెంట అశ్రువులు కార్చి కళ్ళు తుడుచుకున్నది.

ఆమె దుఃఖానికి కారణ మేమిటో తిలోత్తమకు తెలియలేదు.

అలంకరణ పూర్తి చేసి ఆయెషా తిలోత్తమ చేతులు రెండూ పట్టుకుని ఆమె ముఖాన్ని తిలకిస్తూ, "ఈ ముగ్ధ సుందరి ముఖం చూసి నా ప్రాణేశ్వరుడికి మనః క్లేశం ఎన్నటికీ కలగబోదు!" అనుకున్నది. ఆమె తిలోత్తమతో, "చెల్లీ ఇక నేను వెళ్ళి వస్తాను. నీ భర్తకు చెప్పి ఆయన పని

పాడుచెయ్యటం నా కిష్టం లేదు. దేవుడి దయవల్ల మీరు పది కాలాలపాటు సుఖంగా ఉండాలి! నే నిచ్చిన అలంకారాలను ఎల్లప్పుడూ ధరిస్తూ ఉండు. నన్ను మాత్రం మరిచిపోకు. నీ హృదయరత్నాన్ని నిర్మలంగా ఉంచుకో!" అన్నది.

ఆమె కంఠం గద్గదం కావటమూ, ఆమె కళ్ళ నిండా నీరు నిండటమూ తిలోత్తమ గమనించింది; "అక్కా, నువ్వు ఏడుస్తున్నావెందుకని?" అంటూ తాను కూడా ఏడుపు గొంతు పెట్టింది.

ఈ మాటతో అయుపా కళ్ళవెంట కన్నీరు ధారగా కారసాగింది. ఆమె అక్కడ ఒక్క క్షణం కూడా ఉండలేక గబగబా వెళ్ళి తన పల్లకీలో ఎక్కేసింది.

అయుపా తన ఇంటికి చేరే సరికి రాత్రి ఎంతో లేదు. ఆమె తన దుస్తులు విప్పేసి మామూలు వస్త్రాలు ధరించి, చల్ల గాలి కోసం కిటికీ వద్దకు వెళ్ళి అక్కడ నిలబడింది. ఆకాశాన అనంతమైన నక్షత్రాలు ధగధగా ప్రకాశిస్తున్నాయి. కిటికీ కింద కోట చుట్టూ ఉన్న అగడ్తలో ఆకాశం ప్రతిబింబిస్తున్నది.

అయుపా కిటికీలో కూర్చుని ఏమి ఆలోచిస్తున్నదీ ఊహించటం కష్టం. ఆమె తన వేలి నుంచి ఒక ఉంగరం తీసింది. ఆ ఉంగరంలో విషం ఉన్నది. అది హాలాహలం లాటి విషం.

"ఈ విష రసాన్ని తాగితే నా తృష్ణ యావత్తూ ఒక్క క్షణంలో నశిస్తుంది," అనుకున్నదామె; కాని మరు క్షణమే, "అందుకేనా భగవంతుడు నన్ను సృష్టించి ఈ ప్రపంచంలోకి పంపింది? ఈ కాస్త బాధనే సహించ లేకపోతే నా స్త్రీ జన్మ ఎంత నిరర్థకం? అదిగాక జగత్ సంహారుడికి తెలిస్తే ఆత నేమనుకుంటాడు?" అనుకుని అయుపా ఆ ఉంగరాన్ని అగడ్తలోకి గిరాటు వేసింది. —(అయిపోయింది)





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

స్వాతంత్ర్య భారతానికి మరొక ఏడు నిండుతున్నది. స్వతంత్ర భారత చరిత్రలో నెహ్రూశకం ముగిసి, ఇప్పుడు లాల్‌బహదూర్‌శాస్త్రి శకం నడుస్తున్నది.

జరుగుతున్న చరిత్ర ఇలా ఉంటే జరిగిన చరిత్రను "చందమామ" పాఠకులు భారతచరిత్రలో దక్కను ప్రాంతం మొగలుసామ్రాజ్యంలో చేరడం గురించి, నెహ్రూకథలో భారత జాతీయ సమరం తొలి ఉద్యమం గురించి చదువుతారు.

ఈ సంచికలో "ఉత్తరకాండ" [రామాయణం] ఆరంభ మవుతున్నది. అలాగే "నవాబునందిని" కూడా ఆరంభ మవుతున్నది. ఇందులో దుర్గేశనందిని అనంతర కథ ఉన్నది. దీనిని రచించినవాడు దామోదర ముఖర్జీ.

సంపుటి : 37 - ఆగస్టు 1965 - సంచిక : 2





# నవాబు నందిని

మందారణ దుర్గం తిరిగి ఎప్పటిలాగే ఉన్నది. దాని పక్కన మామిడితోటా, దుర్గం కిందుగా ప్రవహించే దామోదరనది పూర్వం ఉండినట్టే ఉన్నాయి. ఆ కాళ రాత్రి విమల చేసిన పొరపాటు వల్ల పఠానులు దుర్గంలో ప్రవేశించి ఎంత భీభత్సం చేశారు! ఎంత కోలాహలం! ఎంత రక్తపాతం! ఆ రాత్రే దుర్గేశుడైన వీరేంద్రసింహుడు పఠానులకు బందీగా దొరికాడు; తన ప్రియురాలైన తిలోత్తమను ఒక్కసారి చూసి పోదామని వచ్చిన జగతసింహుడు దాదాపు ప్రాణం పోయిన దాకా పోరాడి, చివరకు శత్రువులకు చిక్కాడు; వీరేంద్రసింహుణ్ణి శత్రువులు చంపేశారు; విమల పఠానులకు నవాబైన కతలూఖాన్‌ను చంపి పగ తీర్చుకున్నది. ఎన్నో విపరీతమైన సంఘటనలు కొద్ది రోజుల వ్యవధిలో జరిగి పోయాయి.

కాని అప్పుడు వాటి చిహ్నాలేవీ లేవు. మందారణ దుర్గం ఎప్పటి లాగా మనోహరంగా, ప్రశాంతంగా ఉన్నది. మార్పల్లా ఏమిటంటే వీరేంద్రసింహుడు లేడు; విమల అప్పుడు వితంతువు. నిజానికి విమల ఏం సుఖపడింది? తాను ప్రేమించిన భర్త వద్ద భార్యగా ప్రవర్తించటానికి ఆమె నోచుకో లేదు, అతని ఇంటి పరిచారికగా మసలు కున్నది. చివరకా భర్త కూడా పోయాడు. కాని విమలకు తృప్తి కలిగించే విషయాలు లేకపోలేదు. తన భర్తను చంపిన కిరాతకుణ్ణి, కతలూఖాన్‌ను తన చేత్తో పొడిచి

దామోదర ముఖర్జీ



చంపింది. విమలకు మరొక సంతోష కారణం కూడా ఉన్నది: తాను గారాబంగా పెంచి పెద్దచేసిన తిలోత్తమ-తన పెంపుడు కూతురు—రాజా మానసింహుడికి కోడలయింది; ఆమె గర్భవాసాన పుట్టే కొడుకు అంబరు రాజవుతాడు! ఇది తక్కువ సంగతా?

తిలోత్తమకు కూడా విచార కారణా లున్నాయి. ఆమె తన తండ్రిని పోగొట్టుకున్నది; పాపపూరితమైన కతలూఖాన్ విలాస గృహంలో బందీగా ఉన్నది—అలాటి దుర్గతి పట్టిన వారెవరూ తమ మానాన్ని రక్షించుకుని బయట పడలేదు.

కాని తిలోత్తమ ఎలాటి కళంకమూ కలగకుండా ఆ పాపకూపం నుంచి బయట పడగలిగింది; అది ఒక సంతోష కారణం. అలాగే, ఆమె ప్రియుడైన యువరాజు జగతసింహుడు మృత్యుముఖం నుంచి బయట పడటం మరొక సంతోష కారణం. అన్నిటినీ మించిన సంతోష కారణం తిలోత్తమ జగతసింహుడికి భార్య కావటం.

పఠానులు ఓడిపోయాక మానసింహ మహారాజు మందారణ దుర్గం వీరేంద్ర సింహుడి భార్య అయిన విమలకూ, కుమార్తె అయిన తిలోత్తమకూ చెందేలాగు ఆజ్ఞ ఇచ్చాడు.

జగతసింహుడికీ, తిలోత్తమకూ వివాహమై ఇంకా పూర్తిగా నెల కాలేదు. అపరాహ్ణం వేళ అంతఃపురం పై భాగాన జగతసింహుడు ఏదో ఆలోచనలో మునిగి ఉండి అటూ ఇటూ పచారు చేస్తున్నాడు. అతని ఆలోచనకు కారణం ఉన్నది. దారుకేశ్వరనది తీరాన శిబిరం ఏర్పాటు చేసుకుని సైన్యంతో సహా ఉంటూ వచ్చిన మానసింహుడు, పఠానుల అల్లరి అణిగారిపోగానే శిబిరం ఎత్తేసి పాట్నాకు వెళ్ళిపోయాడు. ఆ సమయంలో జగతసింహుడు శిబిరానికి వెళ్ళి తన తండ్రిని కలుసుకోలేదు. ఇప్పు



అతనికి వేరే పని ఏదీ లేని కారణం చేత తన భార్యతో కలిసి సుఖ సముద్రంలో ఓలలాడుతున్నారు.

కొద్ది సేపటికి అత నున్న చోటికి తిలోత్తమ వచ్చింది. వారు ప్రేమసల్లాపా లాడుకుంటూ తమ ఇద్దరిలో ఎవరిది ఎక్కువ అదృష్ట మనే విషయమై తర్కించుకున్నారు. తనదే ఎక్కువ అదృష్ట మని జగతసింహు డంటే తనదే హెచ్చు అదృష్ట మనటానికి తిలోత్తమ కారణాలు చెప్పింది. జగతసింహుడు అంబరురాజు కొడుకు; అందం లోనూ, శౌర్య పరాక్రమాల లోనూ సాటిలేనివాడు; తాను ఒక చిన్న భూస్వామి కుమార్తె, అతనికి పాదదాసిగా ఉండటానికి తగనిది.

అంతతో పోనివ్వక తిలోత్తమ తన కోసం జగతసింహుడు చేసిన సాహసాలను ఏకరువు పెట్టింది; "వీరాధివీరులై ఉండి కూడా నన్నొక సారి చూడా లన్న కోరికతో అర్ధ రాత్రి వేళ దొంగ లాగా దుర్గంలో ప్రవేశించారు. నాతో రెండు మాటలు మాట్లాడటం కోసం పరాయి వాళ్ళ అంతఃపురంలో ప్రవేశించారు. నా ప్రాణాన్ని కాపాడటం కోసం మీ రక్తం ధారపోసి, ప్రాణా లర్పించటానికి కూడా సిద్ధపడ్డారు. నన్ను పెళ్ళాడి, నా ప్రేమ కోసం మీ తండ్రిగారి ఆగ్రహానికి కూడా మిమ్మల్ని మీరు గురి చేసుకున్నారు," అన్నది.

తిలోత్తమ మానసింహుడి ఆగ్రహం గుర్తు చెయ్యగానే జగతసింహుడు కలవర పడ్డాడు. "ఇది చాలా పెద్ద సమస్య. దీన్ని గురించి ఏం చెయ్యాలో ఆలోచించాలి," అన్నా డతను.

తిలోత్తమ ఈ మాటలు విని ఏమీ అన లేకపోయింది. ఆమె ముఖం ముడుచుకు పోయింది.

"మా నాన్నకు నా పైన కోపం ఉన్నది. అది నాకు తెలుసును. ఆయన తన కోపాన్ని



పైకి ప్రకటించలేదు, ఇతరుల ద్వారా చెప్పించనూ లేదు. అయినప్పటికీ ఆయ నకు కోపం వచ్చిందనటానికి లక్ష్య సూచన లున్నాయి," అన్నాడు జగతసింహుడు.

"అయితే మీరు జాగ్రత్తపడ రెందుకూ?" అని తిలోత్తమ అడిగింది.

"జాగ్రత్తా? ఎంత అమాయకురాలివి! నీ ప్రేమలో ఓలలాడే వాడు మృత్యువు ఎదట వచ్చి నిలబడితే మాటుకు లక్ష్య పెడ తాడా? నేను జాగ్రత్త గురించి ఆలోచించటమే లేదు," అన్నాడు జగతసింహుడు.

"అయితే ఏమి టాలోచిస్తున్నారు?" అని ప్రశ్నించింది తిలోత్తమ.

"రెండు విషయాలను గురించి ఇప్పు డాలోచించాలి. మా నాన్న రాజపుత్ర వీరుడు. చెయ్య దలచిన పనిని వాయిదా వెయ్యడు. ఆయనను అర్థైనా చెపటూ లేదు. అక్కరు పొదుపారేసే ఆయన మనసు కని పెట్టిపోతా ఉంటే ఇంక ఇతరుల సంగతి చెప్పే దేమిటి? అందుచేత ఆయన నాకు మరణ శిక్ష విధించినా దానికి తిరు గుండదు... భయపడకు, నాకు చావుభయం లేదు. రాజపుత్రుడికి మరణ భయం లేదు. కాని మరణం వల్ల కలిగే వియోగ బాధ గురించే నాకు భయం," అన్నా డతను.

"వియోగ భయం నా కేమీ లేదు. వీరుల లాగే వీరపత్నులు కూడా నవ్వుతూ ప్రాణాలు విడవగలరు," అన్నది తిలోత్తమ.

"సరే, ఆ భయం లేదనుకుందాం. అంతకన్న పెద్ద భయం మరొక టున్నది. మా తండ్రి నా ప్రాణం ఒక్కమారుగా తీయక, అంతకన్న కఠోరంగా నన్ను తీవ్ర మైన యాతనకు గురి చెయ్యవచ్చు."

"అదెలా?" అన్నది తిలోత్తమ కంపిస్తూ.

"మన వివాహం ఇష్టంలేక మన ఇద్ద రినీ ఆయన వేరు చేసెయ్యవచ్చు."

ఈ మాట విని తిలోత్తమ కళ్ళనీరు కారుస్తూ, "నా మారుతల్లి విమల శాస్త్రో



క్తంగా మా తండ్రిని వివాహం చేసుకుని కూడా, మా ఇంట దాసీగా కాలం పుచ్చింది. మామగారింట నా కటువంటి స్థానమైనా దొరకదా?" అన్నది.

"భయపడకు, తిలోత్తమా. అకారణంగా నీ మనస్సును క్షోభపెట్టుకోకు. అంత దాకా వస్తే మనం మానవ సమాజాన్ని విడిచి పెట్టేసి, ఎక్కడో సముద్ర తీరాన, ఏ చెట్టు నీడనో సుఖంగా కాపురం చేద్దాం. అయినా మా తండ్రి తలుచుకుంటే ఆయన చెయ్యి లేని దంటూ ఉండదు. అందుచేత ఆయనను సుముఖుణ్ణి చేసుకోవటానికి అన్ని విధాలా ప్రయత్నిస్తాను. ఆ పైన దేవు డున్నాడు!" అన్నాడు జగతసింహుడు.

"ఏ దారీ లేకపోతే మరణం ఉండనే ఉన్నది," అన్నది తిలోత్తమ గుండె రాయి చేసుకుని.

ఆ రాత్రి ఆ భార్యాభర్తలకు విచారం మూలాన, ఎంత ప్రయత్నించినా కునుకు పట్టలేదు. చివరకు తెల్లవారుజామున తిలోత్తమ కళ్ళు మూసి నిద్రపోయింది. జగతసింహుడు ఆమెకు నిద్రా భంగం కలగకుండా పక్కమీది నుంచి లేచి, చల్లగాలికి గుర్రం మీద తిరిగి వచ్చి కొంత శాంతి పొందుదా మనుకున్నాడు.



అతను తన తెల్ల గుర్రం ఎక్కి కోట ద్వారం దాటివచ్చి వెనక్కు తిరిగి చూశాడు. తిలోత్తమ శయన మందిర గవాక్షం వద్ద నిలబడి అతన్ని చూస్తున్నది. "లోపలికి వెళ్ళు. నే నిప్పుడే వస్తాను," అని చేతితో సైగ చేసి, జగతసింహుడు గుర్రాన్ని ముందుకు నడిపించాడు. కొద్ది దూరం పోయి వెనక్కు తిరిగి వద్దామని అతని సంకల్పం.

ఆ నాటి భయంకరమైన రాత్రి అతను విమల తెచ్చిన ఖడ్గంతో ఒక పఠాను వాణ్ణి చంపిన మామిడితోట కుండా అతను పోతూ ఉంటే గణపతి విద్యాదిగ్గజుడు—"రసిక రాజు" కనిపించాడు. అతని వేషం కొంత



హిందువులది గానూ, కొంత ముసల్మానులది గానూ ఉన్నది. అతను జగతసింహుణ్ణి చూసి, "ఖుదా నారాయణుడు మీకు మేలు కలిగించుగాక!" అన్నాడు.

"గణపతి విద్యాదిగ్గజుడా!" అన్నాడు జగతసింహుడు ఆశ్చర్యంతో.

"ఔను, స్వామీ. వెనక వ్యాకరణం మొదలైనవి నేర్చాను. ఇప్పుడు ఉర్దూ కూడా నేర్చుకున్నాను. ఇక నా ఖ్యాతికి ఢోకా ఉండదు," అన్నాడు దిగ్గజుడు.

"ఈ వేష మేమిటి?"

"ఆ పాయ్యే పఠానులు ఊరికే పోక నా జుట్టు, నా వేషమూ కూడా మార్చేసి మరీ పోయ్యారు. నేను మా గురువుగారి దగ్గిరికి వెళ్ళి పాఠం చెప్పమంటే, మూడు రోజులు గంగా తీరాన ఉండి, గంగా స్నానం చేసి, తల గొరిగించి, పిలక పెట్టుకుని వస్తేనే గాని పాఠం చెప్ప నన్నాడు. అలాగే చేసి వస్తున్నాను."

"మరి దుస్తులు?"

"ఏం చెయ్యను? నా బట్టలన్నీ పఠానులు లాగేశారు."

జగతసింహుడు దిగ్గజుడి చేతిలో ఒక రూపాయి పెట్టి, ముందుకు పోయాడు. అతను కొంత దూరం పోయే సరికి దూరంగా శైలేశ్వర మందిరం కనిపించింది. శైలేశ్వరుడి దర్శనం చేసుకుని, నమస్కారం చేసి రావటానికి అతడు నిశ్చయించుకున్నాడు.

అంతలో గుర్రపు డెక్కల చప్పుడు వినిపించింది. దూరంగా గాలిలోకి దుమ్ము లేస్తున్నది. ఎవరో సైనికుల లాగున్నారు. వాళ్ళు పఠాను సైనికులు కావటానికి వీల్లేదు. పఠానులందరూ ఖరీస్సారు వెళ్ళిపోయారు. దేశంలో సైనికు లంటూ ఉంటే వాడు పాదుషా సైనికుడే.

త్వరలోనే అతను సైనికులను చూశాడు. వారు మానసింహుడి సైనికుల లాగా ఉన్నారు. సుమారు యాభై మంది ఉన్నారు.

వారి ముందు నడుస్తున్న నాయకుడు ఆజ్ఞా
పించే సరికి సైనికులు అందరూ గుర్రాలు
నిలిపి ఒరల నుంచి కత్తులు దూసి భుజాల
పై పెట్టుకుని, "అక్బరు పాదుషాకు
జయం! రాజా మానసింహుడికి జయం!"
అని నినాదాలు పలికారు.

జగతసింహుడు కూడా కత్తి తీసి, అలాగే
నినాదాలు పలికి, సైనికుల నాయకుణ్ణి,
"ఇదేమిటి, మథ్రాసింగ్? పాదుషా వారికి
కుశలమా? మహారాజాగారు కులాసాగా
ఉన్నారా?" అని అడిగాడు.

మథ్రాసింగు యువరాజును సమీపించి,
ఒక రుమాలు నుంచి ఒక పత్రం తీసి,
సవినయంగా అతనికి అందించాడు.

"ఏమిటి మహారాజాగారి ఆజ్ఞ?" అని జగత
సింహుడడిగాడు.

"నేను తమ దాసుణ్ణి. నన్ను క్షమిం
చాలి. మహారాజాగారు తమర్ని ఉన్న
పాళంగా తీసుకు రమ్మని ఆజ్ఞాపించారు."

"ఎక్కడికి వెళ్ళాలి?"

"పాట్నాకు. అక్కడే ఉన్నారు మహా
రాజాగారు."

"ప్రయాణసన్నాహ మేమైనా చేసుకో
వచ్చునా?"

"క్షమించాలి, యువరాజా. మీరు
మా వెంట వెంటనే బయలుదేర నట్టయితే



బందీగా తీసుకురమ్మని మహారాజుగారి ఆజ్ఞ!" అన్నాడు ముత్థాసింగు.

"అయిన వారితో చెప్పి రావటానికైనా అవకాశం లేదా?"

"నన్ను క్షమించాలి."

"మహారాజుగారి ఆజ్ఞకు తిరుగు లేదనుకో... అయినా, ఒకవేళ నేను నీకు బందీ కావటానికి నిరాకరించి యుద్ధానికి తలబడితే ఏం చెయ్యమన్నారు మహారాజుగారు?"

"నా నోట అనరాని మాట అనిపిస్తున్నారు..., యువరాజును సజీవంగా గాని, నిర్జీవంగా గాని తెచ్చి తమ ఎదట ఉంచమని మహారాజుగారి ఆజ్ఞ!"

తన తండ్రి వైఖరి తాను భయపడినంత తీవ్రంగానూ ఉన్నదని జగతసింహుడు గ్రహించాడు. తాత్సారం చేసి ప్రయోజనం లేదు, తండ్రి ఎదటికి పోయి దండన పొందటం తప్ప వేరు మార్గం లేదు.

అతను ముత్థాసింగుతో, "నా సైన్యం దారుకేశ్వర నది తీరాన జహనాబాదు దగ్గిర ఉన్నది. దాని గతేమిటి?" అన్నాడు.

"దాని విషయమై నేను ఏర్పాటు చేస్తాను," అని ముత్థాసింగు ఒక సైనికుణ్ణి జహనాబాదుకు వెళ్ళమన్నాడు. ఆ సైనికుడు మందారణ మీదుగానే వెళ్ళాలి.

జగతసింహుడు ఆ సైనికుడితో, "నీకు మందారణ దుర్గ ప్రాంతంలో ఎవరైనా కనిపిస్తే, నేను మా తండ్రిగారి ఆజ్ఞపై ఆయనను చూడటానికి పోతూ వెళ్ళానని చెప్పు," అన్నాడు.

తరవాత అతను తన తండ్రి పంపిన అశ్వికుల వెంట బయలుదేరాడు. అతని కోరిక ప్రకారం ముత్థాసింగు తన సైనికులను రెండు భాగాలు చేశాడు. వెనకా, ముందూ సైనికులు నడుస్తుంటే, మధ్యగా జగతసింహుడు నడిచాడు, అతని పక్కగా ముత్థాసింగు నడిచాడు. —(ఇంకా వుంది)





# నవాబు నందిని

## 2

మానసింహుడి దృష్టిలో జగత్‌సింహుడు చేయరాని పనులు, ఒకటీ, రెండూ కాదు, అనేకం చేశాడు.

అనేకమంది యోధుల సమక్షాన జగత్‌సింహుడు తండ్రి ఎదట నిలబడి, అయిదు వేల సైన్యాన్ని ఇచ్చినట్టయితే, పఠానులను సువర్ణరేఖానది అవతలికి తరిమేస్తానని ప్రమాణం చేశాడు. అంత కార్యభారం నెత్తి మీద వేసుకున్నవాడు ఆ పని విడిచి పెట్టి, అర్ధరాత్రివేళ తన ప్రియురాలిని వెతుక్కుంటూ మరొకరి కోటలోకి దొంగలాగా ప్రవేశించి, పఠానులకు చిక్కి, బందీ అయ్యాడు. ఈ విధంగా అవిధేయుడూ, అయోగ్యుడూ అని నిరూపించుకున్న కొడుకు పైన మానసింహుడికి ఎక్కడలేని ఆగ్రహం పుట్టుకొచ్చింది.

ఆ కోపం మూలానే ఆయన పఠానులను నిర్మూలించి, తన కొడుకును విడిపించుకునే ప్రయత్నం కూడా చెయ్యలేదు.

విమల చేత చచ్చే ముందుగా కతలూఖాన్ జగత్‌సింహుణ్ణి విముక్తుణ్ణి చేసి, మానసింహుడి వద్దకు సంధి రాయబారం పంపాడు. కొడుకు తెచ్చిన సంధి రాయబారానికి మానసింహుడు సుముఖుడయ్యాడు. ఎందుకంటే, ఆయన శీఘ్రంగా ఢిల్లీకి వెళ్ళవలసిన పని ఉన్నది; వర్షాకాలం గడిస్తేనే గాని సయ్యద్‌ఖాన్ తన సేనలను తీసుకుని వచ్చి చేరడు. పెద్ద



ఎత్తున యుద్ధం కన్న సంధే మేలు. సంధికి మానసింహుడు ఒప్పుకోగానే, కొత్త నవాబు షంషేర్‌ఖాన్, తన మంత్రి తోనూ, సేనా నాయకుడైన ఉస్మాన్‌ఖాన్ తోనూ వచ్చి మానసింహుడికి పెద్ద ఎత్తున కానుకలు సమర్పించాడు. మానసింహుడు దానితో తృప్తిచెంది, వచ్చిన వారిని తగినరీతి సత్కరించి పంపేశాడు. ఆయన తన మొగలాయీ సైన్యాలను పాట్నాకు వెళ్ళిపోవలసిందని ఉత్తరువు ఇచ్చినప్పుడు, ఆ సైన్యానికి చెందిన ఒక సేనాపతి అయిన తన కొడుక్కు ఎలాటి బాధ్యతా ఇవ్వలేదు. జగత్తు గురించి విచారణ జరిపామన్న భావం అప్పటికే మానసింహుడికి ఉండింది.

ఆ పైన జగతసింహుడు మరికొన్ని అపరాధాలు చేసి తండ్రి కోపానికి అయ్యం పోయాడు. అతను తండ్రితో చెప్పకుండా సైనిక శిబిరాన్ని వదిలిపెట్టి మందారణ దుర్గానికి వెళ్ళాడు, తండ్రి అనుమతి కూడా పొందకుండా తిలోత్తమను పెళ్ళాడాడు. పెళ్ళికి అతని బంధువులు చాలా మంది వచ్చారు. నవాబుకూతురు ఆయిషా సపరివారంగా వచ్చింది. పెళ్ళి మహావైభవంగా జరిగింది. పెళ్ళికి తన తండ్రిని పిలవటం గాని, ఆయన ఆశీస్సు పొందటం గాని జగతసింహుడు చెయ్యలేదు.

మానసింహుడి దృష్టిలో జగతసింహుడు రెండు తప్పులు చేశాడు. అతను తండ్రికి తెలుపకుండా పెళ్ళాడటం ఒక తప్పు. వీరేంద్రసింహుడి కుమార్తెను పెళ్ళాడటం మరొక తప్పు. ఆయన దృష్టిలో వీరేంద్రసింహుడూ, అతని కూతురూ కులహీనులు.

జగతసింహుడి నేర పరంపర తిలోత్తమను పెళ్ళాడటంతో ఆగలేదు. మొగలాయి సేనలు పాట్నాకు తరలి వెళ్ళేటప్పుడు, అతను అక్కడికి వెళ్ళి సైన్యాధికారిగా తన బాధ్యత కేమీ నిర్వర్తించ లేదు. అసలతను

అక్కడికి వెళ్ళనైనా లేదు. అంతే కాదు, అతను భార్యతో ఆనందంలో ఓలలాడుతూ, దారుకేశ్వర తీరాన దిక్కు లేకుండా పడి ఉన్న తన సేనను గురించి నెల రోజులు ఉపేక్ష వహించాడు.

కొడుకు చేతలన్నీ తెలుసుకుంటే మాన సింహుడి ఆగ్రహం మిన్ను ముట్టింది. అత నికి రాజదండన జరిగి తీరాలని ఆయన నిశ్చయించాడు. అందుచేతనే ఆయన అందరూ వింటుండగా తన భటులను, "జగతసింహుణ్ణి గాని, అతని శవాన్ని గాని పట్టుకురండి." అని కఠోరమైన ఆజ్ఞ ఇచ్చాడు. వారు వచ్చి శైలేశ్వర మందిరం వద్ద అతన్ని పట్టుకున్నారు. ఏ శైలేశ్వర మందిరం దగ్గర జగతసింహుడి ప్రణయ కథ ఆరంభమయిందో అక్కడే అంతం కూడా అయినట్టు కనబడింది.

పొద్దున్నే మానసింహ మహారాజు తన కొడుకును బహిరంగంగా విచారించటానికి దర్బారు జరిపాడు. విచారణ వినటానికి వేలాదిగా జనం వచ్చి కూర్చున్నారు. మాన సింహుడు ఎత్తయిన ఆసనం పైన కూర్చు న్నాడు. ఆయన ఇరు పక్కలా ముఖ్య రాజోద్యోగులు ఇతర ఆసనాల పైన కూర్చు న్నారు. సభ జనంతో కిటకిటలాడుతున్నా నిశ్శ



బ్దంగా ఉంది. అందరి మనస్సులూ భయాం దోళనలతో నిండి ఉన్నాయి.

"బందీని తీసుకురండి," అని మాన సింహుడు ఆజ్ఞాపించాడు.

మధ్యవయసు గల భటుల మధ్య తల వంచుకుని నడుస్తూ జగతసింహుడు వచ్చి తన తండ్రి ఎదట నిలబడ్డాడు. మానసింహు డతన్ని "బందీ" అని సంబోధిస్తూ, అతను తన కుటుంబ విషయం లోనూ, రాజకీయం గానూ అనేక అపరాధాలు చేశాడని, ముందు అతను తన వంశానికి చేసిన అపరాధాలు విచారించి ఆ తరవాత రాజకీయ ద్రోహాలు విచారిస్తానని అన్నాడు.

వృద్ధుడైన మొగలాయీ సభికుడొకడు లేచి, "మహారాజా, ఈ కుర్రవాడి అపచారాలు క్షమించమని వేడుకుంటున్నాను. కుటుంబ విషయాలను గురించి బహిరంగంగా కాకుండా, రహస్య విచారణ చేయటం మంచిదేమో!" అన్నాడు.

"లేదు, లేదు. ఇతడు చేసిన కుటుంబ ద్రోహాలకూ, రాజకీయ ద్రోహాలకూ సంబంధం ఉన్నది. ఎవరూ వెళ్ళిపో నవసరం లేదు," అన్నాడు మానసింహుడు.

మానసింహుడు విచారణ ప్రారంభిస్తూ, జుద్ధాయిని, "నేను వెయ్యబోయే ప్రశ్నలకు నిజమైన సమాధానాలు చెప్పకపోతే నీ అపరాధం మరింత ఎక్కువగా పరిగణించబడుతుంది," అన్నాడు.

దానికి జగతసింహుడు గర్వంతో, "మహారాజా, ఆ మాట చెప్పటం అనావశ్యకం. జగతసింహుడు తన ప్రాణం కాపాడుకోవటానికి కూడా అబద్ధం చెప్పడు," అని జవాబిచ్చాడు.

"నీవు వీరేంద్రసింహుడి అంతఃపురంలోని ఒక గదిలో ఒక స్త్రీతో పాటు పఠానులకు చిక్కి బందీవైన మాట నిజమేనా?"

"నిజమే."

"నీవు పఠానుల వశమందున్న కాలంలో కతలూఖాన్ కూతురైన అయిషా హృద



యంలో నీపై ప్రేమ రగుల్కొల్పిన మాట నిజమేనా?"

"ఆ ప్రశ్నకు దీర్ఘంగా సమాధానం చెప్పాలి. నవాబునందిని అయిన ఆయిషా నాకు మేలు చేసిన మనిషి. నేను చావు బతుకుల మధ్య ఉన్నప్పు డామె నాకు తల్లి లాగా, చెల్లెలు లాగా, భార్య లాగా స్నేహితురాలి లాగా సమస్తమైన ఉపచారాలూ చెయ్యని పక్షంలో ఇవాళ నా విచారణ ఇక్కడ జరగటం సాధ్యం కాకపోను! ఆమెను దేవత లాగానూ, కపటం లేని ఆప్తురాలి లాగానూ భావిస్తాను. ఆమె పట్ల నాకు మరొక విధమైన భావం లేదు. కాని దురదృష్ట వశాన నవాబునందిని నన్ను ప్రేమిస్తున్నట్టు ఒక సందర్భంలో నాకు తెలిసింది. అది తెలిశాక, ఆమె ప్రేమను ఏ విధంగానూ స్వీకరించ లేనందుకు నేను చాలా బాధపడ్డాను."

"ఆమె కారణంగా నీకూ, పఠాన్ సేనాని అయిన ఉస్మాన్ ఖాన్‌కూ ద్వంద్వయుద్ధం జరిగిందా?"

"ఉస్మాన్ ఖాన్ ఆయిషాను ప్రేమించాడు. ఆమె ప్రేమకు పాత్రులైనవా రిద్దరుండరాదని, అందుచేత నేను తనతో యుద్ధం చెయ్యాలని అన్నాడు. నేను యుద్ధం చెయ్యలేను."





"అప్పుడప్పుడూ నవాబు కూతురికి ఉత్తరాలు పంపావా?"

"ఒక్క సారే పంపాను."

"నీ అంతట నీవే ఆమెను చూడటానికి వెళ్ళావా?"

"వెళ్ళాను. వెళ్ళిపోయేటప్పుడు ఆమెను ఒక సారి చూసి పోదామని వెళ్ళాను."

"ఆమె నిన్ను చూడకుండానే పంపించే సింది, కదూ?"

"అందుకొక కారణం ఉన్నది."

"అంత అయినా కూడా నీవు నవాబు నందినిని ప్రేమించ లేదని, ఆమె మాత్రమే నిన్ను ప్రేమించిందనీ అంటావా?"

"ఉన్న సంగతి చెప్పాను. నమ్మటమూ, మానటమూ మహారాజుగారి ఇష్టం."

"వీరేంద్రసింహుడి కూతురు నీ ఉంపుడు గత్తెనా?"

జగతసింహుడు ఆ మాటకు చలించిపో యాడు. అతని శరీరంలో విద్యుత్తు ప్రవ హించి నట్టయింది.

"మహారాజా, మీరు శాసనకర్తగా, రాజుగా, ప్రత్యేకించి నాకు తండ్రిగా గౌర వించ తగినవారు. ఈ మాటే మరొకరు అని ఉన్నట్టయితే వాళ్ళ ఫలికలూ, వాలికలూగా చేసి ఉండేవాణ్ణి. వీరేంద్రసింహుడి కుమార్తె నా భార్య—అగ్ని సాక్షిగా పెళ్ళాడిన ధర్మ పత్ని!" అన్నాడతను.

మానసింహుడు కోపావేశంతో భయం కరంగా అయిపోయాడు. "రాజపుత్ర వంశానికి కళంకం తెచ్చిన అధముడా! ఒళ్ళు తెలి యక అలా అన్నందుకు నీ నాలుక వెయ్యి ఫలికలు చేసినా పాపం లేదు. సిగ్గు చేత పోక నీ ప్రాణాలింకా నిలబడి ఉన్నాయా? వీరేంద్రుడి కూతురు నీకు ధర్మపత్నా? ఆ వీరేంద్రసింహుడు ఒక దాసీముండ కోసం పిళ్ళు మోసేవాడి లాగా నా అంతఃపురంలో ప్రవేశించాడు, పట్టుబడి. ఒక దాసీకి పుట్టిన విమల అనే దాన్ని పెళ్ళి చేసు



ఉన్నాడు—ఆ ఏయుదా నీకు మామా? ఆ నీచ జాతి విమల నీకు సవతి అత్తగారా? నీ ధర్మపత్ని ఎటువంటి దానికి పుట్టింది? అది ఎవరి మనుమరాలు? నీ భార్య మాతామహుడు శశిశేఖరుడనే వాడు చేయరాని పనులన్నీ చేసి, ఇప్పుడు సన్యాసి అయి, పరమ జ్ఞాని లాగా తిరుగుతున్నాడు—అభిరామస్వామి! ఈ నీచు లందరూ ఇప్పుడు నీకు బంధువర్గమా? నీ వివేక మేమైయింది? ఆ వీరేంద్రసింహుడి కుమార్తె నీ ఉంపుడుగత్తె అని చెప్పుకున్నా నీలో లోప మంతగా కనిపించేది కాదేమో! నన్ను శత్రువుల కింద జమకట్టి, నా అనుమతి గాని, ఆశీస్సు గాని లేకుండా ఈ పెళ్ళి చేసుకున్న నీవు నా కొడుకువు కావు. మానసింహుడి కొడుకు నని నీ వెన్నడైనా చెప్పుకున్నావో నీకు మరణ దండన తప్పదు," అన్నాడు.

సభికు లందరూ దిగ్భ్రమ చెంది కొయ్య బొమ్మల్లాగా మానసింహుడు చెప్పేది వింటున్నారు. కొంచెంసేపు ఆగి ఆయన జగత్సింహుడి రాజకీయ నేరాలను విచారించ నారంభించాడు.

"నీ రాజకీయ యోపరాధాలను గురించి కొన్ని ప్రశ్న లడుగుతాను. నీవు పాదుషా సేనకుడవై వుండి. ప్రత్యేకించి ఒక కార్య



భారాన్ని మీద వేసుకున్న సేనాపతివై ఉండి కూడా, శత్రువుల దుర్గం లోకి, యుద్ధాధిపతి అనుమతి లేకుండా, రాత్రి వేళ దొంగ లాగా ప్రవేశించావా లేదా?"

జగత్సింహుడు తల వంచుకుని సమాధానం చెప్పలేదు.

"నీ అయిదువేల సేననూ, పఠానులను తరిమివేసే పనినీ విడిచి పెట్టి, ఒక స్త్రీ కోసం నీ [illegible] వెళ్ళావా లేదా?"

జగత్సింహుడు మాట్లాడలేదు.

"పఠానులు నిన్ను విడిచిపెట్టాక నీవు సైనిక శిబిరానికి వెళ్ళి, నా ఉత్తరువుల కోసం అక్కడ ఎందుకు వేచి ఉండలేదు?"



జవాబు లేదు.

"సేనాధిపతులు అందరూ శిబిరం ఎత్తేసి, తమతమ సేనలను తీసుకుని బయలుదేరు తుంటే, వారి వెంట నీ వెందుకుండలేదు?"

జవాబు లేదు.

"ఎవరి ఉత్తరువూ లేకుండా, పాదుషా వారి పని ఒక్కటీ చెయ్యకుండా నీ ఇష్టం వచ్చి నట్టు కాలం ఎందుకు గడిపావు? మాట్లాడవేం? దుర్మార్గుడా, నీ వంటి వాడికి మరణ శిక్ష తప్ప వేరే దండన ఏ ముంటుంది?"

వృద్ధుడైన మొగలాయీ మళ్ళీ లేచి, "హుజూర్, క్షమించండి. ఒక విజ్ఞాపన. యువరాజు మీ కొడుకు—" అని ప్రారంభించాడు.

"ఈ నీచుడు నా కొడుకన్నవా రెవరు? వీడికీ నాకూ కొడుకూ తండ్రీ సంబంధం లేదని ముందే చెప్పాను," అన్నాడు మాన సింహుడు తీవ్రంగా.

"సరే మీరు ధర్మం ఎరగరా? యువ రాజింకా పసివాడు!" అంటూ మొగలాయీ వృద్ధుడు కూర్చున్నాడు.

మానసింహుడు కాస్సేపు తలవంచుకుని ఆలోచించి, "నిందితుడా, నీకు సరి అయిన శిక్ష మరణ దండనే! అయినా నీ వయసును పాటించి నీకు యావజ్జీవ కారాగార శిక్ష విధిస్తున్నాను," అన్నాడు. ఆయన భటులతో, "ఇతడి నగలూ, దుస్తులూ తీసేసి, ఖైదీ దుస్తులు తొడిగి నా ఎదుటనే అతడి కాళ్ళకూ, చేతులకూ సంకెళ్ళు తగిలించి, అందరూ చూస్తుండగానే కారాగృహానికి తీసుకు పోండి," అన్నాడు.

భటులు జగతసింహుడి దుస్తులు మార్చి, సంకెళ్ళు తగిలించి తీసుకుపోతుంటే సభలో కలవరం పుట్టింది. సేనాపతులు తలలు వంచుకున్నారు. వృద్ధులు కంట తడి పెట్టారు. జగతసింహుడు కనుమాటు కాగానే సభ లేచింది. —(ఇంకా వుంది)





# నవాబునందిని

## 3

మంత్రాసింగు పంపగా దాదుకేశ్వరానికి బయలుదేరిన సైనికుడికి మందారణ్యమధ్య మార్గంలో గజపతిదిగ్గజాదు కనిపించి, "అల్లా మహాదేవుడు హుజూర్ వారి ఆరోగ్యాన్ని కాపాడు గాక!" అన్నాడు.

దిగ్గజాది భాషా, వాలకమూ చూసి ఆశ్చర్యపడి సైనికుడు తన గుర్రాన్ని మెల్లిగా నడిపిస్తూ దిగ్గజాన్ని సంభాషణలో పెట్టాడు. సైనికుడి ప్రశ్నలకు సమాధానంగా దిగ్గజాదు, మొదట తాను హిందువుననీ, తరవాత తాను ముసల్మానుగా మారిపోయినట్టు తెలిసిందనీ, తిరిగి హిందువుడు కావటానికి చెయ్యవలసినదంతా చేశాననీ, అయినా తన జాతి గురించిన అనుమానం గురువుగారు వదిలేగాని పోదనీ, కోటలో ఉంటే అస్మానీ తనకు చాలా ఆప్తురాలనీ చెప్పాడు.

అలా మాట్లాడు కుంటూ వారు మందారణ్యాన్ని సమీపించారు. సైనికుడు దిగ్గజాదితో, "యువరాజు జగత్సింహుడు బందీ అయినట్టు కోటలో చెబుతారా?" అని అడిగాడు.

"ఎందుకు బందీ? ఎవరికి బందీ?" అని దిగ్గజాదు ప్రశ్నించాడు.

"ఎందుకు బందీ అంటే చెప్పలేను. కాని ఆతన్ని బందీగా పట్టుకున్నది మేమే. అలా చెయ్యమని మానసింహమహారాజు మా కాజ్ఞ ఇచ్చారు," అన్నాడు సైనికుడు.



దిగ్గజుడికి గుండెలో రాయి పడింది. వెనక అలాగే వీరేంద్రసింహుడు బందీ అయినప్పుడు, కోటలో ఉన్నవారంతా బందీ లయిపోయారు. చాలా గొడవ జరిగింది. ఇప్పుడు శత్రుసైనికులు జగతసింహుణ్ణి పట్టారు. తాను చూసినవాడు మొదటి సైనికుడన్న మాట. మిగిలినవాళ్ళు వెనకగా వచ్చిపడి కోటలో ఉన్న వాళ్ళందరినీ పట్టేస్తారు. సందేహం లేదు. ముందు ఈ సైనికుణ్ణి వదిలించుకుని, కోటకు వెళ్ళి ఈ దారుణవార్త అందరికీ చెప్పాలి.

ఇలా అనుకుని దిగ్గజుడు సైనికుడితో, "ఈ మాట నేను కోటలో చెబుతాను.



మీరు వెళ్ళి మరో పని చూసుకోండి," అన్నాడు. సైనికుడు వెళ్ళిపోయాడు.

దిగ్గజుడు కాలి సత్తువ కొద్దీ పరిగెత్తు కుంటూ కోటలో ప్రవేశించి, అస్మానికి ఈ వార్త చెప్పాలనే ఉద్దేశంతో అంతఃపురం ప్రవేశించబోయాడు. కాని ద్వారపాలకులు అతన్ని లోపలికి వెళ్ళనివ్వలేదు.

తాను అక్కడివాణ్ణేననీ, అభిరామస్వామి శిష్యుణ్ణనీ, అస్మానిని తాను బాగా ఎరుగుదుననీ దిగ్గజు డన్నాడు.

"అయితే అక్కడే ఉండు. ఎవరైనా కనిపిస్తే లోపలికి కబురు చేస్తాము," అన్నారు ద్వారపాలకులు.

విమల అంతఃపురం పై అంతస్తు లోని కిటికీ తెర వెనక నుంచి ద్వారపాలకుడికీ, దిగ్గజుడికీ జరిగే వాగ్వాదమంతా గమనిస్తున్నది. ఆమె అందమూ, చురుకూ, అలంకారాలూ అన్నీ పోయాయి. శరీరం క్షీణించింది. వార్ధక్య లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

విమల ఉన్న చోటికి అస్మాని కూడా వచ్చింది.

"గణపతి దిగ్గజుడు ద్వారపాలకుడితో ఘర్షణ పడుతున్నాడు. వెళ్ళి అతన్ని తీసుకురా," అన్నది విమల అస్మానితో.





అస్మాని కిందికి దిగి వెళ్ళి ఒక చీకటింట ప్రవేశించి, దిగ్గజాణ్ణి పిలుచుకు రమ్మని లక్ష్మణి అనే ఒక దాసిని ద్వారం వద్దకు పంపింది.

లక్ష్మణి వెళ్ళి, "ఏం రసికరాజా, జ్ఞాపకం ఉన్నానా?" అని అడిగింది.

ఆమె నెన్నడూ చూసి ఉండని దిగ్గజాడు చాలా కంగారుపడి, "నిన్ను చాలా సార్లు చూశాను, బాగా ఎరుగుదును, కాని ఎవరివో గుర్తురావడం లేదు," అన్నాడు.

లక్ష్మణి అమాయకుడైన దిగ్గజాణ్ణి కాస్సేపు పరిహసించి, అస్మాని ఉన్న చోటికి తీసుకుపోయింది.

"ఏం రసికరాజా, ఇంతకాలం ఏమయావు? ఎక్కడ ఉన్నావు?" అని అస్మాని అడిగింది.

"అదంతా తరవాత చెబుతాను గాని, ముందు వెంటనే నాతో బయలుదేరు. ఇక్కడ ఉండటం—చాలా ప్రమాదం," అన్నాడు దిగ్గజాడు.

"ఏమిటా ప్రమాదం?"

"యువరాజును పట్టుకు పోయారు!"

"ఎవరు?"

"మానసింహుడి మనుషులు."

"ఎక్కడ?"



"దారిలో పోతూంటే. ఒక దుర్గంలో వారంతా బందీ లవుతారు. నేను నీ గురించే బెంగ పడుతున్నాను. వెంటనే వచ్చెయ్యి. ఎటైనా పారిపోదాం!"

ఈ వార్త విమలకు వెంటనే చెప్పాలి. అందుకని అస్మాని దిగ్గజాడితో, "నువ్వన్నది నిజమే. పారిపోదాం. నువ్వు ముందు పద. చీకటి పడగానే సామాన్లు తీసుకుని పోదాం," అన్నది.

"అంతదాకానా? ఆలస్యం వల్ల అపాయం."

"నువ్వు ఆశ్రమానికి వెళ్ళి అక్కడి వాళ్ళతో మానసింహుడి మనుషులు రెండు

గంటల్లో వచ్చి పడబోతున్నారని చెప్పు. సమయానికి నేను వచ్చి నిన్ను అక్కడ కలుసుకుంటాను."

అస్మాని ఈ మాట అనగానే దిగ్గజుడికి కంపరం పుట్టి, వణుకుతూ, "అలా అయితే నే నిప్పుడే ఆశ్రమానికి పోతున్నాను," అంటూ పరుగు తీశాడు.

త్వరలోనే దిగ్గజుడు తెచ్చిన దుర్వార్త దుర్గ మంతటా తెలిసిపోయింది. దిగ్గజుడు చెప్పిన వివరాల వల్ల ఏమీ బోధపడక, నిజం తెలుసుకు రమ్మని అభిరామస్వామి ఒక మనిషిని గుర్రం మీద [illegible] పంపాడు.

[illegible] విమలా, అస్మాని కలిసి అభిరామస్వామి కుటీరానికి వచ్చారు. అభిరామస్వామి జింకచర్మం మీద కూర్చున్నాడు. అతని శిష్యు లాయన కెదురుగా నేలపైన కూర్చున్నారు.

"ఇప్పు డేం చెయ్యాలి?" అని విమల అడిగింది.

"ఒకనాడు ఇదే చోట ఇలాటి మాటే అడిగావు, జ్ఞాపకం ఉన్నదా? ఆ వివాహానికి మానసికంగా అతడు ఒప్పడని నే నంటే, యువరాజు స్వతంత్రుడని నీ వన్నావు. ఆ స్వాతంత్ర్యం ఎక్కడికి దారి తీసిందో చూశావా? యువరాజుకు ఎప్పుడూ ఎలాటి



స్వాతంత్ర్యమూ లేదు. అతను తండ్రికి ఇష్టం లేని పని ఏదీ చెయ్యలేడు. అతను మానసింహుడి కొడుకు మాత్రమే కాదు, ఆయన కింది నౌకరు కూడా," అన్నాడు అభిరామస్వామి.

"ఈ సంగతి అప్పుడు గద తెలిసింది! ఒక వేళ అనారే తెలిసినా కూడా ఆ ప్రేమ ప్రవాహాన్ని ఆపటం ఎవరికి సాధ్యమవుతుంది? తిలోత్తమను గురించి మీకు తెలీదు, నాకు తెలుసు."

"నేను తెలుసుకోవలసిందేమీ లేదు. ఒక్కసారి చూసుకున్నంత మాత్రాన ప్రగాఢ ప్రేమ పుట్టుకొస్తుందంటే నేను నమ్మను. అది మోహం మాత్రమే. మోహం కూడా బలవత్తరమైనదే, కాని దాన్ని మొగ్గలోనే తుంచి పారేస్తే అందువల్ల ప్రమాదం ఉండదు. ఈ కథంతా తెలుసుకున్నాను."

"నేను తిలోత్తమకు సుఖమూ, ఆనందమూ చేకూర్చాలని అలా చేశాను. నేను తిలోత్తమ కోసమే బతికాను. నాకు తిలోత్తమ రెండో ప్రాణం. ఆ పిల్ల కష్టాలన్నీ గట్టెక్కి, నేనిస్తున్న సుఖాలూ అనుభవిస్తుందనుకుంటే ఆమె మళ్ళీ శోకసముద్రంలో పడిపోయింది. నా దుఃఖాన్ని ఎవరితో చెప్పుకోను? నేను చేసిన ఏ పొరపాటు చేత







ఆమెకీ దుఃఖం వచ్చిపడిందో చెబితే పశ్చా
త్తాప పడతాను," అన్నది విమల.

ఆమె చేసిన ప్రతి పనీ తప్పేనని అభి
రామస్వామి చెప్పాడు. మానసింహుడి
కొడుక్కు వీరేంద్రసింహుడి కూతురితో
మనువు సాగదని విమలకు రూఢిగా
తెలుసు. అందుచేత ఆమె తిలోత్తమ హృద
యంలో రేకెత్తిన ఆశను వెంటనే తుంచి
పారెయ్యవలసింది. ఆమె అలా చేయలేదు.
శైలేశ్వర మందిరం నుంచి మొదటిసారి
వెళ్ళిపోయే టప్పుడు జగత్సింహుడికి
తిలోత్తమ ఎవరో తెలియదు. అతనలాగే
వెళ్ళిపోతే అంత ఇబ్బంది కాదు. విమల
అతన్ని పదిహేను రోజుల అనంతరం అక్క-
డికి రమ్మని, అప్పుడు తిలోత్తమ గురించి
చెబుతానని మాట ఇచ్చింది. అది పొర
పాటు. ఆ తరవాత ఆమె అభిరామస్వామి
హెచ్చరికను కూడా తృణీకరించి జగత్
సింహుణ్ణి రెండవసారి కలుసుకుని, తిలో
త్తమ సంగతి చెప్పేసింది. అతనికి తిలో
త్తమను చూపిస్తానని మాట ఇవ్వటం మరో
తప్పు. ఆమె వీరేంద్రసింహుడి భార్య అవు
గాక, మొగలాయి సేనాపతిని రహస్యంగా
దుర్గం లోకి ప్రవేశ పెట్టే అధికారం ఆమెకు
లేదు. అందువల్ల దుర్గం పఠానుల వశమై,
అనేక దుష్ఫలితాలు కలిగాయంటే
అందుకు బాధ్యత అంతా విమలదే.

"ఆలోచించుకో. నీవు చేసిన ఒక్క
పనీ మంచిది కాదు," అన్నాడు అభిరామ
స్వామి చివరకు.

విమల తన తండ్రి అయిన అభిరామ
స్వామి కాళ్ళ మీద పడి, "అర్థమయింది.
అన్నీ పాడు పనులే చేశాను. ఇప్పుడు
ఉపాయం ఏదైనా ఆలోచించి మమ్మల్ని
కాపాడండి," అన్నది.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. నేను
పంపిన మనిషి తిరిగి వచ్చిన దాకా ఏమీ
చెయ్యటానికి లేదు. మానసింహుడికి కొడుకు





ఫైన ఏ విషయమై ఆగ్రహం కలిగిందీ తెలిసిన మీదటనే మనం ఏ ఉపాయమైనా చేసేది." అన్నాడు అభిరామస్వామి.

"ఆ మనిషి ఎంత కాలానికి తిరిగి వస్తాడు?"

"రేపే రావచ్చు. పాట్నా దాకా వెళ్ళవలసి వస్తే అతను రావటానికి వారం, పది రోజులు పట్టినా పట్టచ్చు."

"వారం పది రోజులే! అంత దాకా తిలోత్తమ ఎలా బతికి ఉంటుంది?"

"నువ్వు ఆమెకు ధైర్యం చెప్పు. రేపు ఉదయం నేను కూడా వచ్చి మాట్లాడతాను," అన్నాడు అభిరామస్వామి.

"మానసింహుడు తన్ను కొడుకని దయ దలచకపోతాడా?" అన్నది విమల.

"ఆత్మాభిమానం జాస్తిగా గల వాడికి కొడుకని ఏమిటి? అయినవాళ్ళని ఏమిటి?"

"చివరకేమవుతుందంటారు?"

"ఆడదానివి. నీ కీ విషయాలు తెలియకుండా ఉండటం మంచిది."

"మీ రంటే మానసింహుడికి గౌరవమనుకుంటాను. మీరు వెళ్ళి చెబితే లాభం ఉంటుందేమో?"

"అలాటి దేమీ ఉంటుం దనుకోను. నేను జోక్యం కలిగించుకుంటే పరిస్థితి మరింత



విషమించవచ్చు. మానసింహుడు గౌరవించే మనిషి ఎవరైనా చెప్పాలి... చాలా పొద్దుపోయింది. ఇప్పుడు మీరు వెళ్ళిపోయి రేపు ఉదయం రండి," అని అభిరామస్వామి విమలనూ, అమ్మాయినీ పంపేశాడు.

పాట్నాకు వెళ్ళిన మనిషి సమాచారమంతా పోగుచేసుకుని తిరిగి వచ్చాడు. యువరాజుకు యావజ్జీవ కారాగార శిక్ష విధించారని తెలియగానే దుర్గంలో అందరూ హతాశులైపోయారు.

అభిరామస్వామి ఏదో నిశ్చయానికి వచ్చి, తాను తీర్థయాత్రల మీద వెళ్ళుతున్నట్టు ప్రకటించి బయలుదేరి వెళ్ళాడు.





కాని, ఆయన ఏదో ప్రయత్నం మీద వెళుతున్నాడని విమల గ్రహించింది.

తిలోత్తమ పూర్తిగా కుంగిపోయింది. ఆమెకు నిద్రాహారాలు లేవు, స్నానమూ, అలంకరణాలూ లేవు. దుఃఖసాగరంలో పడి కొట్టుకుంటూ కటిక నేలపై పడి దొర్లుతున్నది. యువరాజు పది రోజులుగా కారాగృహ వాసం చేస్తున్నారు; అతని భార్య అయిన తిలోత్తమ అతని కన్న కూడా దీనావస్థలో ఉన్నది. తియ్యని కల లాటి సుఖం ఇట్టే కరిగిపోయింది. ఈ సారి ఆమెకు కలిగిన దుఃఖానికి అవధి ఒడ్డు లేదు. తన భర్త జీవితాంతం దాకా తనకు మరి కనిపించడు.

అలాటి పరిస్థితి ఒక్కొక్కప్పుడు మనుషుల చిత్తవృత్తిని పూర్తిగా మార్చేస్తుంది. ఎల్లప్పుడూ పరిస్థితులకు తల ఒగ్గి, అసహాయురాలుగా ఉండిన తిలోత్తమలో ప్రతీకార బుద్ధి తలఎత్తింది. తాను ఎంత ఏడ్చినా తన భర్తకు ఇంచుక్కు కూడా ప్రయోజనం ఉండదు. ఏదైనా చెయ్యదలిస్తే అతని కష్టాలు తొలగించే ప్రయత్నమే చెయ్యాలి.

తిలోత్తమ చప్పున లేచి కూర్చుని, "ఎవరక్కడ?" అని పిలిచింది. ఆమె పిలుపు విని ఒక దాసి వచ్చింది. దాసి చేత కలమూ, కాగితమూ తెప్పించి, తిలోత్తమ ఆయేషాకు ఒక ఉత్తరం రాసింది. అందులో ఆమె, మానసింహుడి చేత తన భర్త అయిన జగత్సింహుడు యావజ్జీవ కారాగార శిక్ష విధించబడటం గురించి రాసి, "ఈ ప్రపంచంలో యువరాజు క్షేమం కోరే వారిలో నీవు అగ్రగణ్యురాలివని భావించి నీకీ ఉత్తరం రాస్తున్నాను. అందు గురించి నీ వేమి చేయగలవో, ఏమి చేస్తావో నాకు తెలియదు," అని రాసింది.

తరవాత తిలోత్తమ ఆ ఉత్తరానికి దారం కట్టి, సీలువేసి, దాన్ని తీసుకుని గది నుంచి వెళ్ళిపోయింది. —(ఇంకా వుంది.)





# నవాబునందిని

## 5

మానసింహ మహారాజు అంతులేని పరివారాన్ని వెంటబెట్టుకుని పూరీజగన్నాథ క్షేత్రం చేరుకున్నాడు. సముద్ర తీరాన ఆయన కోసం ఒక మైలు నిడివి, వెడల్పూ గల నగరం లాటి శిబిరం నిర్మించారు.

మహారాజు జగన్నాథ క్షేత్రానికి బయలుదేరే ముందుగా పఠానుల కొక లేఖ పంపుతూ, తాను వారి రాజ్యం గుండా ప్రయాణించే టప్పుడు నవాబులు తనను వచ్చి చూడాలని, తనకు తగిన ఏర్పాట్లు చేయాలని అడిగాడు. కాని ఆయనను చూడటానికి సులేమాన్‌ఖాన్ గాని, ఉస్మాన్ ఖాన్ గాని రాలేదు. నవాబు కుటుంబానికి చెందిన వ్యక్తి ఎవరో వచ్చి స్వాగతం తెలిపారు. పఠానుల ప్రవర్తన మానసింహుడికి అసంతృప్తి కలిగించింది.

మానసింహ మహారాజుకు పట్టపురాణి జగతసింహుడి తల్లి. మానసింహుడికి ఆమె పైన ఎంతో గౌరవం, కాని ప్రేమ అంతగా లేదు, పైపెచ్చు కొంత భయం కూడా ఉన్నది. భర్త దేశదేశాలు తిరుగుతుంటే ఆమె ఆయన వెంట తిరగదు. మానసింహుడికింకా అనేక భార్యలున్నారు. కాని అందరి కన్న జోధ్పూరు రాజకుమార్తె అయిన ఊర్మిళ అంటే ఆయనకు అంతులేని ప్రేమ. పూరీజగన్నాథ క్షేత్రానికి ఆయన వెంట వచ్చిన ముగ్గురు భార్యలలో ఆమె కూడా ఉన్నది.

దా మో ద ర ము ఖ ర్డి



పూరీలో మహారాజు కవసరమైన ఏర్పాట్లన్నీ తృప్తికరంగా చేసినవాడు రామచంద్ర దేవు డనేవాడు. అతను దేవవంశం వాడు. ఒరిస్సాను పఠానులు జయించక పూర్వం దేవవంశపు రాజులే అక్కడ పరిపాలన చేశారు. పూరీ క్షేత్రం సంధి నిబంధనల ప్రకారం మొగలులది కాగానే రామచంద్ర దేవుడు దానికి శాసనాధికారిగా నియమించ బడ్డాడు.

పూరీలో మానసింహుడు వారం రోజు లుండ సంకల్పించాడు. అందులో రెండు రోజులు గడిచిపోయాయి. మూడో నాడు సాయంకాలం మానసింహుడు జగన్నాథాలయంలో మంగళహారతి చూసి ఊర్మిళ ఉండే డేరాకు తిరిగి వచ్చాడు. ఆయన కోసం వంట తయారు చేస్తున్న ఊర్మిళ ఆయన వచ్చినట్టు తెలిసి ఆయన ఉన్న చోటికి ఒక బాలికను వెంటబెట్టుకుని వచ్చింది. ఆ బాలిక అసాధారణ సౌందర్యవతిగా ఉన్నది.

"ఈ అమ్మాయి ఎవరు? సాక్షాత్తూ లక్ష్మి లాగుందే!" అని మానసింహుడు అడిగాడు.

"ఈ పిల్ల నా స్నేహితురాలి కూతురు. తల్లీ కూతుళ్ళు జగన్నాథస్వామి దర్శనార్థం వచ్చారట, ఇవాళ మధ్యాహ్నం నన్ను చూడవచ్చారు. నా స్నేహితురాలు వెళ్ళిపోయింది, కాని నేనీ పిల్లను కొన్నాళ్ళు నా వద్ద ఉంచుకుంటానని నిలిపేశాను," అన్నది ఊర్మిళ.

"ఈమెకు పెళ్ళి అయిందా?"

"అయింది, కాని ఆ సందర్భంలో మీతో చెప్పవలసిన విషయం ఒకటున్నది. దాని విషయం తరవాత మనవి చేస్తాను."

"అలాగే. ఈ అమ్మాయి పేరేమిటి?"

"రాజలక్ష్మి."

"బాగుంది. నిశ్చయంగా ఈమె రాజలక్ష్మే."

అది మొదలు రాజలక్ష్మి మహారాజుకు అనేక విధాల సేవ చేస్తూ ఆయనను మెప్పించింది.

మానసింహుడు పూరీకి వచ్చి పది రోజు లయింది. కాని ఆయన శిబిరం ఎత్తి వెళ్ళి పోయే సూచన లేవీ లేవు. ఈ లోపుగా పఠానునవాబుల వార్తలు కొన్ని ఆయన కందాయి. మంచాన పడి ఉన్న ముసలి వజీరు ఈసాఖాన్ చనిపోయాడు. పేరుకు నవాబయినా సులేమాన్‌ఖాన్‌కు రాజకీయాల గొడవ ఏమీ తెలియదు; అతను బాధ్యత అన్నిటినీ ఉస్మాన్‌ఖాన్‌కే వదిలిపెట్టేశాడు. కొత్త వజీరుగా ఖిజర్‌ఖాన్ అనే వాణ్ణి ఉస్మానే నియోగించాడు. ఖిజర్‌ఖాన్ అన్ని విధాలా ఉస్మాన్‌ఖానును పోలినవాడు; సాహసికుడు; యుద్ధప్రియుడు. అతని వయసు నలభై ఆరేళ్ళు. రాజ్యపాలన యావత్తూ ఉస్మాన్‌ఖాన్ చేతి మీదనే నడుస్తున్నది.

మానసింహం ఈ సమాచార మంతా తెలుసుకుని రామచంద్రదేవుడితో సమాలోచన చేశాడు. ఉస్మాన్ త్వరలోనే సంధికి స్వస్తి చెప్పేస్తాడు. అతని ప్రవర్తన ఇది వరకే నిర్లక్ష్యంగా ఉంటున్నది. అతను మానసింహుణ్ణి పూరీలో కూడా చూడరాలేదు. అతను యుద్ధపిపాసి. అతనికి హిందువు పట్ల



గౌరవాభిమానా లేమీ ఉన్నట్టు కనబడ లేదు. మానసింహుడు తాను పఠానులతో యుద్ధం చెయ్యటానికి సంసిద్ధుడుగా లేని తరుణంలో సంధి చేసుకున్నాడు. ఇప్పు డాయన యుద్ధానికి ఆయత్తుడై ఉన్నాడు. కాని, పఠానులు తామై సంధి నియమాలను ఉల్లంఘించితే తప్ప, వాటికి భంగం కలిగటం ఆయన కిష్టం లేదు.

చివరకు ఉస్మాన్ పూరీ నగరానికి వచ్చాడు. అపరాహ్ణ వేళ మహారాజు, మిత్ర రాజుల తోనూ, రామచంద్రుడి తోనూ సభా మంటపంలో కూర్చుని ఉండగా ఉస్మా నక్కడికి వచ్చాడు. మానసింహు డతనికి



చేయవలసిన మర్యాదలన్నీ చేసి ఉచితాసనం చూపాడు.

ఉస్మాన్ చాలా అందమైనవాడు, చాలా మంచి దుస్తులూ, తలపాగా, పొడుగాటి ఖడ్గమూ ధరించి ఉన్నాడు. మహారాజు లాంఛనంగా ఘూనలి వజీరు మరణం గురించి మాట్లాడి, "నేను ఒరిస్సా దేశానికి వచ్చానే గాని, ఒరిస్సా నవాబుల దర్శన భాగ్యం కలుగుతుం దనుకోలేదు. ఇవాళ మా అదృష్టం వల్ల ఆ భాగ్యం కలిగింది," అన్నాడు కొంచెం వెటకారంగా.

ఉస్మాన్ ఆ వెటకారాన్ని అర్థం చేసుకుని, "మేము నిజంగా తమకు ఆత్మీయులమైనట్టయితే మా దర్శనం భాగ్యంగా అనుకోవటానికి వీలుండేదేమో. కాని మాకు తమ ఆత్మీయులమై ఉండే భాగ్యం లేదు. ఉండినట్టయితే మేము తమ దర్శనం చేసుకోమని ఆజ్ఞాపిస్తూ దాసులకు రాసినట్టుగా రాసిఉండరు," అని కుండ పగలేసినట్టు అనేశాడు.

మానసింహుడు కూడా కుండ పగలేసినట్టు మాట్లాడ నిశ్చయించుకుని, "ఆజ్ఞలు పాలించే దాసులు ఆత్మీయులు కాకూడదని ఎక్కడున్నది? కావటమూ కాకపోవటమూ వారి గుణాలను బట్టి, శక్తిని బట్టి ఉంటుంది. నవాబులు పాదుషాకు లోబడి ఉండటానికి సమ్మతించారు; ఆత్మీయులుగా ఉంటారో, ఉండరో వారే తేల్చుకోవాలి," అన్నాడు.

మీరు మా ఆజ్ఞలను పాలించే దాసులే నని మానసింహుడు స్పష్టంగానే అనే సరికి ఉస్మాన్ ముఖం కంది పోయింది. అతను ఓర్పు తెచ్చుకుని, "బంగాళా దేశపు సుబేదారుగారూ, నేను మీతో వాదించటానికి రాలేదు. మీ వంటి వారితో వాదించటం నాకు పరువు తక్కువ. మీతో అనేక ముఖ్య విషయాలు మాట్లాడ వలసిన అవసరం ఉన్నది, కాని మీ రిప్పుడు ప్రకటించే వైఖరి

చూస్తే, వాటిని ప్రస్తావించటం మంచిది కాదనిపిస్తున్నది. నేను వెళ్ళిపోతాను; కాని వెళ్ళే ముందు మీతో ఒక్క విషయం చెప్పవలిసి ఉంది, అది నా స్వవిషయం," అన్నాడు.

"మీరు చెప్పేది వినటానికి నా కేమీ అభ్యంతరం లేదు. మీతో విరోధం పెట్టుకోవటం నా ఉద్దేశం కాదు. నా స్నేహాన్ని పోగొట్టుకోకుండా ఉండటం మీకు మంచిదని నేను మళ్ళీ మళ్ళీ చెప్పదలిచాను," అన్నాడు మానసింహుడు.

"ఆ విషయాలను గురించి మాట్లాడటం నా కిష్టం లేదు. మీరు మీ కొడుకైన జగతసింహుడికి యావజ్జీవ కారాగారశిక్ష విధించారు. అందుకు కారణం అతనికీ నవాబు సంబీని అయిన ఆయుషాకూ మధ్య ప్రేమ ఉన్నట్టు వ్యక్తం కావటమేనా?" అని ఉస్మాన్ అడిగాడు.

"జగతసింహుడు ఆయుషా ప్రేమను ప్రేరేపించటం నిజంగా అపరాధమే. కాని అతని శిక్షకు ఇతర కారణాలు కూడా ఉన్నాయి. అతను అవిధేయుడు; రాజకార్యాల పట్ల అశ్రద్ధ వహించాడు. శత్రువులతో స్నేహ సంబంధాలు పెట్టుకున్నాడు. ఇవన్నీ అపరాధాలే."



"జగతసింహుడు నాకు శత్రువు. అతని హితం నేను కోరను. కాని అతను చెయ్యని అపరాధానికి శిక్ష పొందుతుంటే నేను సహించలేను. ఆయుషా ప్రేమ విషయంలో అతని అపరాధం ఏమీ లేదు. అతను తనకు ఆయుషా పైన ప్రేమ ఉన్నట్టు ఏ విధంగానూ ప్రకటించ లేదు. ఆయుషా తనకు తానే అతన్ని ప్రేమించింది. ఆ విషయం తెలిసి కూడా అత నామెను ప్రేమించ లేదు. ఈ సంగతి చెప్పటం నా విధి."

"ఇదే నిజమైతే మీకూ, జగతసింహుడికి ద్వంద్వ యుద్ధం ఎందుకు జరిగింది?"



ఉస్మాన్‌ఖాన్ కొంచెం సిగ్గుపడుతూ, "చెబుతాను వినండి. నేను ఆయషాను ప్రేమించాను. కాని ఆమె మనస్సంతా జగతసింహుడితో నిండి ఉండటం చేత నా కక్కడ చోటు లేకుండా పోయింది. జగతసింహుడు బతికి ఉన్నంత కాలమూ ఆమె అతన్ని మరవదు. అందుచేతనే నేనతన్ని చంపాలని ప్రయత్నించాను, కాని, ఓడాను. అతన్ని చంపే అవకాశం కోసం ఎదురు చూస్తున్న నాకు అతని యావజ్జీవ కారాగారశిక్ష పెద్ద అటంకమైపోయింది," అంటూ ఉస్మాన్‌ఖాన్ లేచి, అందరికీ సలాము చేసి వెళ్ళిపోయాడు.

"మొగలాయీలకూ, పఠానులకూ జరిగిన సంధి ఇక ఎంతోకాలం నిలవదు," అనుకున్నారు సభలో మిగిలిన వాళ్ళు. మానసింహుడు కొంత కలవరపడుతూ సభ చాలించి, జగన్నాథస్వామికి హారతి ఇవ్వటానికి బయలుదేరాడు.

ఉస్మాన్ స్వదుర్గానికి తిరిగి వెళ్ళిపోయాడు, కాని అతని చారులు మానసింహుడి వార్తలను ఎప్పటికప్పుడు అందజేస్తూనే ఉన్నారు. సాధ్యమైనంత త్వరలో సంధికి భంగం కలిగించాలని ఉస్మాన్ ఉద్దేశం. ఆ సంధి అతనికి దుర్భరమైన అవమానంగా ఉండి బాధిస్తున్నది. అతను యుద్ధసన్నాహాలు చేయ నారంభించాడు.

ఒకనాడు ఉస్మాన్ దుర్గ ప్రాసాదంలో ఒంటరిగా కూర్చుని ఉండగా, నవాబు నందిని ఆయషా, పక్కనే ఉన్న అంతఃపుర ద్వారం తెరిచి, "నవాబు ఒక్కరే ఉన్నట్టుంది. నేను కాస్సేపు రావచ్చునా?" అని అడిగింది.

"రావచ్చునా అని అడుగుతున్నావా, ఆయషా? కాకి చేత కబురు చేస్తే నేనే నీ దగ్గర వాలేవాణ్ణి గదా, ఎందుకు నువే బయలుదేరి వచ్చావు? ఏమిటి విశేషం?" అన్నాడు ఉస్మాన్.



ఆయుషా ముఖం విచారంతో నిండి ఉన్నది. ఆమె అతని గదిలోకి వచ్చి కూర్చున్నది. ఉస్మాన్ గది తలుపు గడియ పెట్టి వచ్చి, "చెప్పు," అన్నాడు.

"నీతో ఒక్క మాట చెప్పదామని వచ్చాను. నేను నిన్ను ప్రేమించటం లేదని జ్ఞాపకం ఉంచుకో; అనవసరమైన భ్రమలు పెట్టుకోను," అన్నది ఆయుషా.

"చెప్పు. నీ మాటలు వినటం నాకు పరమానందమే," అన్నాడు ఉస్మాన్.

ఆమె కొంచెం సేపు వస్తాయించి, "నువ్విప్పుడు యుద్ధ ప్రయత్నాలలో మునిగి తేలుతున్నట్టున్నావు. పనికిమాలిన విషయాలతో నిన్నిప్పుడు బాధించటం బాగుండదేమో," అన్నది.

"నువ్వెంత అనర్థక విషయం చెప్పినా నాకు బాధలేదు. చెప్పకపోతేనే నేను బాధ పడతాను."

"నిజంగా నువ్వు నాపై చూపే అనుగ్రహానికి మేరలేదు. అందుకు నే నేమీ ప్రత్యుపకారం చెయ్యలేకపోతున్నాను."

"ఆయుషా, నేను నీ మీద చూపిన అనుగ్రహ మేమిటో నాకు తెలీదు. కాని నన్ను నీ మేలు కోరే వాడుగా భావిస్తే అదే నాకు మహాభాగ్యం."



ఆయుషా తల వంచుకుని, "నే నిక్కడ ఉండదగా దనిపిస్తున్నది," అన్నది.

ఉస్మాన్ దెబ్బతిన్న వాడి లాగా అయిపోయి, దీనంగా, "ఆయుషా, ఈ మాట చెప్పటానికా వచ్చావు? నువ్విక్కడ లేకపోతే ఇంకెవరుంటారు? నువ్విక్కడ ఉండబట్టే ఈ ఉస్మా నింకా ప్రాణాలతో ఉన్నాడు. నువ్వు నా దానివి కాకపోవటం నా దౌర్భాగ్యం. కాని నాలో ఇంకా ఆశ చావలేదు. బతికి ఉండగా ఎప్పటికైనా నువ్వు నన్ను ప్రేమించి, నా దాని వవుతా వన్న ఆశతో బతికి ఉన్నాను. ఆ ఆశను కూడా తుంచేస్తావా?" అన్నాడు.





"ఉస్మాన్, నీ హృదయం అపూర్వమైనది. నీ ప్రేమ అసాధారణమైనది. కాని, అందువల్ల నీకు బాధ తప్ప మరేమీ ఉండటంలేదు. రాయి లాటి నన్ను ప్రేమించి నీకు బాధ కలగటం కన్న నేను నీ ఎదట లేకుండా పోవటం మనిద్దరికీ మేలే నను కుంటున్నాను."

"అయుషా, నీ నుంచి నాకు ఆనందం కలగటం లేదనుకోకు. దూరం నుంచి నిన్ను చూసి, నీ కంఠం విని నేను పరమానందం పొందుతున్నాను. ఆ ఆనందం కూడా లేకుండా చేస్తావా?"

"నేను దూరంగా ఉంటే నన్ను మరిచి పోగలుగుతావు."

"నువ్వు ప్రేమించే వ్యక్తి చాలా కాలంగా నీకు దూరమయాడు, అతన్ని మరిచి పోయావా?"

"మగవాళ్ళ దారి వేరు. వాళ్ళ కెన్నో వ్యాపకా లుంటాయి. ఆడదానికి ప్రేమ తప్ప జీవితంలో మరొకటేముంది? నువ్వు రాతి బొమ్మను సులభంగా మరిచిపోగలవు."

"నా శరీరం మట్టిలో కలిశాక మరిచి పోతానేమో, అంతదాకా అది అసంభవం. నువు ప్రేమించే వాణ్ణి నా చేతులారా ఎప్పటికైనా చంపుతానన్న ఆశ నా కున్నది. అప్పటికి నువ్వు నన్ను ప్రేమించలేకపోతే నా ప్రతిద్వంద్వి పోయాడన్న తృప్తి అయినా నా కుంటుంది."

"ఉస్మాన్, నేను జీవించి ఉన్నది కీడు పెంపొందించటానికే లాగుంది. నేను కోరే దెల్లా నువ్వు సుఖంగా ఉండాలనే. నేను మళ్ళీ నీకు కనిపించ ననుకుంటాను. నీకు పెద్ద ఆపద ఏదైనా సంభవించే పక్షంలో, అది నా వల్ల తొలగే అవకాశం ఉన్న పక్షంలో అప్పుడు వస్తాను," అన్నది అయుషా.

ఈ మాటలను తల వంచుకుని వింటున్న ఉస్మాన్ తిరిగి తల ఎత్తి చూసే సరికి అయుషా అక్కడ లేదు. —(ఇంకా వుంది)






## 6

జగత్సింహుడు సంకెళ్ళు తగిలించుకుని, సూర్యచంద్రుల దర్శనమైనా లేకుండా కారాగృహంలో పడి ఉన్నాడు. అది అతని సజీవ సమాధి. అన్ని ఆశలుకూ అదే అంతం. అతని జీవితం అక్కడే ముగియాలి. ఆ సంగతి అతనికి తెలుసు, కాని అతనిలో ఆశ అన్నది చావలేదు. ఇదివరకు అతని కెన్నో కష్టాలు వచ్చాయి, తొలగిపోయాయి. దుర్దినాలు ఎల్లకాలమూ గూడుకట్టుకుని ఉండవు. మళ్ళీ మంచి రోజులు రావచ్చు.

అతనికి తాను పడే కష్టాల కన్న తిలోత్తమ పడే బాధను గురించి తలుచుకోవటం హెచ్చు కష్ట మయింది. ఎవరైనా తిలోత్తమ వార్త తెచ్చినా, లేక తా నెవరితోనైనా తన వార్త తిలోత్తమకు అందజేయగలిగినా అతని బాధ కొంత తగ్గును. కాని అది ఎలా సాధ్యం? చింత అతన్ని అహోరాత్రాలు నిద్రపోనివ్వకుండా బాధిస్తున్నది.

ఒకనాడు తెల్లవారుగట్ల అతనికి కాస్త కునుకు పట్టింది. అంతలోనే అందెల చప్పుడు వినిపించినట్టయింది. తరవాత తిలోత్తమ, చేత ఒక పుష్పమాల పట్టుకుని తన వద్దకు వచ్చింది. "నేను కత్తి అవతల పారేశానులే, పుష్పమాల ఇంక తెగదు," అని తను అన్నాడు. అంతలోనే అతనికి "యువరాజా!" అన్న పిలుపు వినిపించింది.

దామోదరము శర్మ





జగతసింహుడు కళ్ళు తెరిచి చూసేసరికి కల కరిగిపోయింది, ఎదురుగా తిలోత్తమకు బదులు కారాగారరక్షకు డున్నాడు.

"ఏం నాయనా, తూర్పు తెల్లవారకుండానే ఏం సమాచారం తెచ్చావు?"

"తమని ఒక సన్యాసిగారు చూడా లంటున్నారు."

"తీసుకు రాలేకపోయావా?"

"నాకు ధైర్యం చాలలేదు."

"అయితే ఆ మాట నా కెందుకు చెప్పటం?"

"వారిని లోపలికి పోనివ్వకపోతే మహారాజుకు చాలా కోపం వస్తుందని, రాజకార్యాలన్నీ పాడవుతాయని ఆ సన్యాసి అంటున్నారు."

"దానికి నే నేం చెయ్యను?"

"వారిని లోపలికి తీసుకొద్దా మనుకుంటున్నాను."

"అయితే నాతో చెప్పటం దేనికి?"

"ఆ సన్యాసిని చూడటం మీ కిష్టమవుతుందో, కాదో అని."

"నీవు ఎప్పుడు ఎవరిని లోపలికి ప్రవేశపెట్టినా నా కిష్టమే, తెలిసిందా?"

కారాగార రక్షకుడు వెళ్ళిపోయి అభిరామస్వామితో తిరిగి వచ్చాడు. ఆయనను చూడగానే జగతసింహుడు లేచి, పాదాభివందనం చేసి, "ఇదేమిటి? మీ రిక్కడి కెలా వచ్చారు?" అన్నాడు.

"నే నిక్కడ ఎక్కువసేపు వుండటానికి లేదు. అందుచేత అసలు విషయం టూకీగా చెబుతాను. నీ శిక్ష గురించి తెలియగానే వచ్చి, అన్నాళ్ళూ ఇక్కడే ఉంటున్నాను."

"మందారవతిలో అంతా కులాసా?"

"నీ కోసం అందరూ దుఃఖిస్తున్నారు. తిలోత్తమ దుఃఖానికి అంతేలేదు. నేను వచ్చాక నా శిష్యుడు దిగ్గజుడు ఏమల నుంచి ఒక ఉత్తరం తెచ్చాడు. నీకు కారాగార విమోచనం కలుగుతుందన్న ఆశతోనే







ఇలో త్రమ ప్రాణాలు నిలుపుకుని ఉన్నట్టు వివరంగా రాసింది."

"మీ శిష్యుళ్ళు ఏ ఉద్దేశంతో ఇక్కడ ఉన్నారు?"

"ఒకటి, నిన్ను చూడాలని; రెండు, నిన్ను విడిపించే ఉపాయం ఆలోచించాలనీనూ."

"నన్నెలా చూడగలిగారు?"

"కారాగార రక్షకుడికి బాగా బహుమానం ఇచ్చాను. నీతో కొద్దిసేపు మాత్రమే మాట్లాడనివ్వటానికి వాడు ఒప్పుకున్నాడు."

"నన్ను విడిపించటం సాధ్యపడుతుందనుకోను."

అభిరామస్వామి తన జోలె నుంచి ఒక కాగితం తీసి, "అంత బొత్తిగా నిరాశ పడకు. ఈ కాగితం పైన సంతకం పెట్టు. ఆ ప్రయత్నం కూడా సానుకూలం కావచ్చు," అన్నాడు.

"ఎలా ప్రయత్నిస్తారు?"

"పాదుషా దర్బారుకు వెళ్ళి."

"అక్కడ మనకు సహాయం చేసేవాళ్ళవరు?"

"నవాబు నందిని అయేషా. ఆమె ప్రయత్నం మీదనే, ఆమె ప్రోత్సాహంతోనే ఇదంతా జరుగుతున్నది."

అభిరామస్వామి మాటలకు జగత్సింహుడాశ్చర్యపడి, "ఆమె సహాయం ఎలా సంపాదించారు?" అన్నాడు.

"నేను సంపాదించలేదు. నిన్ను చెర విడిపించాలని ఆమె భూమ్యాకాశాలు తల కిందులు చేస్తున్నది. నే నామె ఆజ్ఞను నిర్వర్తిస్తున్నాను. ఆమె ఇప్పటికి పాట్నా లోనే ఉన్నది. నీ విజ్ఞాపన తీసుకుని ఆమె ఢిల్లీకి పోతుంది. అక్కడ అంతా సవ్యంగా జరిగితేను, తప్పక విడుదల అవుతావు."

అయేషా తనకు చేస్తున్న సహాయానికి ఋణం ఎలా తీర్చుకోవాలో జగత్సింహుడికి తెలియలేదు. "స్వామీ, నేను



ఆయనను ఒక్కసారి చూసే ఉపాయం ఏమీ లేదా?" అని అత నడిగాడు.

"ఉపాయం ఉన్నప్పటికీ ఆమె నిన్ను చూడదు. చూసుకోవటం వల్ల మీ ఇద్దరికీ బాధేనని ఆమె నమ్మకం. అందుచేత ఆమె నీ కోసం ప్రాణాలన్నా అర్పిస్తుంది గాని, నిన్ను చూడదు. మిగిలిన విషయాలు మాట తరవాత చూడవచ్చు. ముందీ కాగితం పైన సంతకం చెయ్యి." అన్నాడు అభిరామస్వామి.

జగత్సింహుడు సంతకం చేసిన కాగితాన్ని ఆయన నలగకుండా, భద్రంగా జేబులో పెట్టుకుంటూండగా కారాగార రక్షకుడు ఆయనను తొందర చేశాడు. అభిరామస్వామి వెళ్ళిపోయాడు...

మానసింహుడు చాలా దర్పంగా తన కొడుకుకు యావజ్జీవ కారాగారశిక్ష విధించి అందరికీ ఆశ్చర్యవిభ్రమం కలిగించాడు, అక్బరు పాదుషాను మెప్పించాడు, న్యాయబుద్ధి కలవాడనిపించుకున్నాడు; కాని ఆయన మనస్సు అస్థిమితంగానే ఉన్నది. అందుకు కారణాలున్నాయి: జగత్సింహుడు ఆయనకు ఒక్కడే కొడుకు; అదీ గాక అతను చేసిన రాజకీయ నేరాలన్నిటికీ ఏదో కారణం ఉండి ఉండవచ్చు, కాని అతను తన ప్రవర్తనకు గల కారణాలను చెప్పుకునేటందుకు మానసింహుడు అవకాశం ఇవ్వలేదు. మానసింహుడు జరిపినది విచారణే కాదు. మానసింహుడి దృష్టిలో జగత్సింహుడు చేసిన నిజమైన నేరం దుర్గేశనందిని అయిన తిలోత్తమను పెళ్ళాడటం; ఆ నేరాన్ని మాత్రమే మానసింహుడు క్షమించలేడు.

ఒకనాడాయన ఊర్మిళ అంతఃపురానికి వెళ్ళినప్పుడు ఊర్మిళాదేవి రాజలక్ష్మిని గురించి తనకు బెంగగా ఉన్నట్టు చెప్పింది; ఆ పిల్ల తన కడుపున పుట్టిన కూతురు లాగా మసలుతున్న దన్నది.



"అలా అయితే ఆమెను నీ వెంటనే ఉంచుకో. ఆమె తల్లిదండ్రులకు అలాగని కబురుచేస్తాను," అన్నాడు మానసింహుడు.

"ఆమెను మన వద్ద ఉంచుకోగానే సరా? ఆమె కష్టసుఖాలు ఆలోచించవద్దా?" అన్నది ఊర్మిళ.

"ఏమి టామెకు వచ్చిన కష్టం?"

"ఆమెకు అందం ఉన్నది, గుణం ఉన్నది, కాని అభాగ్యురాలు. ఆమెను భర్త ఎంతో ఇష్టంగా పెళ్ళాడాడు. కాని ఇప్పు డామెకు కులం తక్కువనీ, అందుచేత ఏలుకోననీ అంటున్నాడు."

"ఆమె వంశంలో దోషమేమైనా ఉన్నదా?"

"పెద్ద దోషమేమీ లేదు. ఏమైనా ఉంటే మాత్రం, పాపం, దాని కామె ఏంచెయ్యగలదు? వంశంలో దోషం ఉందని పిల్ల గుణం కూడా పాటించకుండా వదిలేస్తారా?"

"అంత మంచి పిల్లను వదిలెయ్యటం తప్పే. ఆమె భర్త ఏం చేస్తుంటాడు?"

"మీ కింద సైనికుడుగా ఉంటున్నాడు. మీరు అనుగ్రహిస్తే ఈ పిల్ల కష్టాలు తీరుతాయి."

"నా కింది సైనికుడే అయితే అది నా చేతిలో ఉన్న పనే. అతని దగ్గిర బంధు



వులను పిలిపించి, అందరి ఎదటా అతన్ని ఒప్పించి, అతను రాజలక్ష్మి నేలుకునేటట్టు చేస్తాను, నీవు విచారించకు. కాని ఆ తర వాత మనకేం ఒరుగుతుంది? భర్త వచ్చి ఆమెను తీసుకుపోతాడు. ఆమె నీ దగ్గర ఉండకుండా వెళ్ళిపోతుంది."

"ఆ భయం ఉండదులెండి. అతనూ మన దగ్గిరే ఉంటాడు, ఈమె కూడా మన వెంటే ఉంటుంది. ఆమె ముఖం ఆనందంతో వికసిస్తే నేను కూడా సుఖపడి పోతాను. మీరు మాత్రం తప్పక నా కీ సంతోషం సమకూర్చిపెట్టాలి," అంటూ ఊర్మిళ కంట తడిపెట్టుకున్నది.





మానసింహుడామె చెయ్యి పట్టుకుని, "నేను తప్పక నీ కోరిక తీరుస్తాను. అందుకే అలాగే చెప్పను. అందువల్ల నాకు నలుగురిలో తలవంపులైనా, అపఖ్యాతి వచ్చిపడినా సరే నేను వెనకాడను, సరా?" అన్నాడు.

"మహారాజా, అయితే తిలోత్తమను మీ కోడలుగా పిలుచుకోండి. అన్నమాట నిలబెట్టుకోండి," అన్నది ఊర్మిళ.

"తిలోత్తమనా? ఇప్పుడు తిలోత్తమ ప్రసక్తి ఏం వచ్చింది?"

రాజలక్ష్మి వచ్చి మహారాజా పాదాల పైన పడి ఏడవసాగింది.



"అవును మహారాజా, రాజలక్ష్మి మీ కోడలు తిలోత్తమ," అన్నది ఊర్మిళ.

మానసింహుడు తలవంచుకుని కొంత సేపు ఆలోచించి, చివరకు, "నీ కోరిక నిరాకరించను. అన్నమాట నిలబెట్టుకుంటాను. తిలోత్తమ నాకు కోడలు కావటానికి అన్ని విధాలా యోగ్యురాలు, అందులో ఎలాటి సందేహమూ లేదు. ఇక నుంచి ఆమెకు రాణివాసపు మర్యాదలన్నీ జరిపిస్తాను," అన్నాడు.

"ఇందుకు నేను మీకు యావజ్జీవం కృతజ్ఞురాలిని," అన్నది తిలోత్తమ.

నవాబునందిని అయేషా పాట్నానగరానికి వచ్చిందనీ, ఒక ధనికుడైన పఠాను ఇంట అతిథిగా ఉంటున్నదనీ మానసింహుడికి గూఢచారుల ద్వారా తెలిసింది. పఠానులకూ మొగలులకూ సంబంధాలున్నాయి, వారు స్వేచ్ఛగా వస్తూ పోతూ ఉంటారు. అయేషా బహిరంగంగా పాట్నాకు వచ్చి ఉండినట్టయితే, కతలూఖాన్ కుమార్తెకు చేయవలసిన స్వాగత మర్యాదలు మానసింహుడు జరిపి ఉండేవాడు. ఆమె రహస్యంగా రావటం చేత అతనికి ఆ అవసరం లేకుండాపోయింది. అయితే బంగాలులో ఉన్న పఠానులందరూ సంతో



షంగా మొగలాయీ ప్రభుత్వం కింద ఉన్నవారు కారు. ఒరిస్సాలోని పఠానులు చూడబోతే తమ ఆధిపత్యం కోసం యుద్ధ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. అలాటి పరిస్థితిలో ఆయమా రహస్యంగా ఒరిస్సా నుంచి వచ్చి, పాట్నాలోని ఒక పఠాను ధనికు ఇంట అతిథిగా వుండటం అను మానాస్పదం. అయినా మానసింహుడు ఈ విషయం అంతగా పట్టించుకోలేదు.

కాని ఒక వారం తరవాత ఒక దుర్వార్త తెలిసింది. ఒరిస్సా నవాబులైన సులేమాన్ ఖాన్, ఉస్మాన్‌ఖాన్‌లు పూరీ నగరం పైన వచ్చిపడ్డారట, రామచంద్రదేవుడు పారి పోయాడట. మానసింహుడు వెళ్ళిపోయిన కొద్దిరోజులకే ఉస్మాన్‌ఖాన్ ఈ పని చేసి, పఠానులకూ మొగలులకూ మధ్య జరిగిన సంధిని భగ్నం చేశాడు.

ఈ వార్త వినగానే మానసింహుడికి దారుణమైన ఆగ్రహం కలిగింది. పఠాను అనే వాళ్ళు ప్రపంచంలో లేకుండా చెయ్యా లని తీర్మానించుకుని ఆయన, యుద్ధానికి సిద్ధం కావలసిందని తన సేనలకూ, సేనా పతులకూ హెచ్చరిక చేశాడు. మానసిం హుడు ఉస్మాన్‌ఖాన్‌ను మానసిక వ్యధకు గురి చెయ్యగల స్థితిలో ఉన్నాడు—



ఆయమాను నిర్బంధంలో ఉంచినట్టయితే ఉస్మాన్ ప్రాణం గిలగిలా తన్నుకుంటుంది. అందుచేత ఆయన తాజ్‌ఖాన్ అనే వాడి ఇంటిని చుట్టుముట్టమని కొందరు సైనికు లను పంపాడు.

ఈ తాజ్‌ఖాన్ అనే పఠాను ఇంటనే ఆయమా దిగింది. తాజ్‌ఖాన్ కాశ్మీరుబేగముకు దూరపు బంధువు. తాజ్‌ఖాన్ భార్య అనేక పర్యాయాలు కతలూఖాన్ రాజభవనానికి వెళ్ళివచ్చింది. ఆయమాను ఒక్కసారి తమ ఇంటికి రమ్మని ఆమె కోరిఉన్నది కూడా. ఇంత కాలానికి తలవని తలంపుగా ఆయమా తాను వస్తున్నట్టుగా ఉత్తరం రాసి, ఆ ప్రకా

రమే పాట్నాకు వచ్చి, వారి ఇంట బస చేసి ఉన్నది. తాజ్‌ఖాన్, ఆయన భార్యా ఆమె కెంతో గౌరవ మర్యాదలతో ఆతిథ్యం నెరపుతున్నారు.

ఒక నాటి సాయంకాలం రాజభటులు వచ్చి తన ఇంటిని ముట్టడించే సరికి తాజ్‌ఖాన్ ఆశ్చర్యపడి, ముట్టడికి కారణమడిగాడు. కాని సైనికులు కారణం చెప్పలేకపోయారు.

మర్నాడు తెల్లవారు టూనే తాజ్‌ఖాన్ మానసింహుడి వద్దకు వెళ్ళాడు. ఆయన తన ఇంటిని భటులు చుట్టుముట్టారని అంటే మానసింహుడు, "మీ ఇంట కతలూఖాన్ కుమార్తె ఉన్నది. ఆమెను పట్టుకోవటానికి భటులు వెళ్ళారు. ఆమెను వారికి అప్పగించినట్టయితే ముట్టడి ఎత్తేస్తారు," అన్నాడు. తాజ్‌ఖాన్ కీ మాట పూర్తిగా అర్థం లేని మాటగా కనబడింది.

"మహారాజా, నేను వర్తకం చేసుకునే వాణ్ణి. మా ఇంటికి ఎందరో వచ్చిపోతూం టారు. ఈ రాకపోకలకు అవాంతరం కలిగే పక్షంలో నాకూ, నా వ్యాపారానికి తీరని నష్టం కలుగుతుంది," అన్నాడు తాజ్‌ఖాన్.

"ఈ మాటలన్నీ అప్రస్తుతం. ఆయుషాను రాజభటుల వెంట వచ్చేటందుకు ఒప్పించే భారం మీది. ఆమె కెటువంటి అమర్యాదా జరగదు. ఆమె మా అంతఃపురం లోనే ఉంటుంది," అన్నాడు మానసింహుడు.

"నా శరీరంలో ప్రాణం ఉండగా నా అతిథిని ఒప్పగించను," అని ప్రకటించి, ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు తాజ్‌ఖాన్.

ఈ సంగతి ఆయుషాకు తెలిసింది. ఆమె తాజ్‌ఖాన్‌తో తనకు మానసింహ మహారాజును చూడాలని ఉన్నట్టు చెప్పింది. దానికి తగిన ఏర్పాట్లు జరిగిన మీదట ఆమె తాజ్‌ఖాన్‌నూ, ఇద్దరు పరిచారకులనూ వెంటబెట్టుకుని మానసింహ మహారాజు వద్దకు వెళ్ళింది. —(ఇంకా వుంది)






## 7

తన వద్దకు తానుగా వచ్చిన అయేషాను చూసి మానసింహుడు, "అమ్మా, నీవు కుమార్తె లాటి దానవు. రాజకీయ కారణాల వల్ల నీకు కొంచెం శ్రమ కలిగిస్తున్నందుకు నాకు విచారంగా ఉన్నది. నీ కేమైనా చెప్పుకోవలిసినది ఉంటే నిస్సంకోచంగా చెప్పుకోవచ్చు" అన్నాడు.

"చెప్పుకోవటాని కేమీ లేదు. మీ అంతఃపురంలో కొంతకాలం ఉండటానికి నా కేలాటి సంకోచమూ లేదు," అన్నది అయేషా.

"చెప్పటానికి నీ కేమీ లేకపోయినా, నేను వినవలిసినది చాలా ఉన్నది. నా ప్రశ్నలకు సరిఅయిన సమాధానా లిస్తే చాలా సంతోషిస్తాను."

"నా జీవితంలో రహస్యంగా ఉంచదగిన దేమీ లేదు. అందుచేత మీ రడిగే ప్రశ్నలకు నిజమే చెబుతాను."

"మీ వాళ్ళనందరినీ ఒరిస్సాలో విడిచి పాట్నా కెందుకొచ్చావు?"

"మీ కుమారుడు జగత్సింహుణ్ణి చెర విడిపించదామని వచ్చాను."

"ఏ ఉపాయం ద్వారా ఆ పని చేద్దామనుకున్నావు?"

"యువరాజా వద్ద నుంచి పాదుషాకు విజ్ఞాపన పత్రం పంపించి."

"సుబేదారును నే నుండగా నాకు తెలియకుండా పాదుషాకు విజ్ఞాపన పత్రం ఎలా పంపుదామనుకున్నావు?"

దామోదర ముఖర్జీ





"మీరే కద అతనికి స్వయంగా శిక్ష విధించింది? దానికి విరుద్ధంగా జరిగే ప్రయత్నానికి మీరు సహాయపడతారా? అలా చేస్తే మీరు నవ్వులపాలు కారా?"

"విజ్ఞాపన పత్రం సిద్ధం కావద్దా?"

"అది ఎప్పుడో సిద్ధమయింది. ఈ పాటికి ప్రయాగ దాటి వెళ్ళి ఉంటుంది కూడా."

"జగతసింహుడి దొంగసంతకంతోనా?"

"కాదు, కారాగృహంలో ఉన్న జగతసింహుడు పత్రాన్ని చదువుకుని సంతకం చేశాడు."

"అతడు కారాగృహంలో ఉంటే ఎలా ఆ పత్రం అతనికి చేరింది?"

"అది సులభంగా జరగలేదు. కారాగారాధికారికి పెద్దలంచం పెట్టవలసివచ్చింది."

"నీవు నిజంగా గొప్ప కార్యదీక్ష గల దానవే. విజ్ఞాపన పత్రం పాదుషా చేతి కందటానికి కూడా తగిన ఏర్పాట్లు చేశావా?"

"చేశాను. అది దర్బారుకు వెళ్ళిన మరుక్షణమే పాదుషాకు అందుతుంది, వెంటనే తగిన ఉత్తరువులు జారీ అవుతాయి. పని సానుకూలం కావటానికి ఎలాటి సందేహమూ లేదు."

ఈ మాట మానసింహుడికి చాలా ఆనందం కలిగించింది.

"నీ వింత కష్టపడి ఈ పని కెందుకు పూనుకున్నావో తెలుసుకోవాలని ఉన్నది," అన్నాడు మానసింహుడు. ఆయువా జవాబు చెప్పక తల వంచుకున్నది.

"చెప్పటం నీ కిష్టం లేదు లాగుంది. నేను నిన్నా మాట అడగను. జగతసింహుణ్ణి కారాగృహంలో చూశావా?"

"లేదు."

"నీ సమాచారం అతనికి అందించావా?"

"లేదు."

"నీ కృషికి ఫలితంగా జగతసింహుడు విడుదల అయినప్పుడైనా అతన్ని చూస్తావా?"





"చూడను. అయన్ని చూడాలన్న కోరిక నాకు లేదు," అన్నది అయుషా.

అయుషాకూ, జగతసింహుడికీ మధ్య ఉన్న ప్రేమ పరిస్థితిని గురించి మానసింహుడు లోగడ విన్నదానికీ, ఆమె ఇప్పుడు చెప్పే సమాధానాలకూ బాగానే అతికింది.

"అమ్మా, రాజకీయ కారణాల వల్ల నిన్ను కొద్దికాలం నిర్బంధంలో ఉంచవలసి వచ్చినందుకు నాకు చాలా బాధగా ఉన్నది. ఒరిస్సాలో పఠానులు యుద్ధం తెచ్చి పెట్టారు. నేను రేపక్కడికి బయలుదేరి పోతున్నాను. ఆ యుద్ధం ముగిసే దాకా నీవు యిక్కడే ఉంటావు. ఈ యుద్ధం గురించి నీవు చెప్పదగిన దేమైనా ఉన్నదా?" అని మానసింహుడు అయుషా నడిగాడు.

"ఆ విషయాలు ఆడవాళ్ళ కేం తెలుస్తాయి?" అన్నది అయుషా.

"ఉస్మాన్‌ఖాన్‌కు చెప్పవలసిం దేమైనా ఉన్నదా?"

"ఏముంటుంది? నవాబు సాహసి, పరాక్రమవంతుడు. నేనతనికి సలహా లివ్వటం సాహస మవుతుంది. తాను చేయదలిచిన దాని పరిణామం ఎలా ఉండేదీ అతనికి తెలుసు. అతను దానికి సిద్ధపడే ఉంటాడు."



"యుద్ధం నుంచి తిరిగి వచ్చి నీతో తీరికగా మాట్లాడతాను. ఇప్పుడు నాకు చాలా పనులున్నాయి. తాజ్‌ఖాన్‌ను అతని ఇంటికి పంపెయ్యి," అంటూ మానసింహుడు వెళ్ళిపోయాడు.

పెద్ద ఎత్తున యుద్ధ ప్రయత్నాలు చేసుకుని మానసింహుడు ఒరిస్సాకు వెళ్ళాడు. వర్ధమానం నుంచి సయ్యద్‌ఖాన్ కూడా పెద్ద సేనతో వచ్చాడు.

పఠానులైనప్పటికీ తక్కువ సన్నాహం చెయ్యలేదు. సంధి భంగం వెంబడి యుద్ధం అనివార్యంగా జరుగుతుందని తెలిసినవాడు కావటం చేత ఉస్మాన్‌ఖాన్ అనేక మాసా



బుగా మొగలులతో - యుద్ధానికి సర్వ
సన్నద్ధుడై ఉన్నాడు.

వనపూర్ సమీపాన ఉభయ పక్షాలూ
తలపడ్డాయి. పఠానులు యుద్ధరంగంలోకి
ఏనుగులను జాస్తిగా తెచ్చారు. మొగలా
యీలు అనేక ఫిరంగులను తెచ్చారు.
ఫిరంగుల కాల్పులు విని ఏనుగులు
భయంతో వెర్రెత్తిపోయి, మావటివాళ్ళ
చెప్పుచేతలలో ఉండక, సైన్యాన్ని ధ్వంసం
చేస్తూ అన్ని వైపులా పరిగెత్తసాగాయి. పఠా
నులు ఏనుగులను తీసుకురావటం పొరపా
టయింది. ఆ పొరపాటు వల్ల వాళ్ళ
వ్యూహం కాస్తా చెదిరిపోయింది.



అయినప్పటికీ పఠానులు దీక్షతోనే
పోట్లాడారు, యుద్ధం భయంకరంగానే
సాగింది. కాని, మొదటి దెబ్బ నుంచి
వారు కోలుకోలేక అపజయం పొందారు.
వనపూర్‌లో విజయం సాధించిన మానసిం
హుడు అంతతో తృప్తి చెందక కోట వెంబడి
కోటా, నగరం వెంబడి నగరమూ, ఆక్ర
మించుకుంటూ ఒరిస్సాను వశపరుచు
కున్నాడు. జలేశ్వరమూ, కటకమూ, పఠా
నుల రాజధాని అయిన స్వర్ణదుర్గమూ
మొగలాయీలకు లొంగిపోయాయి. ప్రతి
కోట పైనా మొగలాయీ పతాక ఎగిరింది.
ఉస్మాన్‌ఖాన్ గత్యంతరం లేక ఓటమి
అంగీకరించాడు. సులేమాన్‌ఖాన్, ఉస్మాన్
ఖాన్‌లు అక్బరుకు సామంతులు కావటానికీ,
కప్పం కట్టటానికీ అంగీకరించారు. ఒరిస్సా
మొగలు సామ్రాజ్యంలో చేరిపోయింది.

ఈ విజయానికి అక్బరు పాదుషా చాలా
సంతోషించాడు, ఎందుకంటే ఒరిస్సా
చాలా కాలంగా ఆయనకు పక్కలో బల్లెంగా
ఉంటూ వచ్చింది. ఆయన మానసింహుణ్ణి
బెంగాలు, బిహారులతో బాటు ఒరిస్సాకు
కూడా సుబేదారుగా నియమించాడు.

చివర కిలా అవుతుందని ఉస్మాన్
కలలో కూడా అనుకోలేదు. అతని ఆశ







లన్నీ అడుగంటి పోయాయి. యుద్ధం చేస్తున్నంత కాలమూ అతని మనస్సు నిలకడ లేక రకరకాల ఆందోళనలకూ, విచారాలకూ, బాధలకూ గురి అయింది. యుద్ధం కొద్ది రోజుల కాలంలో ముగుస్తుందనగా అయిషా అంతఃపురం నుంచి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోవటంతో ఉస్మాన్ ఖాన్‌కు ప్రపంచ మంతా చీకటి అయిపోయి నట్టయింది. ఎందుకంటే అతను తన ప్రాణాలన్నిటినీ ఆమె పైనే నిలుపుకున్నాడు, తన ఆనంద మంతా ఆమెలోనే చూసుకున్నాడు. ఆమెతోనే అతని అదృష్టం కూడా వెళ్ళిపోయింది.

మానసింహుడి అంతఃపురంలో ఉన్న అయిషాకు పఠానుల అపజయ వార్తలు ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉన్నాయి. ఆమె అక్కడ ఉన్న రెండునెలల కాలంలోనూ ఉస్మాన్‌ఖాన్ పరిస్థితి అధఃపాతాళమంటింది. అతని అపజయాలకు నిరుత్సాహమే కారణమనీ, నిరుత్సాహానికి తాను అతని సామీప్యాన్ని విడిచి వచ్చెయ్యటమే కారణమనీ అయిషా అనుకున్నది. తాను కృతఘ్నురాలుగా ప్రవర్తించా ననుకున్నది. తన కృతఘ్నతకు ఫలితంగా ఒరిస్సా అంతా మొగలు లాక్రమించటమే గాక, ఉస్మాన్ ఢిల్లీ పాదుషాకు సామంతు డయిపోయాడు. అత నింకా ప్రాణాలతో ఉన్నాడంటే అది అయిషా కోసమే కావాలి.

మానసింహుడు త్వరలోనే పాట్నాకు తిరిగి వస్తున్నాడని తెలిసింది. ఆయన ఏ ఉద్దేశంతో నైతే తనను బందీని చేశాడో ఆ ఉద్దేశం నెరవేరింది; ఉస్మాన్ యుద్ధంలో దెబ్బ తిన్నాడు.

ఒకనాడు పగలు మూడుజాముల వేళ అయిషా వద్దకు తిలోత్తమ వచ్చింది. ఎంతో కాలం తరవాత వాళ్ళు తిరిగి కలుసుకున్నది ఇప్పుడే. ఇద్దరూ ఆలింగనం చేసుకుని కన్నీరు కార్చారు.





"నిన్ను మళ్ళీ చూస్తా ననుకోలేదు. నిన్ను నీ మామగా రాదరించినట్టు విని చాలా సంతోషించాను," అన్నది అయేషా.

"సంతోష మేముంది? ఆయన ఇంకా కారాగృహంలోనే ఉన్నాడు," అన్నది తిలోత్తమ.

"వీరపత్ను లెంత ధైర్యంగా ఉండాలి! ఈ కాస్తకే విచారిస్తున్నావా? ఆయన త్వరలోనే విడుదల అవుతారు."

జగతసింహుడి విడుదలకు ప్రయత్నాలు జరుగుతున్నాయనీ, విజ్ఞాపన పత్రం తీసుకుని అఖిలాషుస్వామి ఢిల్లీనగరానికి బయలు దేరి వెళ్ళాడని తిలోత్తమకు తెలియదు. ఆ విషయాలన్నీ అయేషా అప్పుడామెకు చెప్పింది.

వారిద్దరూ జగతసింహుణ్ణి ప్రేమిస్తున్న వారే, కాని ఆ ప్రేమలలో ఎంతో వ్యత్యాసం ఉన్నది. జగతసింహుడి ఎడబాటు ప్రతి క్షణమూ తిలోత్తమను బాధిస్తున్నది. అయేషా అతన్ని తిరిగి చూడకుండా ఉండ టానికి మనస్సును దృఢం చేసుకున్నది; తాను యువరాజును ప్రేమిస్తున్న సంగతి ఇతరులకు తెలియటం కూడా ఆమె కిష్టం లేదు, ఆఖరుకు జగతసింహుడికి కూడా తెలియరాదనే ఆమె ఉద్దేశం.

తిలోత్తమ మనస్ఫూర్తిగా అయేషాను తన సపత్ని కమ్మనీ, యువరాజును పెళ్ళాడమనీ, అతని ప్రేమను తా మిద్దరూ పంచుకోవాలనీ కోరింది. అయేషా ఆ కోరికను నిరాకరించింది. ఆమె తిలోత్తమను కౌగలించుకుని, "మన మిక కలుసుకోం. నేను ఒరిస్సాకు తిరిగిపోతాను. మొగలాయీలకూ పఠానులకూ సఖ్య మనేది పొసగ వచ్చే కనిపిస్తుంది. పఠానులు అంతరించి పోవటమే జరిగితే, అయేషా పేరు కూడా వారితోనే అంతరిస్తుంది. నేను చనిపోతే ఆ వార్త మీకు అందుతుందని కూడా అనుకోను. ఇదే మన ఆఖరి చూపు," అన్నది.



తరవాత ఊర్మిళ పిలుపు రాగా, తిలోత్తమ వెళ్ళిపోయింది.

మానసింహుడు తిరిగి వచ్చాడు. ఆయిషా నిర్బంధం చాలావరకు సడలింది, కాని, పూర్తిగా పోలేదు. తాజ్‌ఖాన్ కుటుంబం ఆమెను చూడవచ్చారు. అభిరామస్వామి ఢిల్లీకి పోయే దారిలో విజ్ఞాపన పత్రాలూ, ధనమూ, గుర్రాలూ చోరీ అయిపోయిన వార్త ఆమెకు తెలిసింది.

ఆయిషా ఉస్మాన్‌ఖాన్ కొక దీర్ఘమైన ఉత్తరం రాసింది. అందులో ఆమె తాను అతన్ని విడిచి వచ్చినందుకు క్షమాపణ చెప్పుకుంటూ పశ్చాత్తాపం ప్రకటించింది. తాను అందరూ అనుకున్నట్టుగా తన ఆస్తి పాస్తులు చూసుకోవటానికి బయలుదేరి రాలేదనీ, మరొక పని మీద వచ్చాననీ, ఆ పని త్వరలోనే ముగుస్తుందనీ, ఆ పని ముగియగానే తిరిగి వస్తాననీ తెలిపింది. ఆ ఉత్తరాన్ని తాజ్‌ఖాన్ ఇంటికి మనిషి ద్వారా పంపింది.

ఆ రాత్రి కొంచెం పొద్దుపోయాక మానసింహుడూ, ఊర్మిళా ఆయిషా కోసం మనిషిని పంపారు. ఆమె వెళ్ళింది.

"అమ్మా, నీ కిప్పుడు నిర్బంధం ఏమీ లేదు. ఇకముందు ఏంచేయ దలిచావు? ఎక్కడికి వెళ్ళా లనుకుంటున్నావు?" అని మానసింహు డడిగాడు.

"ఎక్కడికి వెళ్ళేది ఇంకా నిశ్చయించుకోలేదు. కొంచెం వ్యవధి కావాలి, బహుశా ఢిల్లీకి పోతాను," అన్నది ఆయిషా.

"అక్కడే ఉండిపోవచ్చు. అక్కడ నీకు తెలిసిన వాళ్ళున్నా రనుకుంటాను. ఈ నాడు ఒరిస్సాలో పఠానులకు మిగిలిన దేమీ లేదు. వారిని నీవు విడిచిపుచ్చవచ్చు," అన్నాడు మానసింహుడు.

"మీరు చెప్పేదాన్ని బట్టి నేను వారిని విడిచిపుచ్చక పోవటమే నా ధర్మ మవుతుంది. వైభవ సమయంలో వారి అండ

ఉన్న దాన్ని కష్టకాలంలో వారిని ఎలా విడిచి పుచ్చుతాను ?"

మానసింహుడి కి మాట చెప్పుదెబ్బలా తగిలింది.

"నీ వెక్కడికీ పో నవసరం లేదు. నీవు మా దానివి. మా వద్దనే ఉంటావు," అన్నది ఊర్మిళాదేవి.

"అమ్మా, నా పైన నీకు మేరలేని ప్రేమ. కాని, యువరాజును విడిపించటానికి నేను ఢిల్లీ వెళ్ళాలి," అన్నది అయుషా.

"అందుకు గాను విజ్ఞాపన పత్రాలు వెళ్ళాయిగదా?" అన్నాడు మానసింహుడు.

"వాటిని దారిలో దొంగలెత్తుకుపోయారట. నేను స్వయంగా వెళ్ళితే 'పని జరిగే అవకాశం ఉన్నది."

"శిక్ష పొందిన వాడి కిలా సహాయపడటం అపరాధమవుతుంది. దాన్ని ఒకసారి క్షమించాను. ఈ సారి క్షమించను, నిన్ను శిక్షిస్తాను," అన్నాడు మానసింహుడు.

"శిక్షించే అధికారం మీ కున్న మాట నిజమే గాని, దాన్ని మీరు వినియోగించుకోరు," అన్నది అయుషా.

"ఎందుచేత?" అన్నాడు మానసింహుడు.

"మీకు కావలసింది యువరాజా విడుదల గనక! మీ ప్రతిష్ఠ పెంపొందించుకోవటానికి మీ కుమారుణ్ణి మీ చేత్తోనే శిక్షించారు. కాని అతను శిక్ష అనుభవించటం మీ కిష్టం లేదు."

"అందులో నీ స్వార్థం మటుకు లేదా?"

"ఇద్దరిదీ స్వార్థమే అయినప్పుడు మీరు నన్ను దండించి ఏం సుఖపడగలరు?"

ఊర్మిళ కల్పించుకుని, "ఏమయింది, నిన్ను మాత్రం నేను నా కూతురుగా చేసుకోకుండా వదిలిపెట్టను," అన్నది.

"అమ్మా, నే నంత అదృష్టానికి నోచుకోలేదు. నా భవిష్యత్తు అదివరకే నిర్ణయమై పోయింది," అన్నది అయుషా.

—(ఇంకా ఉంది)





# నవాబునందిని

## 8

జగతసింహుణ్ణి చెర విడిపించటానికై విజ్ఞాపన పత్రం తీసుకుని అభిరామస్వామి మరి అయిదుగురితో సహా ఢిల్లీకి బయలుదేరాడు. అందరూ గుర్రాల పైనే ప్రయాణించారు. విజ్ఞాపన సఫలం కావాలంటే చాలా ధనం ధారపోయవలసి ఉంది. అందుచేత ఆయిషా అభిరామస్వామికి అనేక రత్నాలూ, మోసేటంత డబ్బూ ఇచ్చి పంపింది. అంతే గాక అభిరామస్వామి పని తేలిక కాగలందులకు, ఢిల్లీ అంతఃపురం లోనూ, దర్బారు లోనూ తాను పూర్వం ఎరిగిఉన్న వారికి ఉత్తరాలు రాసింది, మానసింహుడి చెల్లెలైన బేగముకు స్వయంగా ఒక విజ్ఞాపన పత్రం కూడా రాసింది. ఈ ఉత్తరాలన్నీ చేరవలసిన వారికి చేరితే పని జరిగిపోవటానికేమీ సందేహం లేదు. ఆ విషయంలో ఆయిషా కొంచమైనా లోపం చెయ్యలేదు.

ముందు అభిరామస్వామిని ఢిల్లీ చేరి కొంత యత్నం చెయ్యనిచ్చి, వెనకగా తాను కూడా అక్కడికి వెళ్ళాలని ఆయిషా అనుకున్నది. కాని ఆమె మానసింహుడి అంతఃపురంలో బందీ కావటంతో ఆ పనికి ఆటంకం కలిగింది. అయినా ఆమె విచారించ లేదు. ఏమంటే బందీ కాక పూర్వమే ప్రయత్నం సఫలం కావటానికి అవసరమైన ఏర్పాట్లన్నిటినీ ఆమె చేసేసింది.

ఢిల్లీకి బయలుదేరిన అయిదో రోజున అభిరామస్వామి, తన అనుచరులతో

దా మో ద ర ము ఆ ర్ట్



కాన్పూరు చేరుకున్నాడు. అక్బరుపాదుషా ఢిల్లీలో లేడనీ, ఆగ్రాకు వచ్చి ఉన్నాడనీ ఆయనకు కాన్పూరులో తెలిసింది. ఇది ఆయనకు శుభశకునంగా కనబడింది. ఎందుచేతనంటే, కాన్పూరు నుంచి ఆగ్రాకు రెండు రోజులలోనే చేరిపోవచ్చు.

ఆరుగురు ప్రయాణీకులు మధ్యాహ్నం వేళ దాటి కాన్పూరు చేరి, అంగడి వీధికి సమీపంలో ఉన్న పెద్ద మర్రిచెట్ల కింద దిగారు. గుర్రాలు అలిసి ఉన్నాయి. అభిరామస్వామి ఒక మర్రిచెట్టు కిందా, మిగిలిన అయిదుగురూ గుర్రాలతో సహా మరొక మర్రిచెట్టు కిందా మజిలీ చేశారు.

అభిరామస్వామి తన వీపున వేళ్ళాడే చర్మాన్ని నేల పైన పరిచి, తన రొమ్ముకు కట్టుకుని ఉన్న మూటను దాని కింద తలగడగా ఉంచి పడుకున్నాడు. ఆ మూటలో జగతసింహుడి విజ్ఞాపన పత్రమూ, అయన ఇచ్చిన రత్నాలూ, ఉత్తరాలూ మొదలైనవన్నీ ఉన్నాయి.

మిగిలిన అయిదుగురూ గుర్రాలకు మేత వేయటమూ, వంటచెయ్యటమూ మొదలైన ప్రయత్నాలలో నిమగ్నులయారు. ఆ అయిదుగురూ ఒకే వంటలో భోజనం చేసేవారు. "తమ రేం చెయ్యమన్నారు?" అని వాళ్ళు అభిరామస్వామి నడిగారు. "నాకు వేరే ఏమీ వద్దు. ఇంత పిండిలో చక్కెర కలిపి తీసుకుంటాను," అన్నా డాయన.

వాళ్ళు వంట ప్రారంభించే సరికి సాయంకాల మయింది. వంట అయే లోపుగా దీపసామగ్రి తెచ్చి దీపాలు కూడా వెలిగించుకున్నారు. రాత్రి ఎనిమిదిగంటల వేళ వాళ్ళు భోజనాలకు కూర్చోబోతూండగా అంగడి వీధిలో ఇళ్ళు అంటుకున్నాయి. పెద్ద కోలాహలం బయలుదేరింది. తన వెంట వచ్చిన వారితో అభిరామస్వామి, "చూస్తూ ఉండిపోకండి. వెళ్ళి ఇళ్ళు తగలబడేవాళ్ళకు సహాయపడండి," అన్నాడు.

వాళ్ళు భోజనం చేసే ప్రయత్నం మాను కుని మంట లార్పటానికి వెళ్ళారు. ఇంతలో సమీపంలోనే ఎవరో స్త్రీ, "అయ్యో, నా బిడ్డ! రక్షించండి! రక్షించండి!" అని ఏడవసాగింది. అభిరామస్వామి అటుగా పరిగెత్తిపోయి, కాలిపోతున్న ఒక ఇంటి నుంచి ఒక బిడ్డను బయటికి తీసుకువచ్చి, ఆ బిడ్డను దుర్మరణం నుంచి కాపాడి తల్లికి అచ్చేశాడు.

మంటలు అదుపులోకి వచ్చేసరికి రాత్రి పన్నెండయింది. అభిరామస్వామి మనుషులు తమ చోటికి తిరిగి వచ్చారు. అభిరామస్వామి కూడా వారితోనే వచ్చేశాడు. వాళ్ళు తిరిగి వచ్చేసరికి ఒక్క గుర్రం లేదు. ఒక్క వంటకం కూడా లేదు, ఒక్క చెంబు గాని, పాత్ర గాని లేదు. అభిరామస్వామి చర్మం కింద దాచుకున్న మూట కూడా పోయింది. అభిరామస్వామి నిశ్చేష్టుడై కూలబడిపోయాడు. ఇలా అవుతుందని ఆయన ఎన్నడూ అనుకోలేదు. ఎంతో కాలంగా చేసిన ప్రయత్నాలన్నీ కలలాగా కరిగి మాయమైపోయాయి.

ఆ ఆరుగురూ మిగిలిన రాత్రి మర్రి చెట్టు కిందనే గడిపి, తెల్లవారగానే కొత్వాలు దగ్గిరికి వెళ్ళారు. ఆ కొత్వాలు ప్రచండుడు. అతని కచేరీ పాడుపాల దర్బారు కన్న







కూడా భయంకరమైనది. ఈ కొత్వాలు ఎదురుగా కనిపించిన వాళ్ళి, కారణం ఉన్నా లేకపోయినా, దండించే రకం. అభిరామస్వామి ఒకవంక తమ సొత్తు చోరీ అయిపోయిన విషయం చెబుతూంటే అంతా విని కొత్వాలు, "వీళ్ళు దొంగల్లా గున్నారు. ఈ సన్యాసి వేషం వేసినవాడు ఆరితేరిన చోరుడు. వీళ్ళెక్కడి నుంచో దొంగతనాలు చెయ్యటానికి వచ్చి, తాము మంచి వాళ్ళమని వేసనుకొగలందులకు ముందుగానే దొంగతనం జరిగిందంటూ నా దగ్గిరికి వచ్చారు. ముందు వీళ్ళను ఖైదులో పెట్టండి," అని సేవకుల నాజ్ఞాపించాడు.

అభిరామస్వామి పెద్ద చిక్కులో పడి పోయారు. ఖైదు చీకటి గానూ, దుర్గంధంతో కూడుకుని ఉన్నది. వారిని కాజీ ఎదుట విచారిస్తాడు. కొత్వాలే అనుకుంటే కాజీ ఆతన్ని మించినవాడని తెలిసింది. ఆయన తమకు జైలు శిక్ష వెయ్యటం ఖాయం అను కుని వాళ్ళు ఖైదు నుంచి తప్పించుకు పోవటానికి నిశ్చయించుకున్నారు. కిందటి రోజల్లా వారికి తిండి లేదు, ఈ రోజు కూడా లేదు. అందరూ నీరసించి ఉన్నారు. అయి నప్పటికీ ఆ అర్థరాత్రి వేళ, ఎత్తున ఉన్న కిటికీ కమ్మి ఊడగొట్టి, ఆ రంధ్రం నుంచి ఒక్కరొక్కరుగా బయటపడ్డారు.

తెల్లవారే లోపునే ఆ ఆరుగురూ రెండు ముఠాలుగా చీలారు. అభిరామస్వామి వెంట వచ్చిన వారిలో ముగ్గురు పాట్నాకు తిరిగి వెళ్ళిపోయి, తాజ్‌ఖాన్ ఇంటికి వెళ్ళి, నవాబునందినికి జరిగిన దంతా చెప్పేటట్టూ, అభిరామస్వామి మిగిలిన ఇద్దరు అనుచ రులతో ముందుకుసాగి ఆగ్రాకు వెళ్ళేటట్టూ నిశ్చయమయింది.

పాట్నా చేరుకున్న ముగ్గురు మనుషులూ తమ పని నెరవేర్చలేకపోయారు. ఎందు చేతనంటే, తాజ్‌ఖాన్ ఇంట నవాబునందిని ఆయుపా లేదు; ఆమె మావసింహుండి ఇంట



బందీగా ఉన్నది. ఆమెను గాని, కారా గృహంలో ఉన్న జగతసింహుణ్ణి గాని చూడటం వారికి అసాధ్యమయింది.

ఆగ్రా నేసి అరణ్యమార్గాన బయలు దేరిన అభిరామస్వామీ, అతని అనుచరు లిద్దరూ దారిలో అడవిపళ్ళూ ఆకీ తిని, నదిలో నీరు తాగి ఆకలిదప్పి అణచు కున్నారు; రాత్రి వేళ చెట్ల మీద కొమ్మలకు తమనుతాము బంధించుకుని కునుకు తీశారు. ఈ విధంగా రెండు రోజులు ప్రయా ణించి మూడోనాటి ఉదయం ఆగ్రా సమీ పంలో యమునా నదికి ఉత్తరంగా ఉండే అరణ్యం చేరుకున్నారు.

అక్కడి దారి వెంట పోతూండగా అభి రామస్వామి దారిలో కొత్తగా పడిన గుర్రపు డెక్కల గుర్తులు చూశాడు. ముగ్గురూ వాటి వెంబడి కొంత దూరం ముందుకు వెళ్ళే సరికి ఆ గుర్తులు దక్షిణంగా మళ్ళి, ఇంకొక మార్గం పట్టాయి. అవి అలా కొంత దూరం వెళ్ళి మరొక అరణ్యంలో మాయమయాయి. అభిరామస్వామి తన వెంట ఉన్న వారిలో ఒకణ్ణి పిలిచి, "కొంచెం అరణ్యంలోకి వెళ్ళి, ఏమైనా కనిపిస్తుందేమో చూసి రాగలవా?" అన్నాడు.

ఆ మనిషి అలికిడి కాకుండా వెళ్ళి తిరిగి వచ్చి, "దగ్గరలోనే మన అదు





గుర్రాలూ, పోయిన మన వస్తువులూ ఉన్నాయి. వాటి వెంట పదిమంది మనుషు లున్నారు." అని చెప్పాడు. వాళ్ళే దొంగ తనం చేసినవాళ్ళని తెలిసిపోయింది.

"నే నాగ్రాకు వెళ్ళి సిపాయిలను తీసుకు వస్తాను. మీ రిద్దరూ ఇక్కడే ఉండి దొంగ లను ఒక కంట కనిపెట్టి ఉండండి. నేను వచ్చే లోగా వాళ్ళు ఈ స్థలం విడిచి మరొక చోటికి వెళితే, మీలో ఒకడు వారి వెనక జాగ్రత్తగా వెళ్ళి, వాళ్ళు కొత్త మకాం ఎక్కడ పెట్టినదీ తెలుసుకురావాలి," అని తన మనుషులను హెచ్చరించి అభిరామ స్వామి ఆగ్రాకు బయలుదేరాడు. ఆయన



ఆ సాయంకాలం తిరిగి రాగలుగుతా ననుకున్నాడు, కాని ఆయన మర్నాడు ఉదయానికి గాని కొత్వాలునూ, సిపాయిలనూ వెంటబెట్టుకుని తన అనుచరుల వద్దకు రాలేకపోయాడు.

వాళ్ళు వచ్చే దాకా దొంగ లక్కడే ఉన్నారు. వాళ్ళు తేలికగా పట్టుబడ్డారు. అభిరామస్వామి బృందం పోగొట్టుకున్న వస్తువులన్నీ వాళ్ళ వద్ద దొరికాయి. కాని అవి వెంటనే అభిరామస్వామి చేతికి అందలేదు. కొత్వాలు స్వాధీనపరుచుకున్నాడు. దొంగలను కాజీ విచారణ చెయ్యాలి, అభిరామస్వామి మొదలైన వాళ్ళు తమ వస్తువుల ఆనవాళ్ళు చెప్పి, అవి తమవేనని రుజువు చెయ్యాలి; అంత దాకా అవి వారికి అందవు. అభిరామస్వామి తిరిగి హతాశుడయాడు.

ఆయన వద్ద చిల్లిగవ్వ కూడా లేదు, బిచ్చమెత్తుకుని కాలక్షేపం చెయ్యవలిసిందే. ఒక రాజపుత్ర సైనికుడు తటస్థపడి ఆయన కొక రూపాయి ఇచ్చి, పోయిన వస్తువులు సాధ్యమైనంత త్వరలో ఆయనకు తిరిగి లభించేటట్టు చూస్తా నన్నాడు. అభిరామ స్వామి చేతులు కట్టుకుని కూర్చోక, నగర మంతా తిరుగుతూ కనిపించిన ప్రతి హిందు-



వృత్తికీ, ముసల్మానులకూ తనకు కలిగిన చిక్కులన్నీ గాథగా చెప్పసాగాడు. త్వరలోనే ఆ గాథ నగర మంతా పాకింది.

ఆయుషా ఆగ్రాకు వచ్చి ఒక ఉమ్రావు ఇంట ఉంటున్నట్టు తెలిసింది. కాని అభిరామస్వామి ఆమెను కలుసుకో లేక పోయాడు. అయితే మరొక విధంగా పని సానుకూల మయేటట్టు కనబడింది. కొత్వాలు వద్ద ఉన్న ఉత్తరాలూ, ధనమూ మొదలైన వన్నీ తనకు పంపమని పాదుషా ఆజ్ఞ అయిందట. ఆయుషా ఏదో తంత్రం నడుపుతున్నది. పత్రాలన్నీ చేరవలసిన చోటికి చేరాయి గనక అభిరామస్వామి బరువు దిగిపోయింది. ఆయన స్వదేశానికి తిరిగి వెళ్ళ నిశ్చయించుకుని, ఆయుషాను కలుసుకునే టందుకు మరొక ప్రయత్నం చేశాడు. అది విఫలమయింది.

మర్నాడు ఉదయం ఆయన కొత్వాలును చూడబోయాడు. కొత్వాలు ఆయనకూ, ఆయన అనుచరులకూ, అయిదువందల మొహరీ లిచ్చి, వాళ్ళు తమ గుర్రాలను తీసుకుని వెళ్ళిపోవచ్చునని చెప్పాడు. ఆయన ఆఖరుసారి ఆయుషాను చూసే ప్రయత్నంలో ఉమ్రావు ఇంటికి వెళ్ళాడు. ఆయుషా కనిపించలేదు గాని, ఆయన కొక ఉత్తరం అందజేసింది.



"మనం ఈ జన్మలో తిరిగి కలుసుకోమనుకుంటాను. యువరాజు జగతసింహుడు ఎల్లప్పుడూ క్షేమంగా ఉండాలని నా కోరిక. అతన్ని నేను చూడవలసిన అవసరం లేదు. నన్ను గురించి ఎవరూ ఆందోళన చెందవద్దు. నా సమాచారా లిక పైన మీకు తెలిసే అవకాశం లేదు," అని ఆయుషా రాసింది. అది చదివి అభిరామస్వామి కంట నీరు పెట్టుకుని, తన ఇద్దరు అనుచరుల తోనూ వెళ్ళిపోయారు.

ఆయుషా ఓడప్రయాణం చేసి కటకానికి రానున్నది. కటకానికి మైలు దూరాన మహానది గట్టున ఓడరేవులో ఉస్మాన్‌ఖాన్ ఇద్దరు మనుషులను వెంటబెట్టుకుని ఆయుషా రాక కెదురు చూస్తున్నాడు.

మధ్యాహ్నం దాటిన మీదట ఆయుషా వచ్చే ఓడ దర్శనమయింది. అది అనుకున్న దాని కన్న ఆలస్యమయింది. ఆయుషా కిటికీలో నుంచి తొంగి చూడటమూ, చెయ్యి ఊపటమూ గమనించిన ఉస్మాన్ మరొక ఘోరమైన విషయం కూడా చూశాడు. ఆయుషా ఎక్కిన ఓడకు క్రమంగా నీరెక్కి అది కొంచెం కొంచెమే మునిగిపోతున్నది.

ఉస్మాన్ రొమ్ము లోతు నీటిలోకి దిగి, "ఆయుషా, బయటికి దూకు. లోపల ఉన్న వాళ్ళను కూడా దూకమను. ఓడ మునుగుతున్నది," అని కేకపెట్టాడు.

ఓడ మునగకుండా చెయ్యటం కళాసులకు సాధ్యం కాలేదు. వాళ్ళు చూస్తూ ఊరుకుండిపోయారు.

"ఉస్మాన్, ఒడ్డుకు వెళ్ళిపో! ఏమిటా పని?" అని ఆయుషా కేకపెట్టింది. ఓడలో వాళ్ళు హాహాకారాలు చెయ్యసాగారు. ఆయుషా ఓడలో నుంచి బయటికి రావటానికి ప్రయత్నించక, వెళ్ళిపొమ్మని ఉస్మాన్‌కు చేత్తో సైగ చేస్తూ, ఓడతో బాటు నీటిలో మునిగిపోయింది.

—(ముగింపు వచ్చే సంచికలో)





# నవాబునందిని

## 9

మునిగిపోయిన పడవలో నుంచి బయట పడినవాళ్ళను రక్షించేందుకు ఇతర పడవలలో వాళ్ళు చాలా మంది నదిలోకి దూకారు. ఉస్మాన్‌ఖాన్ కూడా నీటిలో మునిగాడు. చాలా సేపటికి అతను పైకి తేలాడు గాని, ఏదో బరువు తనను నీటిలోకి లాగుతున్నట్టు కనిపించాడు. ఒక పడవ అతని సమీపానికి వచ్చింది గాని, అందులోకి ఎక్కడం అతనికి సాధ్యంగా కనబడలేదు. పడవలో వాళ్ళొక బట్ట కొనను కిందికి జార్చగా అతను దాన్ని పట్టుకున్నాడు. అతన్ని మెల్లిగా పైకి లాగారు. అతని వెంబడి అయుషా కూడా పైకి వచ్చింది. ఆమెలో ఏమాత్రమూ చైతన్యం లేదు.

అయితే అయుషా చావలేదు. ఆమె కోలుకుని మామూలు మనిషి కావటానికి చాలా కాలం పట్టింది. కాశ్మీరుబేగం నిద్రాహారాలు లేకుండా ఆమెకు శుశ్రూష చేసింది. ఎప్పుడూ తాగి తందనాలాడే సులేమాన్‌ఖాన్ కూడా అయుషా దుస్థితి చూసి దిగులుపడి, తాగటం మరిచిపోయి, ఆమె స్వస్థత గురించి ఆందోళన చెందాడు.

ఇక ఉస్మాన్ సంగతి వేరే చెప్పనవసరం లేదు. అతను రాత్రింబగళ్ళు అయుషా గది నానుకుని ఉన్న వసారాలోనే ఉండేవాడు.

అయుషాకు క్రమంగా స్వస్థత చేకూరింది. ఆమె పక్కమీది నుంచి లేచి ఇటూ అటూ

దామోదర ముఖర్జీ



కదిలే స్థితికి వచ్చింది. ఒకనాడు ఆమె ఉస్మాన్‌ను తన గదిలోకి పిలిచింది. గదిలో ఆమె తప్ప ఇంకెవరూ లేరు. ఆమె మంచం తప్ప కూర్చోవటాని కక్కడ మరొక ఆసనం కూడా లేదు. ఆయమె అనుమతితో ఆ మంచం మీదనే ఉస్మాన్ కూడా ఒక పక్క కూర్చున్నాడు.

ఉస్మాన్ అనుమతి లేకుండా తాను దూరదేశం వెళ్ళినందు కామె క్షమాపణ చెప్పుకున్నది.

"నువ్వు చెయ్యగూడని పని చేసినట్టు నే నెన్నడూ అనుకోలేదు. నువ్వు తిరిగి రాగానే నా శరీరంలో మళ్ళీ ప్రాణాలు ప్రవేశించి నట్టయింది. క్షమాపణ అనవసరం," అన్నాడు ఉస్మాన్.

"నేను లేని సమయంలో మన అదృష్టం తారుమారై పోయింది. అందుకు నువ్వు చింతిస్తున్నావా?"

"నువ్వు వెళ్ళావు, అదృష్టం కూడా వెళ్ళిపోయింది."

"అందు కేమీ ఉపాయం లేదా?"

"నువ్వు నా క్షేమం కోరితే ఉపాయాల కేం తక్కువ?"

"నా సుఖదుఃఖాలు నీ పైనే ఆధారపడి ఉన్నాయని ఎరగవా?"

"ఎరగటం వల్లే ఈ బొందెలో ప్రాణాలు నిలుపుకుని ఉన్నాను. కాని, కష్టకాలంలో నన్నిలా విడిచి వెళ్ళిపోయావు?"

"ఈ సంగతి నీవు నన్నడగకుండా ఉంటే బాగుండేది. యువరాజు జగత్సింహుణ్ణి చెర విడిపిద్దామని వెళ్ళాను. ముందు సాళ్వాకూ, తరవాత ఆగ్రాకూ వెళ్ళాను."

"నా కా సంగతి తెలియనే తెలియదు. నీ ప్రయత్నం ఒక విధంగా నాకూ అనుకూలమే," అన్నాడు ఉస్మాన్.

"ఎలా?"

"జగత్సింహుణ్ణి చంపటం నా జీవితాశయంగా పెట్టుకున్నాను. అతను యావజ్జీవ

కారాగృహ వాసం చేసి అక్కడే మరణిస్తే నా కోరిక నెరవేరే అవకాశం ఉండేదికాదు. అతన్ని నువ్వు విడిపించటం నాకు సహాయం చెయ్యటమే. మొహం తిప్పేసుకున్నావేం? నా మాటలు నీకు కష్టంగా ఉన్నాయా?"

"లేదు. నన్ను దేవుడెందుకు సృష్టించి ఉంటాడా అని ఆలోచిస్తున్నాను. నా వల్ల కలహద్వేషాలు తప్ప మరేమీ కలగలేదు. నీ వంటి ఉత్తమ పురుషుడు నా కోసం లోలోపల దహించుకుపోతున్నాడు!"

"అలా దహించుకు పోవటం నా కానందమే. నాకు నువ్వు దగ్గరలో ఉంటే అంతే చాలు," అన్నాడు ఉస్మాన్.

"నా మూలాన బాధపడుతూ కూడా నన్ను ద్వేషించకుండా ఎందుకు కాపాడతావు?"

"జగత్సింహుడు కారాగృహంలో ఉన్నాడంటే దేశం కాని దేశానికి పరిగెత్తావే, నువ్వు చచ్చిపోతే నాకు పిచ్చెత్తిపోదా?"

"ఉస్మాన్, నిన్ను వేడుకుంటాను. నీ మనసు నా పై నుంచి మళ్ళించి కర్తవ్యానికి పూనుకో. వీరుడివి, యోధుడివి, సాహసివి—యుద్ధంలో నీ ప్రతాపం చూపించి, సామ్రాజ్యాన్ని గెలుచుకో."

ఉస్మాన్‌ను తాను పెళ్ళాడే అదృష్టం లేదు గాని, అతని వెంటనే ఉండి, అతని కష్టసుఖా లన్నిటిలోనూ భాగం పంచుకోవ





టానికి తనకు అభ్యంతరం లేదనీ, అతని సమస్త యత్నాలలోనూ భాగస్వామిగా ఉంటాననీ అయిషా అన్నది. ఆమె అలా సహకరిస్తే తాను పోయిన రాజ్యాన్ని తిరిగి సంపాదించుకునే ప్రయత్నాలను ఉత్సాహంతో చేస్తానని ఉస్మాన్ అన్నాడు...

జగతసింహుడికి కారాగార విముక్తి లభించింది. మానసింహుడి ప్రతిష్ఠకు భంగం కలగలేదు. అక్బరుపాదుషా ఉత్తరువు పై జగతసింహుణ్ణి విడుదల చేశారు. అతను రాజోచితమైన దుస్తులు ధరించి సభాభవనానికి వెళ్ళి, తన తండ్రికి నమస్కారం చేసి, క్షమాపణ చేశాడు.



"నాయనా, నీ తప్పు అన్నిటినీ అక్బరు పాదుషా వారు క్షమించారు," అన్నాడు మానసింహుడు.

జగతసింహుడు కారాగార విముక్తి పొందటమే గాక, మానసింహుడి స్థానంలో బెంగాలు, బీహారు, ఒరిస్సాలకు సుబేదారుగా కూడా నియోగించబడ్డాడు. మానసింహుణ్ణి రావలిసిందని పాదుషా ఆజ్ఞాపించాడు. ఆ తరవాత మానసింహుణ్ణి ఏ పనికి నియోగిస్తారో తెలియదు.

తండ్రి ఆజ్ఞ ప్రకారం జగతసింహుడు తన తండ్రి ఖాళీచేసిన సింహాసనం పైన కూర్చున్నాడు. సభికులందరూ కొత్త సుబేదారుకు అభివందన చేశారు.

సభ ముగియగానే తండ్రికొడుకు లిద్దరూ ఇంటికి వెళ్ళారు. అక్కడ ఊర్మిళాదేవి మందిరంలో జగతసింహుడు తిలోత్తమను తిరిగి కలుసుకున్నాడు. తనను విష్ణుల ఊర్మిళాదేవి వద్దకు తీసుకురావటమూ, ఊర్మిళాదేవి తనను ఆదరించి, వెంట ఉంచుకోవటమూ మొదలైన విషయా లన్నిటినీ తిలోత్తమ తన భర్తకు తెలియజేసింది.

మానసింహుడు పాట్నాను సపరివారంగా వదిలి ఆగ్రాకు పోతూ, జగతసింహుడికి తోడుగా అతని తమ్ముడైన మహాసింహుణ్ణి

ఉంచి వెళ్ళాడు. అయితే తిలోత్తమ వైపు వాళ్ళు విమలా, ఉస్మానీ, లక్ష్మణ్, దిగ్గజుడూ పాట్నాకు వచ్చారు.

జగతసింహుడి రాజ్య పరిపాలన కొంత కాలంపాటు ప్రశాంతంగా సాగింది. అతనికి జీవితం ఆనందమయంగా గడిచింది. కాని తరవాత రామచంద్రదేవుడి నుంచి ఒక దుర్వార్త వచ్చింది; ఉస్మాన్‌ఖాన్ యుద్ధ సన్నాహాలు మళ్ళీ ఆరంభించాడట. ఒరిస్సాలో మళ్ళీ అశాంతి చెలరేగుతుంది కాబోలునని జగతసింహుడు విచారించాడు.

త్వరలోనే మరొక వార్త వచ్చింది. ఉస్మాన్ పూరీని ఆక్రమించాడు. రామచంద్రదేవు డింకొక దుర్గానికి పారిపోయి తల దాచుకున్నారు.

మళ్ళీ తలఎత్తిన పఠానులను నాశనం చెయ్యటం తన విధిగా భావించి మహాసింహుడు గొప్ప సేనను తీసుకుని ఒరిస్సాకు వెళ్ళాడు. భద్రకు దగ్గరలోనే ఉభయ సైన్యాల మధ్యా అతి భయంకరమైన యుద్ధం జరిగింది.

ఉస్మాన్ అమితోత్సాహంతో యుద్ధం చేసి, మొగలాయా సేనలను ఘోరంగా ఓడించాడు. పారిపోతున్న తన సైనికుల వెంట మహాసింహుడు కూడా వెనక్కు మళ్ళవలిసి వచ్చింది.





ఒరిస్సా అంతా మళ్ళీ పఠానుల అధీన మయింది. అయుషా ఇచ్చిన ఉత్సాహంతో ఉస్మాన్‌ఖాను బెంగాలును కూడా జయించటానికి బయలుదేరాడు. ఉస్మాన్ ధాటిని మహాసింహుడు ఏమీ అడ్డగించలేక పోవటం చేత జగతసింహుడు కూడా యుద్ధరంగానికి బయలుదేరి వచ్చాడు.

అతి స్వల్పకాలంలోనే పఠానులు మేదినీపూర్, కోల్హానులను పూర్తిగా ఆక్రమించి, మరి కొన్ని ప్రాంతాలను కొంత మేర జయించుకున్నారు. యుద్ధం జరిగినప్పుడల్లా విజయం ఉస్మాన్‌దే. అతని శక్తి సాహసాలను విరోధులే మెచ్చుకునే వారు. ఒరిస్సా లాగే బెంగాలు కూడా పఠానుల వశ మవుతుందని అనుకున్నారు.

అయుషా సంతోషానికి మేరలేదు. ఆమె ఆయుధాలు పట్టి యుద్ధరంగంలో పోరాటం మినహాగా యుద్ధక్రమంలో పూర్తి పాత్ర నిర్వహించింది. ఉస్మాన్‌ఖాన్ పొందిన ఉత్సాహం అంతా ఇంతా కాదు. అతన్ని ఎదట పడి జయించటం తన వల్ల కాదని జగతసింహుడు నిశ్చయించుకుని, ఉస్మాన్‌ను చంపే ఉపాయాలాలోచించ సాగాడు. చివర కొక ఉపాయం దొరికింది.

వర్ధమానాన్ని జయించినట్టయితే బెంగాలుదేశ మంతా ఉస్మాన్ చేతికిందికి వస్తుంది. మందారణ దుర్గం స్వాధీనపరచుకుని దాన్ని సైనిక శిబిరంగా వాడుకున్నట్టయితే వర్ధమానాన్ని జయించటం తేలిక. అందుచేత ఉస్మాన్ కొంత సైన్యాన్ని మందారణ దుర్గం పైకి పంపాడు. ఆ సమయంలో జగతసింహుడు వర్ధమానంలోనే ఉన్నాడు. ఆ సంగతి ఉస్మాన్‌కు తెలుసు. జగతసింహుడు ఎప్పుడైనా తన అత్తవారి ఇల్లయిన మందారణకు వస్తాడేమో చూస్తూ ఉండమనీ, అతన్ని ప్రాణాలతో పట్టుకుని తన వద్దకు తీసుకు రమ్మనీ ఉస్మాన్ తన సైనికులకు చెప్పిపెట్టాడు.



ఉస్మాన్ సైనికులు మందారణ దుర్గ ప్రాంతపు అరణ్యాలలో దాగి ఉండి జగత సింహుడి రాక కోసం నిరీక్షించారు, కాని అతను రాలేదు. అతను కొద్ది మంది సైనికులను తీసుకుని, కాలిబాటల వెంట ఒరిస్సా వేపుగా బయలుదేరాడు. ఎలాగైనా ఉస్మాన్‌ను చుట్టుముట్టి చంపెయ్యాలని అతని ఉద్దేశం. అలాటి ఉద్దేశమే ఉస్మాన్‌కు కూడా ఉండటం చేత అతను కూడా కొద్ది మంది సైనికులను తీసుకుని జగతసింహుడి కోసం కారాడుతూ తిరగసాగాడు.

ఒక రోజు జగతసింహుడికి ఉస్మాన్ ఆచోకీ తెలిసింది. అతను కొద్ది మంది సైనికులతో సువర్ణరేఖా నదీ తీరానికి దగ్గరలో ఉన్నాడు. వెంటనే జగతసింహుడు దక్కడికి తన సైనికులతో సహా బయలుదేరాడు. జగతసింహుడి రాక పసిగట్టి ఉస్మాన్, తనకు యుద్ధకాంక్ష లేనట్టు గుర్తుగా ఒక సైనికుడికి తెల్లజెండా ఇచ్చి జగతసింహుడి కెదురు పంపాడు. తెల్లజెండా తెచ్చినవాడు జగతసింహుడితో, "మీ మా సైనికుల మధ్య యుద్ధం వల్ల ప్రయోజనమేమీ ఉండదు. ఉభయ పక్షాల వారి ఉద్దేశాల ననుసరించి మీరూ, మా నవాబుగారూ ద్వంద్వయుద్ధం చేసుకోవటం మంచిదని మా నవాబుగారు చెప్పుతున్నారు."



అన్నాడు. జగతసింహుడు తన సమ్మతి ఉస్మానుకు అందజేశాడు. ఉస్మాన్ ఆయుధాలు ధరించి వచ్చాడు.

ఇద్దరూ కలియబడి భయంకరంగా యుద్ధం చేశారు. ఉభయ పక్షాల సైనికులూ ఎడంగా నిలబడి ఆ యుద్ధాన్ని చూశారు. ఇద్దరూ కొంత గాయపడ్డారు, కాని ఒక దశలో ఉస్మాన్ బల్లెం కూడా జగతసింహుడికి దొరికింది. అతనా బల్లాన్ని ఉస్మాన్ తలకు గురిచేసి బలంగా విసిరాడు. దాని తాకిడికి ఉస్మాన్ తల తిరిగిపోయి, కళ్ళు చీకట్లు కమ్మి, నిశ్చేష్టుడై నిలబడ్డాడు. ఆ క్షణంలో జగతసింహుడు తన వద్ద వున్న రెండో బల్లాన్ని ఉస్మాన్ వక్షానికి గురిచేసి బలం కొద్దీ విసిరాడు.

దానితో ఉస్మాన్ ఆ క్షణంలోనే చచ్చి ఉండవలసింది. కాని ఆయుషా, సాక్షాత్కరించిన దేవత లాగా ఉస్మానుకు అడ్డంగా వచ్చింది. అందరూ ఒక్కసారిగా కేక పెట్టారు. ఆ కేకతో ఉస్మాన్ చైతన్యవంతుడై చూసే సరికి బల్లెం ఆయుషా వీపులోకి గుచ్చుకుపోయి ఉన్నది. అది గమనించిన జగతసింహుడు నిలువునా కంపిస్తూ, చేతులు పై కెత్తాడు.

ఆయుషా ప్రాణాలను కాపాడటానికి వైద్యులు వచ్చారు గాని వారి వల్ల ఏమీ కాలేదు. ఆయుషా ఆఖరుసారిగా ఉస్మానుకూ జగతసింహుడికీ వీడ్కోలు చెప్పి కన్ను మూసింది.

జగతసింహుడు తల వంచుకుని కన్నీరు కార్చాడు. ఉస్మాన్ కంటి వెంట నీరు కార్చలేదు. ఒక్క నిట్టూర్పు కూడా విడవలేదు; అతని నోట మాట కూడా రాలేదు.

ఉస్మాన్ ఉత్సాహశక్తులూ, పఠానుల భవిష్యత్తూ ఆయుషాతోనే అంతరించాయి. ఒరిస్సా మొగలాయీల వశమయింది. భారత దేశంలో పఠానుల సామ్రాజ్యమే అంతమైపోయింది. (అయిపోయింది)

